"చూడమ్మా, నీకొచ్చిన కష్టం ఏమిటో మాకు తెలియదు. కాని ప్రతి సమస్యకి ఏదో పరిష్కారమార్గం ఉండకపోదు. ఆ మాత్రందానికోసం నిండుప్రాణం తీసుకోడం అవివేకం...." విజయ మృదువుగా ఆమె చెయ్యి నిమిరి ఏదో చెప్పబోయింది.

"అవును డాక్టర్, అందరూ అలాగే కబుర్లు చెపుతారు. సుఖంగా బతికే మీలాంటివాళ్ళకి నా కష్టం ఏమిటో అర్థం గాదు. ...ద్దకబుర్లు చెపుతారు, నీతులు బోధిస్తారు. పిల్లికి చెలగాటం, ఎలకకి ...ాణసంకటం. ఆ బాధ మీ కర్థం కాదు." ఉక్రోషం, కసి, నిరాశ ...వేసుకోగా నిస్సహాయంతో కోపం ముంచుకొచ్చి కటువుగా అంది ...ారద.

"బాధ - బాధలు అన్న మాటకి అర్థం నాకు తెల్సినంతగా మరొకరికి తెలియదమ్మా. ప్రతీ మనిషి తనొక్కరే ప్రపంచంలో బాధలన్నీ పడుతున్నామనుకుంటారు."

అదోలా నవ్వింది విజయ.

"వద్దు డాక్టరుగారూ, ఈ మాటలన్నీ నాకు చెప్పకండి. ఓర్పు, శాంతం ఈ మాటలన్నీ విని విని విసిగిపోయాను. నన్నొలాగో చావ ...యకుండా బతికించారు. నా ఖర్మానికి నన్ను వదిలి వెళ్ళండి, నా ఏడుపు నన్నేడవనీయండి." విరక్తిగా అని శారద కళ్ళు మూసుకుంది.

విజయ శ్రీధర్ వంక చూసింది.

"విజయా ఆ అమ్మాయిని పడుకోనియ్యి. మనం తరువాత మా...ట్లాడుదాం. ఇంజక్షనిచ్చాను. పడుకుంటుంది. లేచాక మాట్లాడ...చ్చు" అన్నాడు.

విజయ, శ్రీధర్ యిద్దరూ అక్కడనించి నెమ్మదిగా లేచి ...ళ్ళారు.

"ఆ అమ్మాయి పాపం చాలా విరక్తితో, బాధతో ఆత్మ హత్యకి పాలుపడిందనిపిస్తూంది, పాపం ఏం జరిగిందో" జాలిగా అంది విజయ కన్సల్టింగ్ రూములోకి రాగానే.

"ఏదో బాధ, కష్టం లేకపోతే ఎవరుమాత్రం వూరికే చచ్చి

పోవాలనుకుంటారు" శ్రీధర్ ఫ్రిజ్‌లో నీళ్ళు తీసుకు తాగి విజయకి ఓ గ్లాసు అందించాడు.

గంట క్రితం అపస్మారక స్థితిలో వున్న శారదని యిరుగు పొరుగు యిద్దరు ముగ్గురు మోసుకొచ్చారు నర్సింగ్ హోముకి. చామనఛాయ రంగులో, సన్నగా నాజుగ్గా వుండి, చదువుసంస్కారం ఉట్టిపడే వేషంతో వున్నది శారద. పట్టుమని ఇరవై ఇరవై రెండేళ్ళు కంటె వుండని ఆ అమ్మాయికి ఆత్మహత్య చేసుకోవాల్సిన కష్టాలు ఏమి వచ్చిందో విజయకి అర్థం కాలేదు. పొరుగింటి ముసలాయన యిచ్చిన సమాచారంవల్ల శారద భర్తకి ఏదో కంపెనీలో పని. పెళ్ళయి ఏణ్ణర్థం అయింది. పిల్లలు లేరు. శారద భర్త నిన్న కంపెనీ పనిమీద కలకత్తా వెళ్ళాడు. ఇవాళ మధ్యాహ్నం మూడు గంటలకి చాకలివాడు బట్టలుతెచ్చి ఎన్నిసార్లు పిలిచినా తలుపు తీయ లేదు శారద. పైన తాళంలేదు. లోపల గడియవేసి వుండడం, శారద ఎంతకీ పలకక పోవడంతో చాకలివాడికి ఆశ్చర్యం, అనుమానం వేసి పక్కనించి వెళ్ళి బెడ్‌రూము కిటికీలోంచి తొంగిచూశాడు. శారద పక్కమీద పడుకునివుంది. కిటికీలోంచి ఎన్నిసార్లు పిలిచినా శారదలో చలనం లేదు. చాకలివాడికి గదిలోంచి ఏదో మందు వాసన కూడా వేసింది. అనుమానం తోచి పక్కింటి ఆయన్ని పిలుచుకు వచ్చాడు. గదిలో పరిస్థితి చూడగానే వాళ్ళకీ అనుమానం వచ్చింది. ఆ గలభాకి యిరుగు పొరుగు మూగారు. అంతా కలిసి వీధి తలుపు బద్దలు కొట్టారు. శారద పక్కమీద తెలివి తప్పి పడివుంది. [illegible] టిక్ ట్వంటీ ఖాళీ సీసా. అందరికీ పరిస్థితి అర్థం అయింది. [illegible]క ఆ వీధిలోనే వున్న 'విజయశ్రీ' నర్సింగ్‌హోముకి మోసుకొచ్చారు. డాక్టర్ శ్రీధర్, విజయ ఒకగంట నానా తంటాలు పడి స్టమక్ వాష్ చేసి, ఇంజక్షన్లు యిచ్చాక శారదలో చలనం కనిపించింది. మరో అరగంట ఆలస్యం అయితే ప్రాణం పోయివుండేది. తెలివి వచ్చి తనున్న స్థితి చూసుకోగానే శారద తన యత్నం విఫలమైనందుకు, నలుగురి నోళ్ళల్లో పడిపోయినందుకు సిగ్గుతో, బాధతో తనని తాను మరిచి హిస్టీరియా వచ్చినదానిలా హృదయవిదారకంగా ఏడ్చింది.

1PLA133M116

అంత చిన్నవయసులో వుండి ఏ కారణంతో యింత ఘాతుకానికి పాల్పడిందో అన్న జాలితో డాక్టర్ విజయ మనసు ద్రవించింది. పొరుగింటి ఆయనవల్ల ఏ సమాచారం రాబట్టలేకపోయింది విజయ. శారద బాగా కోలుకున్నాక ఆమెనించి వివరాలు సేకరించి తనేదన్నా చేయగలిగిన సహాయం వుంటే చెయ్యాలని నిర్ణయించుకుంది విజయ.

"ఏమిటో నీ పిచ్చిగాని, లోకంలో ఎందరో యిలాంటివాళ్ళు. తలిపడినా సహాయం ఎంతమందికి చెయ్యగలం. ఎవరి సమస్యలు వాళ్ళవి. అనవసరంగా నీ బుర్ర పాడు చేసుకుంటావెందుకు చెప్పు." రాత్రి విజయ శారదగురించి పదేపదే విచారిస్తుంటే ఆఖరికి అన్నాడు శ్రీధర్.

"నీకు తెలియదు శ్రీధర్. ఏ ఆడపిల్లన్నా నిండు నూరేళ్ళ జీవితం పరిసమాప్తి చేసుకోవాలనుకుంటే ఆమె మనసెంత కృంగిపోయి వుంటుందో నీ కర్థం కాదు. నాకు తెలుసు, పెళ్ళయి భర్తతో కాపురం చేసుకుంటున్న ఆ అమ్మాయికి అంత రాకూడని కష్టం ఏముంటుంది? భర్త అనాదరణో, అనుమానమో కారణం అయి వుంటుందని నాకు గట్టి నమ్మకం. అందుకే నాకంత ఆరాటంగా వుంది శ్రీ."

"పిచ్చీ - ఇంత సెన్సిటివ్ అయితే ఎలా చెప్పు. రేపు అడుగుదాంలే. ఇంక నిద్రపో" ప్రేమగా ఆమె జుత్తు సవరించుతూ అన్నాడు శ్రీధర్. అతని గుండెల్లో వదిగిపోయి "ఏ స్త్రీ అయినా భర్త ఆదరణ, అభిమానానికి దూరమైతే ఆ బ్రతుక్కి అర్థం కనిపించదు. ఇది మీ మగవాళ్ళకి అర్థంకాని విషయం శ్రీ —" విజయ వేలగ అంది. శ్రీధర్ నవ్వి ఆమెని దగ్గిరకి పొదువుకున్నాడు.

* * *

ఉదయం నర్సింగ్‌హోమ్‌కి వస్తూనే డాక్టర్ విజయ శారద గదిలోకి ఆరాటంగా వచ్చి చూసింది.

శారద రాత్రంతా నిద్ర పట్టీ పట్టనట్టు మత్తుగా, తెల్లవారు ఝామున కాస్త బాధ తగ్గి నిద్రపోయింది. ఏడు గంటలకి లేచాక వేడి వేడి కాఫీ త్రాగాక కాస్త ప్రాణం కుదుటపడినట్టు తేటగా అన్పిం

చింది. గదిలోకి వచ్చిన డాక్టరుని చూడగానే శారద మొహం సిగ్గుతో కొ_స్త ఎఱ్ఱబడింది. తను చేసిన పనికి సంజాయిషీ యిచ్చుకోవాల్సిన పరిస్థితిలో పడినందుకు యిబ్బందిగా కదిలింది. విజయ వస్తూనే స్నేహపూర్వకంగా నవ్వి శారద చేయి అందుకుని పల్సుచూస్తూ "ఏమ్మా రాత్రి బాగా నిద్ర పట్టిందా? కడుపులో వికారం అది పూ_ర్తిగా పోయిండా—ఉదయం మందు వేసుకున్నావా?'' డాక్టరుగా ప్రశ్నలు వేసింది. శారద తల ఆడించింది. శారదలో నిన్నటి ఆవేశ నిరాశ, నిర్లి_ప్తత కొ_స్త తగ్గి ప్రశాంతంగా వున్నట్టు కనపడగానే, ''ఏమ్మా, యింట్లో యింకెవరూ లేనట్టున్నారే. మీ వారు ఎప్పుడు వస్తారు. వారికి టెలిగ్రాం ఈయమన్నావా?—" అనడిగింది.

శారద చప్పున తల అడ్డంగా వూపుతూ 'వద్దు—వద్దు' అంది గాభరాగా. విజయ శారద మొహంలో హావభావాలు ఆశ్చర్యంగా పరిశీలించి ''పోనీ—మీ అమ్మా నాన్నగార్ల ఎడ్రసు చెప్పు ఎలాగైనా రెండు రోజులు రెస్టుతీసుకోవాలి నీవు.''

"వద్దు డాక్టర్. నా కెవరూ లేరు, నే నెవరికీలేను. ఎవరికీ రాయవద్దు—" అంది అదోరకం విర_క్తితో.

"అంటే నీకు తల్లిదండ్రులులేరా. పోనీ అన్న తమ్ములు.

''ఉన్నారు డాక్టర్, అందరూ వున్నారు అమ్మా, నాన్న, అక్కా అన్నయ్యలు, చెల్లెళ్ళు-కాని నేనెవరికీ లేను. నే నేమయినా విచారించే వాళ్ళు లేరు.'' శారద కళ్ళల్లో నీరు తిరిగింది. విజయకేమి అర్థం కాలేదు. ఒక్క_క్షణం శారదని పరీక్షిస్తూ "చూడమ్మా శారదా నే నొక ప్రశ్న అడిగితే ఏమనుకోవు గదా....''

''ఏమి అనుకోడానికి ఏముందిగాని మీ రడిగే ప్రశ్న నాకు తెలుసు డాక్టర్. డాక్టర్‌గారూ నిన్న ఏదో దుఃఖంలో ఆవేశంలో ఏదో అనేశాను ఏమనుకోకండి. మీరు డాక్టర్లు, ఒక మనిషిని మృత్యు ముఖంనించి కాపాడ గలిగినందుకు మీకు చాలా ఆనందంగా వుండచ్చు. కాని నన్ను రక్షించి మీరు నా కెంత ద్రోహం చేశారో మీ క్కు_తెలియ కాదు. చచ్చిపోవడంతో నా సమస్యకి పరిష్కారం దొరుకుతుందని ఆశించాను. కాని కథ మళ్ళీ మొదటికి వచ్చింది డాక్టర్."

''చూడమ్మా-సమస్యకి పరిష్కారం చావే అయితే లోకంలో ఏ సమస్యా మిగిలే వుండదు. చచ్చిపోయి నీవు సాధించగల్గింది ఏముంటుంది. నీ కోసం ఒకరో యిద్దరో రెండు రోజులు ఏడుస్తారు. నీవు, నీ కథ కాలగర్భంలో నాలుగు రోజులలో కల్సిపోతారు. నిండు జీవితాన్ని అర్థాంతంగా పరిసమాప్తి చేసుకుంటే నష్టపోయేది నీవు కాని మరెవరూకాదు. అంచేత నీ సమస్య నీవే పరిష్కారం....''

"తెల్సు డాక్టర్. ఇదంతా నాకు తెలుసు. అన్ని ప్రయత్నాలు విఫలమయితే భవిష్యత్తులో ఏ ఆశకనపడకే యింతకి తెగించాను. డాక్టరుగారూ నేను మనిషిని. ఓము నెత్తురు వున్నదాన్ని. ఆత్మాభిమానం, ఆత్మగౌరవం చంపుకుని పశువులా ఎలా బతకగలను. కాస్తో కూస్తో చదువుకున్నాను. బొత్తిగా వ్యక్తిత్వం అన్నది పరిచిపోయి బానిసలా ఎలా బతకగలను మీరే చెప్పండి. డాక్టరుగారూ మీ కర్థం కాదు నా వ్యధ. ఈ ఫరిస్థితిని అనుభవించిన వాళ్ళకిగాని అర్థంకాదు" శారద ఆవేశంగా అంది. విజయ అదోలా నవ్వింది. "ఈ బాధ నా కర్థం అయినట్టు మరొకరికి అర్థంకాదు శారదా. అందుకే నీ బాధ ఏమిటో తెల్సుకోవాలని నా ఆరాటం. నీవేం అనుకోకపోతే, అభ్యం లేకపోతే నీ బాధ ఏమిటో నాకు చెప్పు. నన్ను ఓ డాక్టరిలాకాక ఓ స్నేహితురాలిగా భావించు. నే నేమయినా సహాయపడగలనేమో చూస్తాను." శారద చెయ్యి చేతిలోకి తీసుకుని స్నేహపూర్వకంగా అంది. ఆమె చూపిన అభిమానానికి, ఆదరణకి శారద కళ్ళు చెమ్మగిల్లాయి. "డాక్టర్‌గారూ నా మీద మీ రింత దయ ఎందుకు చూపిస్తున్నారు" అంది పట్టుకున్న గొంతుతో. విజయ ఆ మాట విననట్టు నవ్వి ఆప్యాయంగా శారద చేతిపై చెయ్యివేసి నిమిరింది.

"డాక్టరుగారూ ఎలాచెప్పను, ఏం చెప్పను. ఏ స్త్రీ తనంతట తాను చెప్పుకోలేని సంగతులు యివి. చెప్పినా ఎవరూ ఏం చెయ్యలేని పరిస్థితి యిది" బిడియంగా అంది శారద.

"శారద మీ వారి గురించేనా నీవు చెప్పబోయేది. మీ వారు నిన్ను సరిగా చూడరా'' అనుమానంగా అంది విజయ. శారద కాస్త ఆశ్చర్యంగా 'మీ కెలా తెలుసు? ఎలా తెల్సింది?' అంది. డాక్టరు

విజయ అదోలా నవ్వింది.

"అనుభవం నేర్పిన పాఠం. భర్త నిరాదరణ ఒక్కటే ఆడదాని మనస్సుని ఇంత విరక్తిలో పడేస్తుందని నాకు తెలుసు. ఆత్మహత్య చేసుకొనేటంత తెగింపు ఒక స్త్రీకి ఏర్పడిందంటే భర్త హింస ఒక్కటే కారణం అన్నది నాకు తెలుసు. ఐతే పిల్లలున్న స్త్రీ ఆ పిల్లలకోసం ఆ నరకం సహిస్తుంది. నీకు పిల్లలులేరు గనక ఆ బంధం నిన్ను బంధించలేదు. ఏం నిజమేనా?"

శారద ఆశ్చర్యంగా చూసింది. "డాక్టరుగారూ మీరు మీకు అనుభవం అంటున్నారేమిటి? మీ యిద్దరిని చూస్తుంటే ఎంతో ముచ్చటైన దాంపత్యం అనిపిస్తుంది. డాక్టర్ శ్రీధర్‌గారు సంస్కారులని చూస్తేనే తెలుస్తుందే. అలాంటిది మీరేమిటి ఇలా అంటున్నారు. అనుమానంగా వుంది."

"శ్రీధర్—శ్రీధర్ దేముడు. శ్రీ గురించి కాదు నేను చెప్పేది—"

"మరి?" మధ్యలోనే తెల్లబోతూ అడ్డింది శారద.

"నా గురించి తర్వాత, ముందు నీ గురించి చెప్పు. ఒక్క అరగంటే టైముంది తరువాత నాకు యింక తీరదు." విజయ తొందర పెట్టింది.

శారద ఒక్క నిమిషం మాటలకోసం తడుముకుంది."ఎక్కడ నించి చెప్పను. ఎలా మొదలుపెట్టను.'' శారద గొణిగినట్లు అంది.

నిజమే. జీవితాన్ని కథలా చెప్పడం సుళువా? శారదలాంటి మామూలు ఆడపిల్ల ఏం చెప్పగలదు? ఎలా చెప్పగలదు? తను కన్న కలలన్నీ గాలిలో కలిసిపోయాయని బతుకులో తీపి, ఆశ హరించి పోయిందని ఎవరితో ఏమని చెప్పుకోగలదు?

విజయ అసహనంగా కదలడం చూసి శారద తనని తాను కూడదీసుకుంటూ "డాక్టరుగారూ మీ రన్నట్టు భర్త నిరాదరణ ఏ స్త్రీ సహించలేదు. కేవలం నిరాదరణే అయితే ఏదో మనసు చంపుకొని గానుగెద్దులా బతకవచ్చు. కాని ఆత్మాభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని వదులుకుని అవమానాలు సహిస్తూ ఏణ్ణర్ధం బతికాను. ఆయనలో ఏ

నాటికన్నా మార్పురాదా అన్న ఆశతో ఈ నాటివరకు ఓపిగ్గా ఎదురు చూశాను. కాని నా ఆశ వృథా అడయాస అని ఇన్నాళ్ళల్లో జరిగిన ప్రతి సంఘటన బలపరుస్తూంటే భవిష్యత్తులో ఏ ఆశ కనిపించక యింతకి తెగించాను డాక్టర్."

"ఏం ఆయన కీ పెళ్ళి యిష్టంలేదా? నిన్ను హింసించడానికి కారణం ఏమిటి?'' విజయ కుతూహలంగా అడిగింది.

"కారణం? ఆ కారణమేమిటో ఈ నాటికీ నా కర్థంకాదు డాక్టర్. పెళ్ళి చూపులకి వచ్చారు. నచ్చిందన్నారు, చేసుకున్నారు. ఎవరూ బలవంత పెట్టినట్టు నేను వినలేదు. నా పట్ల ఆయన ప్రవర్తనకి ఒక కారణం అంటూవున్నట్టు నాకు కనపడలేదు. ఆఖరికి అది ఆయన తత్వం. భర్త అంటే భరించేవాడు. పెళ్ళానికి తిండిపెట్టి పోషిస్తున్నప్పుడు ఆ భార్య తనకింద బానిసలా వుండాలేగాని ఆమెకో వ్యక్తిత్వం వుండరాదని ఆయన భావం అని చాలారోజులకి కాని అర్థంచేసుకోలేక పోయాను."

"విచిత్రమే! చదువుకున్నారు. మంచి ఉద్యోగంలో వున్నట్లున్నారు. అయినా యింత పాత భావాలు ఆయనలో వున్నాయంటే. ఈ రోజుల్లోనూ యిలాంటి పురుషులు వున్నారంటే అనుభవించిన వారుగాని నమ్మరు. ఆయనిలా ప్రవర్తించడానికి ఏదయినా కారణం వుండేమో కనిపెట్టడానికి ప్రయత్నించావా, ఆయనని మార్చడానికి ఏమయినా ప్రయత్నం చేశావా అసలు? మీ అత్తగారు మామగారు వున్నారా, వాళ్ళకి కొడుకు యిలా ప్రవర్తిస్తున్నాడన్న విషయం తెలుసా?'' ఒక్కుమ్మడిగా ప్రశ్నలు కురిపించింది విజయ.

"అందరికీ తెలుసు డాక్టర్. ప్రతీవాళ్ళుచెప్పే నీతులు ఒకటే. భర్త మనసెరిగి మసులుకోవాలి. ఆడదానివి నీవే కాస్త సర్దుకోవాలి. ఈ మాత్రం దానికి కాపురాలు వదలుకుంటారా. ఆడదాని బతుకు అరిటాకు లాంటిదమ్మా. మన అదృష్టం యింతేనని సరిపెట్టుకోవాలి తల్లీ. భర్తని కాదన్న ఆడదానికి పుట్టింట్లో కూడా స్థానం వుండదమ్మా అంచేత కాస్త చూసి చూడనట్టు సర్దుకోవాలి అమ్మా. డాక్టరుగారూ ఈ నీతిసూక్తులు వినివిని విసిగిపోయాను. సర్దుకోడం ఎంతకని?

ఎన్నింటికని ప్రతిరోజు ప్రతిక్షణం ఎదురు తిరిగే ఆత్మాభిమానాన్ని బలవంతంగా ఎన్నాళ్ళని అణిచిపెట్టి బతుకను?" ఆవేశంతో శారద గొంతు వణికింది.

విజయ శారద వంక సానుభూతిగా చూసింది.

"డాక్టరుగారూ సరిగా ఏణ్నర్థం క్రితం ఆయనతో నా జీవితం ముడిపడింది. ఈ ఏణ్నర్థంలో కనీసం మొదటి రోజైనా నేను కన్న కలలు నిజమవలేదు. నేను ఏణ్నర్థ వైవాహిక జీవితంలో మన శ్శాంతిగా ఒక్కరోజైనా గడపలేదంటే మీరు నమ్మాలి. అలా అని నేను కోరరాని కోరికలు కోరలేదు. సినిమాలు, నవలల్లో మాదిరి, సినిమా సెట్టింగులాంటి యిల్లు, కార్లు, నవమన్మథుడిలాంటి భర్త - నన్ను కాలు కదపనీయకుండా నెత్తిన పెట్టుకొని పూజించే భర్త కావాలని ఆశించలేదు. నన్ను అర్థం చేసుకొని, ఆదరించి, అభిమానించి అనురాగంతో చూసే భర్త రావాలని, మాది ముచ్చటయిన సంసారం అవాలని మాత్రం కోరుకున్నాను. ఇదే అత్యాశ అంటారా? ప్రతి కన్నెపిల్ల కోరుకొనే కనీస కోరికలు కావా యివి? ఇంత చిన్న కోరికలు కూడా తీరని నా బతుకు నరకమవడానికి నేను చేసిన అపరాధం ఏమిటి? ఆడపిల్లగా పుట్టడమా? లేక నా పూర్వజన్మ సుకృతమని సరిపెట్టుకోవాలా?

"డాక్టరుగారూ నాకూ ఓ డిగ్రీ వుంది. ఆత్మాభిమానం వుంది. వ్యక్తిత్వం వుంది. ఇవి వుండడంవల్ల నేను సుఖపడలేకపోయాననుకుంటాను. ఇవేవీ లేకపోతే నేనూ ఇదివరకు రోజుల్లో ఆడవాళ్ళ మాదిరి భర్తే దైవం, భర్తకి భార్యని తిట్టి కొట్టే హక్కు వుంది. భర్త ఏం చేసినా పడుండటం హిందూ స్త్రీ ధర్మం-అనుకుంటూ నేనూ ఓ మనిషినని మరిచి ఆయనకి వళ్ళప్పగించి ఆయన కొట్టిననాడు యింతే అదృష్టం అనుకొని ఏడ్చి, కొట్టనినాడు సంతోషించి ఆయన పాదాల చెంత యింత చోటిచ్చారు అనుకొని సంతోషించి, సంతృప్తిపడి గానుగెద్దులా బతుకు యీడ్చేదాన్ని...."శారద ఆవేశంగా చెప్పుకు పోతూంది.

"అసలు మీ మధ్య కలతలు రావడానికి కారణం ఏమిటి?"

ఆ వాగ్ధోరణిని ఆపి ప్రశ్నించింది విజయ్.

"ఒకటేమిటి? డాక్టరుగారూ! చూడండి, మా నాన్నగారికి మేము ఐదుగురు సంతానం. ఆయన బ్యాంకి మేనేజరు. వెయ్యి రూపాయల పై జీతం అన్న మాటేగాని ఈ రోజుల్లో ఐదుగురు పిల్లలని పెంచి పెద్ద చేయడానికి ఆ వెయ్యి రూపాయలు ఏ మూల? అపురూపంగా, ఐశ్వర్యాల మధ్య మేము పెరగకపోయినా మాకే లోటు లేకుండానే పెంచారు మా వాళ్ళు. ఆడపిల్లలకీ డిగ్రీలు దాకా చెప్పించారు. మా అక్క బి. యస్సీ అవగానే ఒక కాలేజి లెక్చరర్‌కిచ్చి బాగానే కట్న కానుకలు యిచ్చి పెళ్ళి చేశారు. మా అన్నయ్య యింజనీరింగు ఆఖరి సంవత్సరం. నేను మూడోదాన్ని. నా తరవాత చెల్లెలు మెట్రిక్, తమ్ముడు ఫోర్తుఫారం-యిదీ మా కుటుంబం. ఆడంబ రాలకి పోకుండా వున్నదాన్లో గుట్టుగా సంసారం చేస్తే దేనికి లో లేని సంపాదన మా నాన్నగారిది. అక్క పెళ్ళికి తీసుకున్న లో తీరకుండానే నేను పెళ్ళికి సిద్ధమైపోయాను. బి. ఏ. డిగ్రీ వచ్చిం దగ్గర్నుంచి నాన్నగారు సంబంధాల వేట ప్రారంభిం నా అందం చూసి తిరిగిపోకపోయినా, కట్న కానుకలు చాలక సంబంధాలు కుదరలేదు. ఇంట్లో నాన్న అమ్మ అవస్థలు 'ఏమిటమ్మా అక్క పెళ్ళి అప్పు తీరలేదు, యింకా నా పెట్టి చేస్తారు? ఇదుగో ముందే చెపుతున్నాను కట్నం తీసుకో చేసుకోను. నేనసలు యిప్పటినుంచీ చేసుకోను, ఏదన్నా చేస్తాను' అని గొణిగాను.

"మా బాధలు ఏవో మేం పడ్తాండగా నీకెందుకీ అనేది అమ్మ.

ఏదో అన్నానుగాని ఆడపిల్లకి పెళ్ళి చెయ్యక తప్పదు కట్నం తీసుకోకుండా పెళ్ళాడే సంస్కారులు నూటికి ఒకరన్నా వుండరనీ తెలుసు నాకు. ఉద్యోగం రావడం అంత సులభం కాదనీ తెలుసు. నాలాంటి ఆడపిల్లలు యించుమించు ప్రతి యింటా వుంటారు. ఏవేవో ఆశలు, అభ్యుదయ భావాలు అందరికీ వుంటాయి. ఆవేశంలో ఏవేవో నిర్ణయాలు చేసుకోవడం తప్ప ఆచరణలో అవి

నిలువలేవని కాలం పాఠం నేర్పింది నాకు. పెళ్ళికి వప్పుకోక తప్ప లేదు.

శివరామ్ కెమికల్ యింజనీరు. తండ్రి లాయరు. మరీ సంప న్నులు కాకపోయినా మాకంటె పై మెట్టులో వున్నవారే. పెళ్ళి చూపులు అయ్యాయి. పిల్ల నచ్చిందన్నారు. శివరామ్ అందగాడు అని చెప్పలేకపోయినా ఏ వంక పెట్టలేనివాడు. అన్నివిధాలా మంచి సంబంధం. ఓ వెయ్యి రెండు వేలు ఎక్కువైనా సంబంధం వదల కండి. పిల్ల సుఖపడుతుంది. అమ్మ పోరు పెట్టింది. కాని వాళ్ళు కట్నం ఎనిమిది వేలు, లాంఛనాలు వేరు అనగానే నాన్న నీళ్ళు కారి పోయాడు.

కట్నం గురించి ఇంట్లో వాళ్ళ చర్చలు వింటూంటే ఆడ పిల్లగా పుట్టడం ఏదో నా నేరంలా నా అపరాధంలా బిడియపడ్డాను. ఆడపిల్లగా పుట్టించినందుకు ఆ భగవంతుడ్ని నిందించాను. నాకెం దుకో మనసులో వాళ్ళందరూ చదువుకున్నవాళ్ళు కట్నం వద్దంటారని పెళ్ళికొడుకు కట్నం వద్దని తన సంస్కారం నిరూపించు కుంటాడని ఆశించాను. కాని వాళ్ళంత ఖచ్చితంగా అడిగారని విన గానే మనసులో ఏదో అసంతృప్తి చోటు చేసుకుంది.

ఆఖరికి నాలుగు రోజులు కిందా మీదా పడి ఆలోచించి ఆలో సంబంధం చేయడానికే నిర్ణయించారు అమ్మ నాన్న. ఫండు లోంచి అప్పు, బ్యాంకులో కొంత అప్పు, మా నుంచి కొంత తీసుకోడానికి నిశ్చయించారు.

డాక్టరుగారూ, యింత విపులంగా ఎందుకు చెప్తున్నానంటే నించి జరిగిన ఒక్కొక్క సంఘటన నా మనసు మీద ఎలా తీసాయో మీకు అర్థం కావాలని...."

విజయ అంగీకారంగా తల ఊపింది.

"కట్న కానుకల భారం ఎక్కువవడంతో పెళ్ళి క్లుప్తంగా చెయ్యక తప్పలేదు మా నాన్నగారికి. మా అక్కకి పదివేలు యిచ్చిన మాట నిజం. మొదటి కార్యం అని కాస్త ఆడంబరంగానే చేశారు. కాని ఈసారి తూగలేక అయిందనిపించాల్సి వచ్చింది. ఏర్పాట్లు

ఘనంగా లేవని, వాళ్ళకి మర్యాద చాల్లేదని పెళ్ళివారు మూతులు ముడుచుకున్నారు. 'మేం వుండేది రెండు రోజులు. పెళ్ళి బాగా చెయ్యాలని తెలీదా? యివేం ఏర్పాటులు మేం అంత గతిలేనివాళ్ళమా-మా పెద్దకోడలువారు ఎంతో ఘనంగా చేశారు. యీ చీరలేమిటి, స్టీలు బిందెలన్నా పెట్టాలని తెలీదా? యీ బట్టలు మా యింట్లో నౌకరీవాళ్ళకి పెడ్తాం' అంటూ ముహూర్తం రోజు అత్తగారు ఆడపడుచులు నానా ఆర్భాటం చేశారు. చేసేదేంలేక తెచ్చిన చీరలు మార్చి పట్టు చీరలు, స్టీలు బిందెలు వగైరా అప్పటి కప్పుడు తీసుకొచ్చారు. అడుగడుగునా వాళ్ళ ప్రవర్తన చూస్తుంటే మనసు విరక్తితో నిండింది. ఆ వున్న నాలుగు పూటలు మా వాళ్ళందరిని పరుగు లెత్తించి, కావల్సినవన్ని చేయించుకుని ఆఖరికి మూతులు ముడుచుకొనే రైలెక్కారు.

పెళ్ళికూతురితో ఎవరన్నారండి అని మాట వరసకేనా అ[illegible] లేదు వాళ్ళు. అయినా వక్కర్తినీ పంపలేక అక్కని తోడి[illegible] పంపారు నాన్నగారు. ఇలాంటి అత్తవారితో శారద ఎలా [illegible] తుందో ఏమో! బంధువులు రహస్యంగా అనుకుంటున్నామన[illegible] అన్న సానుభూతి మాటలు నా చెవిన పడకపోలేదు.

జరిగిన సంఘటనవల్లనో, లేక ఆయన స్వభావమో తె[illegible] గాని పెళ్ళికొడుకు ముభావంగా, మూడీగా వున్నట్టు అని[illegible] నాకు. రైలు ప్రయాణం చేస్తున్నప్పుడు పక్క పక్కన క[illegible] అతను నాతో మామూలు మాటలైనా మాట్లాడాలని ప్రయ[illegible] పోవడం, కొత్త దంపతుల మాదిరి ఓరగా చూస్తూ, చెయ్యి[illegible] లనే కొంటె కోర్కెలు ఏమీ అతనిలో కనపడలేదు. న[illegible] భర్తనించి చిన్న అనురాగపూరితమైన చూపు, చిన్న చిరు[illegible] ఆశించడం అత్యాశా? అతని తత్వమే అంతా? ఏదీ తేల్చుకోలే[illegible] మనిషి స్వభావం అప్పుడే నిర్ణయించగూడదని మనసుకి నచ్చచెప్పు కున్నాను. ఎంత నచ్చజెప్పుకున్నా ఎందుకనో నేను కట్టుకున్న ఊహా సౌధం గాలిమేడ అన్న భావం నాలో పొడసూపింది.

దానికి తగ్గట్టు మా అత్తగారు హఠాత్తుగా "సారె సామాను ఏమి తీసుకురావడంలేదా? మీవాళ్ళు దబ్బిచ్చేసారా? లేక తర్వాత

కొంటారా?" అంది మా అక్కవంక, నా వంక చూస్తూ. మేం యిద్దరం గతుక్కుమన్నాం. ఎదురుచూడని ప్రశ్నకి కలవరపడ్డాం.

అక్క పెళ్ళికి కూడా కట్నం ఎక్కువవడంతో పెద్దగా సారె సామాను యివ్వలేకపోయారు. రెండు మంచాలు పరుపులు, పాత్ర సామాను కొంచెం యిచ్చి పంపారు. నా పెళ్ళికి ఆమాత్రం కూడా తూగలేకపోయారు. అమ్మ ఏదో అనబోతూంటే నాన్న "నన్నింక చంపకు" అన్నారు చిరాగ్గా. నేను కూడా అమ్మతో "అంత కట్నం యిచ్చారు. వాళ్ళే కొనుక్కుంటారు. ఇంకేం ఇయ్యక్కరలేదు" అన్నాను ఖండితంగా. నా పరుపు, బట్టలపెట్టెతో బయలుదేరాను.

"ఎంతిచ్చారు మంచాలకి, ఫర్నీచర్‌కి, గిన్నెలకి" ఆవిడ ...ట్టించి మళ్ళీ అడిగారు. ఆవిడ వరస చూస్తే మరో రెండు మూడు ...లు ఖర్చుపెట్టి యింట్లో సామాను కొనియ్యాలన్నట్టుంది.

అక్క ధైర్యం తెచ్చుకుని "పెళ్ళికే చాలా ఖర్చయింది. ...కేం సారె పెట్టారు, మా నాన్నగారు చాలా యిబ్బందిపడి యీ ...ం చేయగలిగారు" అంది.

ఆవిడ చాలా వింత విషయం విన్నట్టు కనుబొమలు ముడిచి ...ంగా "ఏమిటి. పిల్లకి సారె సామాను యిచ్చుకోడం వూరి ...పకారమా ఏమిటి! అవ్వ. ఆఖరికి మంచాలు పరుపులు, ... యివ్వకుండా పిల్లని పంపడం ఎక్కడన్నా వుందా?" ...ద నిష్ఠూరంగా.

...ందరికీ యివ్వాలనే వుంటుందండి. శక్తి వుండద్దూ. ఉంటే ...ద్చుకోరా—" అంది భయపడుతూనే.

ఆవిడ మూతి ముడిచి ధుమధుమలాడుతూ "బాగానే వుంది ...ంబరం. అయ్యో రాత. అన్నీవాడే కొనాలన్నమాట. మంచి సంబంధమే చేసుకొన్నాం. చేసుకుని చేసుకుని...." అంటూ గొణిగింది.

అందరిముందు నాకు తల కొట్టేసినట్లయింది. గొంతులో దుఃఖం అడ్డుపడింది. కనీసం ఆయన అయినా తల్లిని వారిస్తాడేమో నని ఆశించాను. ఈ సంభాషణ వింటూ మొహం అప్రసన్నంగా పెట్టి

ఓసారి నా వంక చూసి తరువాత పేపరులో మొహం దూర్చుకున్నారు. నా ఊహాసౌధపు పునాది మరింత కదిలింది.

*　　　　*　　　　*

ఉదయం గృహప్రవేశం జరిగింది. అమ్మలక్కలు వచ్చారు. కొత్త కోడల్ని చూశారు. కట్నకానుకలు ఆరాతీశారు. నగలు ఏం పెట్టేరు, సారె ఏం పెట్టారంటూ ఆరా తీశారు. మా అత్తగారు నా వంక అక్కవంక వంకర చూపు విసిరి "సామాను యియ్యలేదు. రెండువేలిచ్చారు కొనుక్కోమని" అంది. మేం యిద్దరం అపరాధుల్లా తల దించుకొన్నాం.

అంతా వెళ్ళాక కూతుర్లతో, పెద్ద కోడలితో "మధ్య చావు నాకు వచ్చిపడింది. వెధవ అబద్ధాలు ఆడలేక చస్తున్నాను అందరితో. మధ్య తలవంపులు నాకు. అయినా బొత్తిగా యిలా దిష్టిబొమ్మలా పిల్లని ఓ పెట్టె యిచ్చి అత్తవారింటికి పంపడం ఎక్కడా చూడలేదు. ఎంతకని కప్పుకుంటాం ఇలాంటివి" అంటూ సాగదీసింది.

నేనింక వింటూ సహించలేకపోయాను. కోపం ముంచుకు వచ్చినా నిగ్రహించుకుని సౌమ్యంగానే "అబద్ధాలు ఎందుకండీ చెప్పడం? మా వియ్యాలవారికి లేదు యివ్వలేదు అని నిజం చెప్పండి" అనేశాను.

కొత్త పెళ్ళికూతుర్ని నేనిలా అనగానే ఆవిడ జరగరాని ఘోరం జరిగినట్లు తెల్లబోయింది. ఆడబడుచులు చురుక్కున చూశారు. తోడికోడలు కనీ కనిపించకుండా హేళనగా నవ్వింది. అత్తగారు కటువుగా అక్కని చూస్తూ "ఏమిటమ్మాయీ! మీ అమ్మ నాన్న పిల్లని బాగానే పెంచారే, అత్తగారికి ఎదురుతిరిగి మొదటిరోజే జవాబిచ్చిన పిల్ల రేపొద్దున కాపురం సరిగా చేస్తుందా? పెద్దవాళ్ళంటే భయం, భక్తి లేకుండా జవాబు యిస్తుందా? అయినా వున్నమాటంటే వులుకెందుకు?" అంటూ దులిపింది.

మళ్ళీ నేను ఏదో అనేలోపల అక్క "శారదా!" అంటూ హెచ్చరించింది.

ఆవిడ ధుమధుమలాడుతూ లేచి వెళ్ళిపోయింది.

గదిలోకి వెళ్ళాక నేను కళ్ళు తుడుచుకోవడం చూసి అక్క "ఊరుకోవే, తప్పు. కంట తడిపెట్టకు. అలాంటివి వింటూ వూరు కోవడమే. నాలుగు రోజులు అని వాళ్ళే వూరుకుంటారు. వీళ్ళతో నీకేంలే. నీవు ఆయన అన్యోన్యంగా వుంటే యివంతా లెక్కచెయ్యక్కరలేదు. నాలుగు రోజులుండి పోయేదానికి వీళ్ళతో అనవసరంగా గొడవెందుకు? ఏమన్నా మాట్లాడకు" అంది.

*　　　*　　　*

అక్క అన్నట్టు భర్త ప్రేమ, ఆదరణ లభిస్తే ఆ స్త్రీ తక్కిన లోకాన్ని లెక్కచెయ్యక్కరలేదు.ఎవరేంఅన్నా భర్త ప్రేమ ఆసరాతో అవన్నీ భరించగలదు. కాని ఆ భర్త ప్రేమానురాగాలు కరువయితే ఆ స్త్రీకి యింకేం మిగిలినట్టు?

డాక్టరుగారూ, మొదటిరాత్రి—గురించి చాలా సినిమాల్లో చూశాను. ఎన్నో పుస్తకాలలో చదివాను. ఎన్నో రాత్రులు వస్తాయి కాని యిదియే తొలిరేయి లాంటి పాటలు విన్నాను. సహజంగా ప్రతీ కన్నెపిల్లలాగే నేనూ చాలా ఊహించాను. సిగ్గుల పెళ్ళికూతురిలా గుమ్మందగ్గర నిలబడడం, ఆరాటంతో, అనురాగంతో గుండెలకి హత్తుకొనే భర్త—అతని అనురాగ డోలికలలో మైమరిచి అతని గుండెల్లో ఒదిగిపోవడం—డాక్టరుగారూ! యివన్నీ కేవలం సినిమాలలోనే చూపిస్తారో లేక అందరి తొలిరేయిలో జరుగుతాయో నాకు తెలియదు, కాని నాకు మాత్రం ఊహల్లో మిగిలిపోయిన అనుభూతులుగానే మిగిలిపోయాయి. ఊహలకి యదార్థానికి పొంతన ఎక్కడా దొరకలేదు.

ఆయన నాతో మాట్లాడినవి ప్రేమ మాటలు కావు. స్వీట్ నథింగ్స్ కావు, ఆయన నన్ను గుండెలకి హత్తుకొన్నారు. ప్రేమతో కాదు వాంఛతో. ఆయన ఆవేశం తప్ప అనురాగం నన్ను ముంచెత్తలేదు. ఆయన పని పూర్తయ్యాక ఎన్ని ఏళ్ళగానో కాపురం చేస్తున్న భర్తలా ఆదమరిచి నిద్రపోయారు.

నిద్రపోయే ముందు అనవలసినవి, అడగవలసినవి అడిగి మరీ పడివున్నారు. "మధ్యాహ్నం మా అమ్మనేదో అన్నావుట—"

అన్నారు. "చూడు అలా యింకెప్పుడూ అనకు. మాట అనేముందు వెనకా ముందు ఆలోచించాలి. పెద్దవాళ్ళతో మాట్లాడే తీరు ఆదేనా, ఆవిడ కష్టపెట్టుకుంటుందన్న ఆలోచనన్నా లేదా?" సన్నగా మొదలైన గొంతు పెరిగింది. ఉక్రోషం వచ్చింది నాకు. "అంత అనకూడని తప్పు మాట నేనేం అనలేదు. ఆవిడ ఏమనుకుంటారోనన్న మాట తప్ప కొత్తగా కాపురానికి వచ్చినదాన్ని. వచ్చీరాగానే నన్ను, నా వాళ్ళని అంటే నాకెంత కష్టంగా వుంటుంది" కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఆయన అదోలా చూసి "ఉన్న మాటేగా అంది" అన్నారు.

"ఏమిటి వున్నమాట. పదివేలిచ్చారు మీకు, పెళ్ళి చేశారు. ఇంకా ఇంకా దోచిపెట్టటానికి అక్కడ తరగని సంపాదన లేదు. యింకా పిల్లలున్నారు వాళ్ళకి. ఇంకా ఇంకా ఏం పెడ్తారు. పిల్ల సుఖపడ్తుందని నానా యాతనపడి పదివేలిస్తే యింకా చాలలేదా మీకు" కోపంగా అన్నాను.

ఆయన నా ఎర్రబడ్డ మొహం చూసి చిరాగ్గా నుదురు చిట్లించి "అంత పెట్టలేనివాళ్ళు. తూగలేనివాళ్ళు ఎందుకు ఎగపడాలి. ఎవరి తాహతుకి తగ్గ సంబంధం వాళ్ళు చూసుకోవాలి. మా వదినవాళ్ళు ఎంత బాగా చేశారో తెలుసా? ఇంట్లో అన్ని సామాన్లు యిచ్చి పంపాడు. మా అక్కకి మేడ యివ్వలేదూ—?" అన్నాడు. ఇంకేం అంటాను!

"అవును నిజమే. మా నాన్నగారికి బుద్ధిలేక అత్యాశకి పోయి తాహతు మరచిపోయారు. మీ తాహతింతటిది అని తెల్సుకోలేక పెద్ద తప్పు చేశారు" నా గొంతు పట్టుకుంది. అప్పుడయినా ఆయన కాస్త సౌమ్యంగా "సర్లే ఏదో అయింది" అంటూ మాట్లాడితే సంతోషించి మరిచిపోయేదాన్ని. "మా వాళ్ళందరూ మీ అత్తవారిలా అలా—ఇది చెయ్యలేదు, అది చెయ్యలేదు అంటూంటే మా అన్నయ్య అత్తవారిని పొగుడుతూంటే నాకెంత చిన్నతనంగా వుందో నీకేం తెలుసు? పెళ్ళిలో మా వాళ్ళందరికీ ఎంతో కోపం వచ్చింది. ముందు తెలిస్తే అసలు చేసుకోకపోయేవాళ్ళం" అన్నారు. ఇదీ మా మొదటిరాత్రి

సరస సంభాషణ! వింటూ ఆత్మాభిమానం వున్న ఏ ఆడపిల్ల సహించ గలదు చెప్పండి?

"హు! మీరంతా చదువుకున్నవాళ్ళు, సంస్కారులు అని మేమందరం ఎంతో సంతోషించాం సంబంధం కుదిరాక — కాని మీ ఆధునికత అంతా వేషభాషలలో తప్ప సంస్కారం శూన్యం అని యిప్పుడర్థం అయింది" అని జవాబు చెప్పకుండా వుండలేనంత ఆవేశం ముంచెత్తింది నన్ను.

వాళ్ళ సంసారాన్ని వేలెత్తి చూపించేసరికి పౌరుషం వచ్చి నట్లుంది. "నోర్ముయ్! అంత కట్నం వద్దని చేసుకోడానికి నీవేం రంభలా ఊర్వశిలా వున్నాననుకుంటున్నావా? లోకంలో ఎవరూ చెయ్యని పనులేం చెయ్యలేదే." తీక్షణంగా అన్నారు.

చాలు—అంతకంటె అవమానం ఏ ఆడపిల్లకీ వుండదు. మొదటి రాత్రి భర్త నోట తను అందంగా లేదనిపించుకోవడంకంటె యింకేం అవమానం కావాలి? నేను రంభలా వుంటే పోనీ అని దయ తలచి కట్నం మానేసేవారన్నమాట! ఇలాంటి మనిషితో ఇంకేం మాటాడడానికి కనిపించలేదు. అటు తిరిగిపోయాను. నాకు తెలియ కుండానే కన్నీటితో తలగడ తడవసాగింది. ఆయన నిశ్చింతగా నిద్ర పోతున్నారు. మొదటిరాత్రి దంపతులు నిద్రపోరట! నేనూ ఆ రాత్రి నిద్రపోలేదు!!

* * *

"డాక్టర్! మొదటిరాత్రికాదు. మిగతా ఏ రాత్రులు యీ ఏడాదిం నించి నా ప్రమేయం లేకుండానే, ఏ అనుభూతి లేకుండానే గడిచి పోయాయి.

అత్తవారింటవున్న నాలుగు రోజులు ముళ్ళమీద వున్నట్టే గడిపాను. ఆడపడుచులు నాతో మాట్లాడేవారు కారు. తోడికోడలు ఎప్పుడు నన్ను చూసినా ఏదో హేళన భావం ఆమె కళ్ళల్లో మెదిలేది. అత్తగారు సరేసరి మొహం చిట్లించేది. గృహప్రవేశం కాగానే అక్క వెళ్ళిపోయింది. మాట్లాడేవారులేక వంటరిగా దిగులుగా వుండేది. నా అంతట నేను ఏదన్నా పని కల్పించి చేద్దామన్నా వంటకి

మనిషి—పై పనికి మనిషి అందరూ వున్నారు. ఆడపడుచులతో ఏదన్నా మాట కలపబోతే మాట్లాడుతూ వాళ్ళల్లో వాళ్ళు అదోలా చూసుకోవడం వేళాకోళంగా నవ్వుకొంటూ సైగలు చేసుకోవడం చూశాక నాకు వాళ్ళతో మాట్లాడడం అంటే అసహ్యం పుట్టింది. వీళ్ళందరి ఉద్దేశం ఏమిటి? నాకేం తక్కువని వీళ్ళందరూ ఇంత చుల కన చేస్తున్నారు? అని ఆవేశపడేదాన్ని. మరిది కాస్త నయం. అప్పు డప్పుడు ఏదన్నా మాట్లాడేవాడు. ఆ వాతావరణంలో వారంరోజులు వుండడం అంటేనే భయం పుట్టింది. తక్కిన అందరూ ఎలావున్నా ఆయనైనా కాస్త చనువుగా మాట్లాడితే నాకంత కొత్త వుందేవి కాదు. పగలు పెళ్ళాంతో అందరి ఎదుట మాట్లాడితే ఏం అంటారో నన్నట్టుగానో లేక ఆయన తీరే అంతో నన్ను చూసి చూడనట్టు తప్పుకు తిరిగేవారు.

రెండో రాత్రి ముభావంగా వున్న నన్ను చూసి "ఏం అలా వున్నావు?" అన్నారు.

"ఇంకెలా వుంటాను?" అదో రకం విరక్తి, నిర్లిప్తత నన్ను ముంచెత్తాయి.

"ఏమిటా పెడరసం జవాబు. అడిగినదానికి సరిగా జవాబివ్వ లేవా?"

"ఏం జవాబివ్వాలి? మీ అందరూ చూపెస్తున్న ఆదరణ, అభి మానానికి, కొత్తకోడలికి మీరిచ్చిన స్వాగతానికి ఖులాకారా ఎలా వుంటాను?" పగలు అందరి ప్రవర్తన చూశాక ఇంక ఆగలేని ఉక్రోషంతో జవాబు దురుసుగానే వచ్చింది నోట్లోంచి.

"ఏం? ఏం లోటు చేశారు నీకు? ఈ ఇంటి కోడలివి నీవు. నిన్నందరూ అందలం ఎక్కించి మహారాణిలా సేవలు చెయ్యాలనా నీ ఉద్దేశం."

"అందలం ఎక్కించమనలేదు. ఆదరణ చూపాలన్నాను. సేవలు చెయ్యమనలేదు, కలుపుగోలుతనంగా వుంటే చాలు. పోనీ అందరి మాట వదిలేయండి, మీరు....మీకు—కట్టుకున్న భార్య ఒకర్తి వుందని రాత్రితప్ప పగలు గుర్తురాలేదా? కొత్తగా పెళ్ళయి

వచ్చినదాన్ని. అత్తవారింట్లో కొత్త. కనీసం భర్త అయినా ఆదరించకపోతే....ఎలా వుంటుందో...." దుఃఖం ముంచుకువచ్చి తలగడలో మొహం దాచుకొన్నాను.

బాగుంది. నాకు మాత్రం కొత్త కాదు. అస్తమానూ నీవెంట తిరిగితే అంతా ఏమనుకుంటారు....అయినా ఏదో వారం రోజులుండి వెళ్ళేదానికి యీ గొడవెందుకు?" అన్నారు కాస్త అనునయిస్తున్న ధోరణిలో. ఎంతైనా కొత్త పెళ్లాం. ప్రేమ లేకపోయినా మోజు ఆమాత్రం వుండడంలో ఆశ్చర్యం ఏముంది? బుజం మీద చెయ్యి వేసి తన వైపు తిప్పుకున్నాడు. చాల్లే ఈ మాత్రందానికి ఏడుపెందుకు? అన్నారు కళ్ళు తుడిచి. ఆమాత్రం దానికే కరిగిపోయాను. హుఁ స్త్రీ స్వభావం ఎంత విచిత్రం!! భర్త ఆదరిస్తే పొంగిపోవడం. ఎంత కర్కోటకుడైనా రెండు ప్రేమ మాటలు వల్లించగానే అంతా మరిచి క్షమించేసి కౌగిలిలో కరిగిపోతుంది. ఆడదాని ఈ దౌర్బల్యమే ఆమె దౌర్భాగ్యానికి మొదటి కారణం!

* * *

మర్నాడు మధ్యాహ్నం కాఫీలు తాగుతూ అందరూ సినిమా ప్రోగ్రాం వేశారు. ఎవరెవరు వెడతారు, ఏ సినిమాకి వెళ్ళాలి అన్న చర్చలు ఆరంభించారు. ఎన్ని టిక్కెట్లు అంటూ లెక్క పెడుతూ వచ్చేవాళ్ళందరూ కల్సి పదకొండు టిక్కెట్లు లెక్క తేల్చారు. అందులో నేను లేను. అక్కడే కూర్చున్న నా మొహం నల్లబడటం చూసినట్లున్నారు ఆయన.

"మీ వదినో—పన్నెండు మొత్తం" అన్నారు.

"ఆవిడ మాతో వస్తారో రాదో" చిన్నాడపడుచు దీర్ఘం తీసింది.

"ఇంతకు ముందు మీ రెప్పుడు పిలిచారో, నే నెప్పుడు రానన్నానో" సూటిగానే అడిగాను.

ఆమె మొహం ఎర్రబరుచుకుని "చిన్నన్నయ్యా మీ ఆవిడ ఏమన్నా మీదపడి కరుస్తుందిరా బాబోయ్. జాగ్రత్త ఎలా వేగుతావో ఐ పిటీ యూ" అంది హాస్యంగా అన్నట్టు నవ్వుతూ. అంతా అదో

పెద్ద హాస్యంలా విరగబడి నవ్వారు. అందరి ముందు ఆయనగారికి భార్యని కంట్రోల్ చేసుకోవడం చేతకానివాడని ఎక్కడ అనుకుంటారో నన్నట్టు నా వైపు ఒక క్షణం తీక్షణంగా చూస్తూ 'కరిచే కుక్కకి చెప్పు దెబ్బలతో బుద్ధి చెప్పటం చేతకానివాడ్ని కాను.' అన్నారు అదోలా నవ్వుతూ. ఒక్క క్షణం ఆ మాట అర్థం కాని దానిలా దిమ్మెరపోయాను. అంతా ఆ మాటకి సీరియస్ అయిపోయారు. వాతావరణం హఠాత్తుగా సీరియస్‌గా మారిపోయింది. నా మొహంలో రక్తం పొంగింది. ఆ క్షణంలో ఆవేశం ఎలా నిగ్రహించుకొన్నానో భగవంతుడికే తెలుసు. నేను అన్న చిన్న మాటలో ఏం తప్పు వుందో, ఆ మాటకి అంత ప్రాముఖ్యత యిచ్చి - కొత్త భార్యని యింత కటువుగా అవమానించాల్సిన అవసరం ఏముందో నాకేకాదు మీకన్నా అర్థం అవుతుందా? ఆ క్షణంలో ఒక నిస్సహాయురాలైన ఆడపిల్ల ఏం చేస్తుంది. ఏడుపు ముంచెత్తగా గదిలోకి పారిపోయి పక్క మీద పడిపోయాను. ఇక నన్ను సినిమాకు రమ్మని అడగలేక పోయారెవరూ. ఆయన కూడా తల నొప్పిగా ఉందని సినిమా మానేశారు.

రాత్రి పడకల వరకు యిద్దరం మౌనంగానే వున్నాం. వంటావిడ వడ్డిస్తే భోజనాలు చేసి వచ్చాం గదిలోకి. సినిమానించి యింకా రాలేదు మిగతావాళ్లు. మామగారు క్లబ్బునించి రాలేదు. యింట్లో యిద్దరం, యింత మంచి అవకాశాన్ని ఏ కొత్త జంటా వృథాగా పోనివ్వదని చాలాచోట్ల చదివాను. కాని జరుగుతున్న దేమిటి? ఎన్నేళ్ళగానో కాపురం చేస్తున్న రీతిన ఎడ మొహం పెడ మొహం మొదటి రోజునించి ఆరంభమవడం ఎంత దురదృష్టం! అక్క పెళ్ళయిన కొత్తలో అక్కా బావ ఎంత హేపీగా వుండేవారు-యిద్దరూ అసలు గది వదిలి వచ్చేవారు కారు. రోజూ బీచికీ, సినిమాకీ షికారు. అక్క మొహం సంతృప్తితో. సంతోషంతో ఎంత వెలిగిపోయేది - బావ ఎప్పుడూ హాస్యాలాడుతూ, నవ్వుతూ నవ్విస్తూ ఎంత సరదాగా వుండేవాడు! యీయన మొహంలో నవ్వే కనపడదు. ఇది నేను చేసిన పూజల ఫలితమా? జరుగుతున్న ప్రతి సంఘటన నన్ను విరక్తిలో

పడేస్తూంది.

"కోపం వచ్చిందా?" హఠాత్తుగా ఆలోచన మధ్య ఆయన ఎప్పుడు వచ్చారో నా పక్కన కూర్చుని నవ్వు మొహంతో అంటూ వుంటే ఆశ్చర్యపోయాను. నా మీదకి వంగి మొహంలో మొహం పెట్టిన ఆయనని చూస్తే ఆ క్షణంలో ఏదో చెప్పలేని జుగుప్స కలిగింది. ఆ కళ్ళల్లో కోరిక తప్ప అనురాగం కనపడలేదు. ఆ కోరిక రోడ్డునపోయే ఆడకుక్క వెంట తిరిగే మగ కుక్క కళ్ళని గుర్తు చేస్తూంటే మొహం తిరస్కారంగా.

"అదంతా కోపమేనా ఏదో అనాలని అనుకోకుండా అనేశాను అయినా వాళ్ళేదో అంటూంటే సరదాగా అన్నాను—"

"మిమ్మల్ని సంజాయిషీలు నేను అడగలేదు. దయచేసి, నన్ను వదలండి" ఆయననించి విడిపించుకోడానికి ప్రయత్నించాను.

"తప్పయింది అన్నాగా—యింకా కోపం ఎందుకు?"

"తప్పేమిటి-పెళ్ళాన్ని యిష్టం వచ్చినట్లు తిట్టే హక్కు మీకుంది. అదేమని అడిగే హక్కు నాకు లేదుగా."

"అబ్బ ఏదో అయింది. దాన్నే పట్టుకొని సాగదీస్తావెందుకు? అయినా నీకు మరీ ముక్కు మీదే వుంటుంది కోపం" హాస్యాని కన్నాను.

"హాస్యం—పెళ్ళయిన మూడో రోజున పెళ్ళాన్ని చెప్పుతో కొడతాననడం హాస్యం. మీ చెల్లెలు కుక్క పిల్లలతో పెళ్ళాన్ని పోలుస్తూంటే అదో హాస్యం. మీరంత చదువు సంస్కారం వున్న వాళ్ళు-గొప్ప వాళ్ళు. మీ హాస్యాలింత సున్నితంగా వుంటాయని నాకు తెలీదు" మనసులోని అక్కసు వెళ్ళగక్కాను కోపంగా. తెచ్చి పెట్టుకొన్న నవ్వు, సరసం ఆయన మొహంలోంచి మాయమయి అసలు స్వరూపం వెంటనే వచ్చింది.

"ఏమిటి అస్తమాను ప్రతిదానికి యింత గొడవ చేస్తావు—అంత పౌరుషం వున్నదానివి పెళ్ళెందుకు చేసుకొన్నావు?" తీక్షణంగా అన్నారు.

"పెళ్ళి చేసుకొంటే ఆత్మగౌరవం, ఆత్మాభిమానం యింతలా

బలిపెట్టుకొని బతకాలని నాకు తెలీదు. భార్య అంటే బానిస అన్న భావం యీనాడు మగవాళ్ళకి లేదని భ్రమపడ్డాను.

"చాలించు నీ ఉపన్యాసాలు—చూస్తూంటే నీ వ్యవహారం ముదురుతూంది. పెళ్ళయిన రోజు నించీ ఎదురు జవాబులు చెపుతున్నావు.-మా అమ్మ అన్నట్టు నిన్ను మొక్కగానే వంచాలి" కసిగా పళ్ళు బిగించారు. అంత ఇష్టం లేకపోతే వెళ్ళిపో, అంతేగాని ప్రతిసారి మీరు, మీవాళ్ళు ఇలా అలా అంటే సహించేది లేదు" మొహం ఎర్రబడగా అన్నారు.

వెళ్ళిపో—ఎంత సులువుగా ఒక్క మాటలో అన్నారు. అంత సులువుగా వెళ్ళలేనని తెలిసేగా అంత తేలిగ్గా అనగలిగారు. కట్టుకున్న భర్త మూడో రోజే భార్యని 'పోతే పో' అనగలిగాడంటే ఆ కాపురం ఎంత చక్కగా సాగుతుందో భవిష్యత్తు అద్దంలా కంటి ముందు కన్పించి, నా ఆశలు, కలలు కూడా పోయినట్టు హతాశురాలై పోయాను.

జవాబు చెప్పలేని నా నిస్సహాయత నా మొహంలో చూసి విజయగర్వంతో తళుక్కుమన్నాయి ఆయన కళ్ళు.

*　　　*　　　*

ఆయన శలవు అయిపోయింది. ఆరోజు మేమూ ప్రయాణం అవాల్సిన రోజు.

ఉదయం కాఫీలు తాగుతూండగా మా అత్తగారు "ఏమిరా శివా, యిప్పుడు మీ ఆవిడ్ని తీసికెళ్ళి ఏం చేస్తావు. ఇంట్లో సామాన్లు ఏం లేనట్లున్నాయి. ఉట్టి చేతులతో వచ్చింది, యిప్పుడు తీసికెడితే యిబ్బంది గాదూ. ఏం చేస్తాం వాళ్ళవాళ్ళకి లేకపోయినా మేం అలా ఎలా ఊరుకుంటాం. నీవు ముందెళ్ళి యింటికి కావల్సినవి నాలుగూ కొని తర్వాత తీసికెళ్ళు" అంటూ సాగదీసింది ఆవిడ. జవాబు చెప్పాలనిపించినా నేనేమాట అన్నా విపరీతార్థాలు తీస్తారని, ఆయన ఏం అంటారో చూడాలని ఊరుకున్నాను. ఆయన నా వంక ఒకసారి చూసి "ఫరవాలేదులే, రెండురోజులు ఏదో హోటల్లో తింటాం. సామాను కొనడం ఎంతసేపు" అన్నారు.

అమ్మయ్యా బతికించారు అని సంతోషించాను. ఆవిడ మా యిద్దరి వంక మార్చి మార్చి చూసింది. మేం ఇద్దరం కూడ బలుక్కున్నాం అని గ్రహించినట్టు చురచుర చూస్తూ, "సరే అయితే మీ యిష్టం" అందావిడ ముఖావంగా.

"అమ్మా, నాన్నని ఓ వెయ్యో రెండువేలో అడిగి ఇస్తావా. నా ఎకౌంటు ఫిక్సడ్ డిపాజిట్‌లో వుంది. తీస్తే అనవసరంగా నష్టం. సామాన్లు కొనాలి గదా." అన్నారాయన.

"బావుందిరా నాయనా, మీ నాన్నదగ్గర మాత్రం రాసులు పోసివున్నాయా. మొన్న పిల్ల పెళ్ళిచేశాం, పాతికవేలయింది. ఇంటి ఖర్చులు చూస్తూనేవున్నావు. అడిగితే కేకలు వేస్తాకో ఏమిటో. అస లంత ఆయన దగ్గిరమాత్రం వుండద్దూ" ఆవిడ నుదురు చిట్లించి అన్నారు.

"అయినా యిదేం విడ్డూరం. అటు ఆడపిల్లల కాపురాలు దిద్దాలి. ఇటు మగపిల్లలకీ మేమే యివ్వాలి. ఎక్కడా కని విని ఎరగం. మీ అత్తవారు నిమ్మకి నీరెత్తినట్లు వూరుకుని పిల్లని గడుసుగా పంపే శారు. మధ్య మాకా యీ నష్టం అంతా." ఆవిడ ధోరణి సాగు తూంది.

"అంత నష్టపోవడానికి ఏముంది, మీరెందుకు యియ్యడం. మా నాన్నగారిచ్చిన కట్నంలో యివ్వాలనిపిస్తే యివ్వండి, లేదంటే మా అవస్థలు మేము పడతాం," స్థిరంగా శాంతంగా అన్నాను. ఆ మాటకూడా అనకపోయేదాన్నిగాని, ఎలాగో అపుడే వచ్చిన పెద్దపేరు రానే వచ్చింది, యింకా యింకా మా వాళ్ళని తీసిపారేస్తూంటే సహించలేక ఏమయితే అయిందని అనేశాను. అంతే. ఆ మాటకి ఆవిడ మహా అవమానం జరిగినట్లు మొహం గంటపెట్టుకుని "కట్నం-మహా యిచ్చారులే ముష్టి ఎనిమిదివేలు. మేం ఏమీ మూటకట్టి దాచుకోలేదు. పెళ్ళి ఖర్చు, నీకు పెట్టిన గొలుసు, చీరలు, ప్రయాణం ఖర్చులు అన్నీ యెక్కడనించి వచ్చాయనుకున్నావు. ఇంకా మా చేతిది రెండువేలు వదిలింది." గయ్యిమంది ఆవిడ. వాళ్ళు నాకు పెట్టిన గొలుసు, చీరలు, ఖర్చులు అన్నీ కలిపినా నాలుగైదువేలు

మించదు అని ఖచ్చితంగా నాకు తెలుసు. అయినా యింక అనడానికి ఏముంది. నోరు మూసుకున్నాను.

"అయినా ఒరే అబ్బాయి. ఇలా మీ ఆవిడ పెద్ద, చిన్న మర్యాద లేకుండా ఏ మాట పడితే ఆ మాట అనడం బాగోలేదు. నీవు దాన్ని ఎలా కట్టుదిట్టంలో పెడతావో. మరోసారి యిలా అంటే సహించేది లేదు. నీ కట్నంతాలూకు డబ్బు మీ నాన్నని ఎకౌంటు రాసి యిమ్మంటాను." ఆవిడ విసురుగా లేచి వెళ్ళిపోయింది. ఆయన కోపంగా "నీవెందుకు అనవసరంగా యీ విషయంలో జోక్యం కల్గించుకుంటావు, బుద్ధి లేదా ఒకసారి చెపితే. నన్ను బతకనీయ దలుచుకోలేదా, మధ్య నేను చస్తున్నాను." ఆయన నామీద ఎగిరారు. ఆయనన్నదీ ఒకవిధంగా నిజమే. ఒకవంక భార్య, మరోవంక తల్లి. ఎవరిని ఏమనగలరు? తల్లిని అనలేక ఆ కోపం నాపై చూపిస్తారు. అందుకనే యింకేం అనకుండా వూరుకున్నాను. అసలు డబ్బు అడగడం యీయన మొదటి తప్పు.

తరువాత మా అత్తగారు మామగారితో చెప్పడం, ఆయన కొడుకుని పిలిచి ఏమన్నారో, కాగితాలు లెక్కలు చూపడం, మిగతా డబ్బు యిదిగో అని ఓ వెయ్యి యీయన చేతిలో పడేశారుట. తల్లి తండ్రులు నిష్ఠూరంగా మాట్లాడడం, కోడలు వచ్చిన రోజునించి కొడుకు అప్పుడే పరాయివాడయి పోయాడని, కట్నం డబ్బులు కోడలు అడిగించిందని. ఏవేవో సాధింపులు ఆ రోజంతా అత్తగారు గొణగడం, చిరచిరలాడారు. మా ఆయన తల్లితండ్రులని ప్రసన్నం చేసుకో ప్రయత్నించి విఫలులై ఆ కోపం నామీద చూపి ఆ వెయ్యి రూపాయలు నా మొహంమీద విసిరేసి "నీవు, నీ కట్నం డబ్బు కట్ట కట్టుకుని గంగలో దుముకండి. ఛీ - ఒక్కరోజూ శాంతంగా గడప నీయలేదు. నీవూ, మీవాళ్ళు యిలాంటివాళ్ళని తెలిస్తే చస్తే చేసుకునే వాడిని కాను యీ పెళ్ళి" అంటూ నిప్పులు కక్కారు. నేనేమన్నా అంటే పరిస్థితి మరింత విషమిస్తుందని నోరు మూసుకున్నాను. ఆ రోజంతా యింట్లో వాతావరణం గంభీరంగా వుంది. సాయంత్రం ప్రయాణం. స్టేషన్‌కికూడా ఎవరూ రాలేదు, మరిది తప్ప. వెడుతున్నా

వని చెపితే ఊ ఆ అనలేదు. పెళ్ళి ముందు అత్తగారికి, మామగారికి పాదాభివందనం చేశాను. మామగారు ఆశీర్వదించారు కాని, అత్తగారు "మాకెందుకులే అమ్మా దండాలు, తిట్టకుండా వుంటే అంతే చాలు" అంది మూతి తిప్పి. ఆయన చాలా గంభీరంగా వున్నారు ఉలుకు పలుకు లేకుండా.

* * *

డాక్టరుగారూ, కొత్త కాపురానికి మా భార్యాభర్తలం ఎడ మొహం పెడమొహాలతో వెళ్ళాం. నవ వధువుగా ఆ యింట్లో పాదం పెట్టడమే కలతలతో ఆరంభమైంది కాపురం! ఏ ముహూర్తాన పెళ్ళి యిందో, ఏ ముహూర్తాన కాపురానికొచ్చానో ఆ యింట్లో ఆ సంసారంలో సారమే లోపించింది. బతుకులో అనురక్తే లేకుండా పోయింది.

ఆయన రైలులో మాట్లాడలేదు. ఇంటికి రాగానే తాళం తీసి సామాను లోపల పడేయించి మాట పలుకు లేకుండా వచ్చినవారు వచ్చినట్టే ఎటో ఆ రిక్షాలోనే మళ్ళీ వెళ్ళారు. లోపలికి వెళ్ళాను. రెండు గదులు, ఓ వంటిల్లు, బాత్‌రూము. ఇల్లు చిన్నదైనా సదుపాయంగానే వుంది, ఆయన చాలారోజులు ఏదో లాడ్జీలో వుండేవారట. పెళ్ళి కుదిరాక యీ యిల్లు కుదిర్చారుట. ఆయనకోసం కొనుక్కున్న ఓ మడత మంచం, ఓ కుర్చీ, కాఫీకి కావాలు ఓ స్టవ్, కాఫీ సామాను. ఓ బాల్చి స్నానానికి. నీళ్ళకి కూజా. ఓ బ్రహ్మచారి సంసారానికి కావల్సిన సామానులున్నాయి. ఆయనెక్కడికి వెళ్ళారో తెలియదు. ఎనిమిది గంటలయింది అప్పటికి. నా పరుపు విప్పుకున్నాను. ఆయన పెట్టెలో బట్టలు తీసి అలమరులో సర్దాను. నా బట్టలు మరో అరలో సర్దాను. కిటికీలో వున్న ఆయన షేవింగ్ సామాను, టూత్‌పేస్టులు అన్నీ తీసి వాష్ బేసిన్ దగ్గిర పెట్టాను. ఆ చిన్న ఇల్లు మా చిన్న సంసారానికి అనుకోగానే అప్పుడే ఆ ఇంటిమీద, ఆ యింట్లోవున్న కొద్దిపాటి సామానుమీద నాది అన్న భావం వచ్చేసింది. అంతా సర్ది స్నానంచేసి ఏం చెయ్యడానికి లేకపోతే ఇలస్ట్రేటెడ్ వీక్లీలు తిరగేస్తూ కూర్చున్నాను. రేపు ముందుగా ఏం

సామానులు కొనాలో. వంటకి కావల్సిన పప్పులు ఉప్పులు చిన్న లిస్టు తయారుచేశాను.

తొమ్మిదవుతూండగా ఓ కుర్రాడెవరో క్యారియర్ తీసుకొచ్చాడు. అయ్యగారు ఇమ్మన్నారు. "అయ్యగారు హోటల్లో భోం చేస్తున్నారు. ఇది మీ కిచ్చిరమ్మన్నారు. అన్నాడు. మనసు చివుక్కుమంది. ఆయనక్కడ అలా తినకపోతే, నన్నిక్కడ యిలా ఒంటరిగా వదలకుండా ఆ క్యారియర్ ఏదో తెచ్చుకుని యిద్దరం కలిసి యిక్కడ తింటే ఎంత బాగుండేది అన్పించింది. కొత్తభార్య కిచ్చిన స్వాగతం చూడగానే ఆకలి చచ్చిపోయింది. అయినా ఏదో తినాలి గదా. క్యారియర్ విప్పుకుని భోంచేశాననిపించాను. ఇంతలో ఆయన వచ్చారు.

వస్తూనే గదిలో నే మార్చిన మార్పులు చూశారు. నుదురు చిట్లించి నేను మధ్యనించి కిటికీవారగా లాగిన మంచం మళ్ళీ యధాస్థానంలోకి లాగారు. వాష్‌బేసిన్ దగ్గిర షేవింగ్ సామాను తెచ్చి మళ్ళీ అలమరలో పెట్టుకున్నారు. పెట్టె యధాస్థానంలో పెట్టారు. ఆ యిల్లు, ఆ సామాన్లు తనవి అవి మార్చే అధికారం నాకు లేదన్నట్టు తన పద్ధతి తప్ప నా యిష్టా యిష్టాలు చెల్లవని స్పష్టంగా చెపుతున్నట్లనిపించింది 'నాకు. బ్రహ్మచారి గదిని యిల్లాలిగా చేతనయినంత అందంగా పొందికగా సర్దితే మళ్ళీ అన్నీ చిందర వందర చేసుకున్న ఆయన మనస్తత్వం ఏమిటో నా కర్థంకాదు. వూరుకోలేక అదేమిటి మంచం పక్కగావుంటే గదిలో చోటువుంటుందని అలా సర్దాను. ఏదో అనబోయాను. ఆయన ఆ మాటలు విననట్టు తువ్వాలు పట్టుకుని బాత్‌రూములోకి వెళ్ళారు. ఛెళ్ళున కొట్టినట్టు అవమానం పొందాను. అప్పటికి నా మనస్థితి మీరూహించండి.

స్నానం చేసి లుంగీ, షర్టు వేసుకుని, తలదువ్వుకున్నారు. ఆ గదిలో వెనకేమనిషిలేనట్టు అదంతా చేశారు. కుర్చీలో కూర్చుని అంతా గమనిస్తూనేవున్నాను. ఫేన్ వేసుకుని మంచంమీద పడుకుని కళ్ళు మూసుకున్నారు. ప్రయాణం బడలికకితోడు పదిగంటలయిందేమో అప్పటికే నాకూ నిద్ర వస్తూంది, ఆయన మంచంమీద పడు

కున్నారు. నే నెక్కడ పడుకోవాలి? అత్తవారింట్లో అందరి మధ్య ఆయన వాళ్ళవాళ్ళు ఏం అనుకుంటారోనని అలా ప్రవర్తించినా మేమి ద్దరం స్వేచ్ఛగా మా యింట్లోకి రాగానే ఆయన మారుతారని సరదాగా ప్రతీ కొత్త జంటలా వుంటారని ఏ మూల్లో నాలో మిగిలిన ఆశకాస్త ఆయన ముభావత చూడగానే అణిగిపోయింది. అవమానంతో నా హృదయం మండింది. కాని మొదటిరోజే ఆయనతో తగవుపెట్టుకుని ఏం సాధించగలను! ఈ భర్తని ఈ సంసారాన్ని చక్కదిద్దుకోవాల్సిన బాధ్యతనాది. ఆయన్ని అనుగుణంగా మార్చుకోవడంలో చాకచక్యం కనపరచుకోవాలిగాని సంసారాన్ని మరింత నరకంలో పడేసుకో కూడదు అన్న వివేకం నా ఆవేశాన్ని మందలించింది.

సిగ్గువిడిచి ఆయన దగ్గిరికి వెళ్ళి పక్కన కూర్చుని "ఏమిటలా వున్నారు. ఇదంతా నామీద కోపమేనా?'' అన్నాను. లాలనగా ఆయన నా చేయి తోసేసి విసురుగా అటు తిరిగిపోయారు. "బావుందీ కోపం. నేనేం చేశానని యిలా సాధిస్తారు. ఇంటికొచ్చిన మొదటి రోజు యిలాగేనా భార్యని ఆహ్వానించేది" నిష్ఠూరంగా అన్నది. ఆయన తల ఊపలేదు పలకలేదు. "నా తప్పేమిటో చెప్పి సాధించండి. అంతేగాని యిదంతా నాకేం బాగోలేదు. మొదటిరోజునించీ ఏమిటో గొడవలు మనమధ్య''ఆయన చివుక్కున యిటు తిరిగారు. తీక్షణంగా "నాకూ బాగులేదు. నీ వరస నీ పొగరు తగ్గితే తప్ప మన కాపురం యిలాగే ఏడుస్తుంది'' అన్నారు కటువుగా. కోపంవస్తున్నా ఆపుకుని ''అంత అపరాధం నేనేం చేశాను. నా పొగరు ఏమి చూశారు?" శాంతంగా అడిగేను.

"ఇంకా ఏం చూడాలి. మూడు రోజులలోనే యిలా ప్రవర్తించినదానివి....." ఏదో అంటున్నారు ఆవేశంగా.

"అంటే ఎలా ప్రవర్తించాను. స్పష్టంగా చెప్పండి" సూటిగా అడిగాను.

"నోటితో చెప్పాలా? అడుగడుగునా నీ అహంకారం నా దగ్గిరా మావాళ్ళ దగ్గిరా చూపించావు. అదంతా సహించి నీ కొంగు పట్టుకు తిరిగే చవటదద్దమ్మని కానని గ్రహించు. నీవాడించినట్లు ఆడి

మా వాళ్ళకిదూరం అవుతానని మాత్రం అపోహపడకు. ఎవరి హద్దులలో వాడుండాలి అని గుర్తించి మసలుకో. నీ అతితెలివి నా దగ్గిర కాదు. అంతమాట పడని దానివి. స్త్రీ స్వాతంత్ర్యాలు వగైరా ఉద్దేశాలుంటే పెళ్ళి చేసుకోక పోవలసింది. అలా యిష్టం లేకపోతే నీవు మీ యింటికి వెళ్ళచ్చు" ఆవేశంగా, తీక్షణంగా, పరుషంగా ఆయన అన్న మాటలకి జవాబు ఏం చెప్పగలను?

భార్య అంటే అణిగి మణిగి పడివుండాల్సిందేనని ఆయనంత స్పష్టంగా చెపుతున్నాక, అలా పడివుండక గత్యంతరం లేదన్న సంగతి తెలుస్తుండగా యింక నోరు విప్పి నేను చెప్పేది, చెప్పుకునేది ఏముంటుంది. గొంతుకు ఏదో అడ్డుపడినట్లు గుటకమింగాను. నేను కట్టుకున్న ఆశాసౌధాలు కళ్ళముందు కూలిపోతున్నట్టు దిగాలు పడి పోయాను. నా మౌనం, జవాబు చెప్పలేని నిస్సహాయత చూసి ఆయన గెలిచినట్లు గర్వంగా చూశారు. నా ఓటమిని అంగీకరించలేక బలవంతాన పొంగేవన్నిటిని లోపలికి పంపేసాను. పక్కమీదనించి లేచి కింద నా పరుపు పరుచుకుని వ్రాలిపోయాను. ఆయన నా చెయ్యి పట్టుకులాగి "ఏం మాట్లాడవు. ఇక ముందు సరిగా ప్రవర్తిస్తానని చెప్పు." అంటూ నా పక్కమీదకి వచ్చారు. జవాబు నా కళ్ళు చెప్పాయి. ఎంత ప్రయత్నించినా ఆగని కన్నీరు నా ఓటమిని ఆయనకి పట్టిచ్చాయి.

"ఎందుకా ఏడుపు ఈ బుద్ధి ముందే వుంటే ఇంత గొడవ ఎందుకు జరుగుతుంది. ఉఁ—చాల్లే—ఉఁ అంటే ఏడుపు ముందుం టుంది మీ ఆడవాళ్లకి. చాలు ఊరుకో ఇంకెప్పుడు ఇలా చెయ్యకు" అంటూ కొంగుతో కన్నీరు వత్తి కౌగిలిలోకి లాక్కున్నారు. ఏం చేశాను. నా నేరం ఏమిటి, దేనికి నేను క్షమాపణ చెప్పాలి? అని ఎలుగెత్తి అడగాలనిపించినా నా నోటిని మూసుకున్నాను. గట్టిగా పళ్ళు బిగించాను. పెదాలు చిట్లాయి. ఆక్రమించుకుంటున్న ఆయన స్పర్శకి పులకింతగాదు కల్గింది. తిరస్కారం ఏహ్యత! ఇదంతా నేను తప్పు చేసి సహించడంలేదు. గత్యంతరం లేక అన్న సంగతి ఆయనకి

ఎలా తెలుస్తుంది. నా మనసు ఆక్రోశించింది!

* * *

"డాక్టర్‌గారూ ప్రేమ లేనిచోట సెక్స్ ఎంత నరకమో అనుభవి స్తేగాని అర్థంగాదు. ఆయన ప్రేమకి నేను నోచుకోలేదు. ప్రతి సంఘటన, ప్రతి చర్య ప్రతి క్షణం, ప్రతిరోజు ఆయన మీద నాకు తిరస్కారాన్ని ఏహ్యతని పెంచాయి తప్ప ప్రేమని, గౌరవాన్ని పెంచలేదు. మా యిద్దరిమధ్య అనురక్తి, అనురాగంలేవు. ఆయన పురుషుడు కనక సెక్సుకే ప్రధాన్యత యిస్తారు. కనక ఆయనకి కావల్సింది నా శరీరం తప్ప మనసు కాదు. కనక నాతో ఆయన ఐహికంగా ఎలావున్నా దైహికంగా సంతృప్తిపడి వుండచ్చు. కాని స్త్రీని నేను. ఆడది సెక్స్‌కి పురుషుడిలా అత్యంత ప్రాధాన్యత యివ్వదు. ప్రేమలేని సెక్స్‌తో స్త్రీ సంతృప్తిపడలేదు. సంతృప్తి పడకపోవడం అటుంచి అలాంటి సెక్స్‌ని తీవ్రంగా ప్రతిఘటిస్తుంది. కాని పురుషుడు ఆమె ఇష్టాయిష్టాలకి విలువ ఈయడు. అవన్ని ప్రతిఘటించే శక్తి, అంత మానసిక, శారీరక బలం స్త్రీకి లేవు. అంచేత మనసులో అసహ్యించుకుంటూ కళ్లు మూసుకు వళ్ళు వప్పగించడం మినహా ఏమి చెయ్యలేని నిస్సహాయురాలు! నా స్థితి అంతే! ఆయన కోరినప్పుడు అదికూడా ఇవ్వకపోతే ఇంక ఆ కాపురం ఆ మాత్రంగా కూడ నిలబడదన్న నిజం గుర్తించి, కళ్ళుమూసుకుని, మనసు చంపుకుని, వళ్ళు అప్పగించేదాన్ని. ఆ రోజునుంచి ఈ రోజువరకు అంతే, ఆ కాసేపు మాత్రమే ఆయన ప్రసన్నంగా కనపడేవారు.

ఆ తరువాత ఆయన చిరాకు, కోపం, అసహనం అన్నీ మామూలే!

"ఆ....ఏదో చెపుతూ దేన్లోకో వెళ్ళిపోయాను. డాక్టర్ ఎంత వరకు చెప్పాను."

శారద ఆయాసంగా ఆగింది. విజయ వాచి చూసుకుంది.

"టూకీగా చెప్తాను డాక్టర్. ఎంతో చెప్పచ్చు మహాభారతం అవుతుంది. అన్ని గొడవలు చెపితే—ఆఁ— మా కాపురం మొదటి రోజు గురించి చెప్పానుకదూ. ఆయన స్వభావం కొంత అర్థం

అయింది. ఇంక ఆయనతో వాదించి గెలవలేనని, ఆయనన్నదానికి తల వూపడం తప్ప గత్యంతరం లేదని అర్ధం అయి దానికి అణుగుణంగానే నడవడం ఆరంభించాను.

సామాను కొందాం రమ్మంటే నాకు ఆఫీసుంది నీవు వెళ్ళి కొనుక్కో, నీ కట్నం డబ్బు యిచ్చారుగా మీవాళ్ళు అన్నారు. కొత్త వూరు, కొత్తచోటు, ఒక్కర్తి నీ ఎలావెళ్ళను. అయినా మా ఇంటికి కావల్సినవి కొత్త సంసారానికి యిద్దరం వెళ్ళి ముచ్చటగా ఏరి తెచ్చుకోవాలనిపించినా ఆయనకి నచ్చచెప్పలేననిపించి తలాడించాను—

ఇంటికి కావల్సిన ముఖ్యమైనవి చవకరకంలో తేలిపోయే ఇండాలియమ్ గిన్నెలు, స్టీలు కంచాలు, రెండు వంట పాత్రలు నాలుగు ముఖ్యవసరానికి సరిపోయేవి కొనేసరికీ ఆరువందలు అయింది. కొద్దిగా బియ్యం దినుసులు, ఓ జనతా స్టౌవ్, మరో బాక్సు వగైరాలన్నీ కొన్నాను. మరో రెండు వందలయింది.

బొత్తిగా మడత మంచం ఎలాగని ఓ నవారు మంచానికి ఆర్డరిచ్చాను. నవారుతో కలిపి నూటపాతిక అయింది. మిగిలిన డెబ్బైఐదుతో ఓ చవక రకం బట్టల స్టాండు, రెండు పీటలు. చవకరకం టేబిల్‌కి ఆర్డరు యిచ్చి వచ్చాను. అన్నీ కొంటూంటే తల్లిదండ్రులు ఆడపిల్లలకి వేలకివేలు కట్నాలుపోసే బదులు, కాపురానికి కావల్సిన వస్తువులు నాలుగు కొని ఇస్తే ఎంత బాగుంటుంది అన్పించింది.

ఇంట్లో నీట్‌గా వస్తువులు సర్ది సాయంత్రం ఆయన వచ్చే సరికి వేడిగా ఉప్మాచేసి, కాఫీచేసి, వంట కూడా పూర్తిచేసి సుస్తాబయి వున్నాను, ఏర్పాటులు చూసి ఆయన ప్రసన్నులైనట్టు కనిపించింది. కాని మెచ్చుకోవడం పరువు తక్కువన్నట్టు ఉప్మాతింటూ, "ఎంత ఖర్చయింది. ఏం కొన్నావు?" అన్నారు. ఆ మాత్రం అడిగినందుకే సంతోషంగా నేను చేసినదంతా ఏకరువు పెట్టాను. 'ఊ అంతా ఖర్చయిందన్నమాట ఇదంతా మీవాళ్ళ ఖర్చు. అనవసరంగా నా నెత్తిన రుద్దావు' ఆ మాటతో మళ్ళీ ఆ ప్రసక్తితేగానే నా ఉత్సాహం మీద నీళ్ళు చల్లినట్లయింది. అయినా ఏం అంటే ఏం తప్పో నని వూరుకున్నాను.

ఆయనకి ఎనిమిది వందల జీతం. ఇంటద్దె రెండు వందలు పోను భార్యా భర్తలం ఇద్దరం ఆరొందలతో హాయిగా స్వేచ్ఛగా బతకచ్చు. వందో రెండువందలో పొదుపుగా వాడుకుంటే మిగుల్చు కుని ఇంటికి కావల్సినవి ఒక్కొక్కటి చేర్చుకోవచ్చును. ఆ మాత్రం సంపాదన వుండి ప్రతి దానికి అత్తవారు ఇదివ్వలేదు. అదివ్వలేదని సాధించే ఆయన మనస్తత్వం నాకు ఎంతో అసహ్యం అనిపించేది. స్వశక్తితో తన డబ్బుతో తను సంసారానికి నాలుగూ అమర్చుకో డంలో ఎంత తృప్తి వుంటుంది! మరొకరు యిచ్చినదానితో పబ్బం గడుపుకోవాలనే ఆయన ఉద్దేశాలని చూస్తే వళ్ళు మండేది. చదు వుండి-సంస్కారం లేని ఆయన ప్రవర్తనని క్షమించలేకపోయేదాన్ని.

ఆయన మనస్తత్వమే అసలు చిత్రంగా వుండేది. ఎప్పుడూ సీరియస్‌గా ఏదో ఆలోచిస్తున్నట్లుంటారు. మొహాన నవ్వే వుండదు. మనసారా నవ్వుతూ మాట్లాడడం తప్పన్నట్టు నలుగురిలో నవ్వినా బల వంతంగా నవ్వినట్టే వుండేది. షార్ట్ టెంపర్ సరేసరి. ఏ చిన్న మాటన్నా ముక్కుమీద కోపం వుంటుంది. తన మాట తప్ప మరొకరి మాట వినడం అందులో భార్యమాట వినడం అన్నది చిన్నతనం అనుకునే స్వభావం. ఇవన్నీ అలా వుంచి ఓ సరదాలేదు. సినిమాలు చెత్త అంటారు. పుస్తకాలన్నా చదవరు. ఉదయం లేవడం, ఏడు గంటలకి తయారై ఫాక్టరీకి వెళ్ళడం. ఏ సాయంత్రం ఆరుగంటలకో రావడం, అలిసిపోయి పడుకొని లేచి ఎనిమిదిగంటలకి భోంచేసి కాసేపు పేపరు తిరగేసి న్యూస్ విని పడుకోడం యిదీ దినచర్య— మిగతా రోజుల్లో ఎలావున్నా ఏ శలవురోజన్నా ఎటన్నా వెళ్ళాలనిపిం చదు ఆయనకి. ఆయనకి స్నేహితులనే వారే లేరు. రోజంతా ఒక్క ర్తినీ వుంటాను. కనీసం ఆయన వచ్చే కన్నా సరదాగా మాట్లాడు కుంటూ, ఏవారానికో ఒకసారి సినిమాకో, షికారుకో తిరిగి రావాలను కోడం ఏ భార్యాన్నా కోరుకునే అతిచిన్న కోరికలు! ఆయనకి సినిమాలు ఇష్టం లేకపోయినా భార్యకోసం ఆ మాత్రం వెళ్ళొచ్చు. ఊహూ యింకోరి కోసం సర్దుకోడం అన్నది ఆయన స్వభావానికే విరుద్ధం. యితరులు ఆయన కోసం సర్దుకోవాలిగాని ఆయన ఏ చిన్న విషయం

లోనూ తన పద్ధతి మార్చుకోరు, హాస్యానికన్నా స్పోర్టివ్‌గా తీసుకో లేరు.

పైనున్న ఆయన స్వభావాలని, ఆయనని మార్చాలని చేసే నా ప్రయత్నాలు వ్యర్థమయ్యాక ఆయనతో సరిపెట్టుకుంటూ, ఆయన అన్నదానికి కాదనకుండా, ఆయనేమన్నా ఎదురు చెప్పకుండా మౌనంగా వూరుకోడం క్రమంగా అలవరుచుకున్నాను. ఎంత సరిపెట్టుకున్నా మా వాళ్ళని ఆడిపోసుకునే ఆయన మనస్తత్వాన్ని మాత్రం క్షమించ లేక పోయేదాన్ని.

ఇంటికి కావల్సినవి ఏమన్నా ఒకక్కొక్కటే వస్తువులు ఏర్పరుచుకుందాం అని ముచ్చటపడి ఏది అడిగినా 'నీ బాబు యిస్తాడా', 'మీ నాన్న నడిగి పట్రా'. యిలా హేళనగా మాట్లాడుతూంటే సహించ లేకపోయేదాన్ని. అలా నాలుగైదుసార్లు జరిగాక ఆఖరికి ఓ రోజు ఆవేశం అణుచుకోలేక "అన్నీ నా బాబు కొనిచ్చే మాటయితే మిమ్మల్ని ఎందుకు అడుగుతాను. ఇంటికి కావల్సినవి కొనుక్కోలేని వారు పెళ్ళి ఎందుకు చేసుకున్నారు. పెళ్ళాన్ని సంసారాన్ని భరించలేనివారు పెళ్ళన్నా మానాలి, లేదా ఇల్లరికం వస్తాననేనా చెప్పాల్సింది. మీ రేదో ఉద్యోగం చేస్తున్నారనుకుని మా వాళ్ళు పదివేలు వదుల్చుకుని మీ కిచ్చారు. ఇంత ఉద్యోగంచేస్తూ అత్తవారిని అడగడానికి అభిమానం అయినా లేదా?" కటువుగా అన్నాను. అంతే నా చెంప ఛెళ్ళుమంది.

ఆ సంఘటనకి దిమ్మెరపోయాను. ఈ శతాబ్దంలోనే చదువు సంస్కారం వున్న ఓ భర్త భార్యని కొట్టడం అన్నది నా వూహకి అందని విషయం. అందుకే కోపం, అవమానం, ఆవేశం, దుఃఖం ముంచెత్తగా "కొట్తారా. మీ కెవ్వరిచ్చారు ఈ అధికారం!" రోషంగా ఎగిసిపడుతున్న గొంతుతో అరిచాను.

"నోర్ముయ్. నన్నే ఎదిరిస్తున్నావా, నీకెంత పొగరు" మరో సారి చెంప పగిలింది. "ఇదివరకల్లా నోటితో చెప్పాను. ఇకపై మాట్లాడితే చేత్తో చెప్తాను జాగ్రత్త." హుంకరించారు. చెంప పట్టుకుని ఎగిసి పడుతున్న గుండెలతో రోషంగా చూశాను. అంతకంటే ఏం చెయ్యగలను? ప్రయత్నంలేకుండానే నా ఆవేశం దిగిపోయింది.

ఆయనలా మాట్లాడుతూంటే యింక నేను అనగలిగింది ఏమి కనపడక కన్నీళ్ళు జారేముందే గదిలోంచి వెళ్ళిపోయాను.

మొదటిసారి ఆ దెబ్బ నా ఆత్మాభిమానంమీద దెబ్బతీసింది. అన్నంతినకుండా ఏడుస్తూ పడుకున్నా చీమకుట్టినట్లయినా ఆయన బాధపడలేదు. కనీసం పొరపాటయింది అంటారేమోనని ఎదురు చూసిన నా ఆశ నిరాశ అయింది.

ఆ సంఘటన తర్వాత ఆయనకోపం సాధింపు ఎక్కువైంది. ఆయనమీద నా విరక్తి హెచ్చయింది. అప్పటినించి ఏ కాస్త సందు దొరికినా మా వాళ్ళని ఆడిపోసుకోడం ఆయన కొక హాబీగా తయారైంది. ఆయనలా అంటూంటే నేను బాధపడ్తానని తెలిసి నామీద కక్ష తీర్చుకుంటున్నట్టు మాటలతో హింసించి సంతృప్తిపడేవారు. ఆయనలా అంటున్నప్పుడు అతి ప్రయత్నంమీద ఆ మాటలు విననట్టు నిగ్రహం చూపసాగాను. నేను ఎదురు తిరిగి జవాబుయిస్తే నామీద ఎగరవచ్చు అనే అవకాశం ఆయన కివ్వకుండా నిర్లక్ష్యంగా ప్రవర్తించ సాగాను. ఆ ఎత్తు పారకపోయేసరికి నాకు మొగుడంటే లెక్కలేదని, ఆయన మాట అంటే నిర్లక్షమని, పొగరని ప్రతి చిన్నదానికి సాధింపు, తిట్లు సాగించారు. మరీ శ్రుతి మించిన నాడు కొట్టి పగ సాధించినట్టు తృప్తిపడసాగారు.

ఆరు నెలల వైవాహిక జీవితంలోనే ఇన్ని అనుభవాలు జరిగాయి. నేను కలలోకన్న ముచ్చటైన సంసారం, ఆలు మగల అన్యోన్యత, సరదాలు, సినిమాలు, షికార్లు. వగైరాలన్నీ కలలుగా మిగిలిపోయాయి కాని ఎన్నడూ కలలోకూడ అనుకోని తిరస్కారాలు, చివాట్లు, చెంపదెబ్బలు, అవమానాలు మాత్రం అనుభవంలోకి వచ్చాయి. నా జీవితం యిలా వక్రించడానికి కారణం ఏమిటి అని ఆత్మ విమర్శ చేసేకొనే దాన్ని అప్పుడు. మా సంసారం ఇలా మారడానికి నేనెంతవరకు బాధ్యురాలిని? ఆయన ఏమన్నా నోరు మూసుకుని సహించలేక పోవడం ఒక్కటే నా తప్పుగా కనిపించేది. ఈ జీవితం ఇంతేనని విరక్తిలో పడిపోయి ఇంట్లో యాంత్రికంగా బతకడానికి అలవాటు పడ్డాను. లేవడం, ఇంట్లో పనిచూసుకోడం, ఆయన ఆఫీసు

కెళ్ళాక కొనుక్కున్న రెండు పత్రికలు ఇక్కడ అక్కడనించి తెచ్చిన పుస్తకాలు, పేపరు చదవడం, ఎంతసేపు వీలయితే అంతవరకు మొద్దులా పడి నిద్రపోవడం, మళ్ళీ మధ్యాహ్నం పని, ఎవరైనా యిరుగమ్మ, పొరుగమ్మ వస్తే పలకరించడం-రాత్రి వంట-తిండి-పడుకోడం-ఒకటే దినచర్య-ఆయనతో ఎంతవరకు అవసరమో అంత వరకే మాట్లాడడం. ఆయన తిట్టే తిట్లకి మనసు మొద్దుబారింది. కొడితే మొదట్లో మాదిరి రోషం అవమానం అనిపించని స్థాయికి చేరాను. ఆయన కాస్త సౌమ్యంగా వున్నరోజు తేలిగ్గా ఊపిరి తీసుకోడం, లేనినాడు బిక్కుబిక్కుమంటూ యింట్లో వుండడం. యిదీ నా బతుకు. సినిమాకి వెడదాం అంటే ముందు రోజుల్లో నీవు వెళ్ళు నాకు ఇంటరెస్ట్ లేదు అనేవారు. ఒక్కర్తినీ వెళ్ళడానికి మనస్కరించక, వెడితే యిరుగు పొరుగు అడిగే ప్రశ్నలకి జవాబు చెప్పాల్సి వచ్చిన పరిస్థితిని అర్థం చేసికుని సినిమాకు్కూడా మానుకున్నాను. వీళ్ళు వాళ్ళు మహిళామండలి అనేవారు. మహిళామండలిలో సాధించే కార్యాలు ఏం లేవని తెల్సినా కనీసం ఆ విధంగానైన కొంతకాలం గడపొచ్చని అనుకుని ఆయనగారిని అడిగాను. 'నోర్మూసుకుని ఇంట్లో పడివుండు. ఏం లేకుండానే నీకింత పొగరు అహంకారం. ఇంక ఈ అమ్మలక్కలతో కలిపి స్త్రీ స్వాతంత్ర్యాలు,హక్కులు అంటూ మరింత నేర్చుకోనక్కరలేదు' అన్నారు కటువుగా.

'డాక్టర్-ఇవన్నీ ఒకరికి చెప్పినా అర్థమయ్యేవికాదు. భర్త నిరాదరణ అన్నది స్త్రీని ఎంత హింపిస్తుందో అనుభవిస్తేగాని అర్థం కాదు. పైకి అదృష్టవంతురాలు, మంచి ఇంట్లో పడింది, మొగుడు వెయ్యి రూపాయలు తెస్తాడు అనుకోవచ్చు అందరూ. అందరికి కావల్సింది, కనపడేది మొగుడి ఉద్యోగం ఆర్జనే! కాని ఆ యిల్లాలు ఏం సుఖపడుతూంది. ఆ భార్యాభర్తలు అనురాగంతో వున్నారా అన్నది ఎవరికి పట్టదు! అదృష్టం అంటే మొగుడి హోదా మాత్రమే!ఇలాంటి స్థితిలో ఏ ఆడపిల్ల అయినా భర్తగురించి ఏం చెప్పగలుగుతుంది. అసలు ఎలా చెప్పగలదు. కన్న తల్లిదండ్రులతోనైనా భర్త తిడ్తున్నాడు, కొడ్తున్నాడని చెప్పుకోడం పరువు తక్కువనిపిస్తుంది.

"అయితే నీ తల్లిదండ్రులకి తెలియదా నీ భర్త ప్రవర్తన.... నీవు వాళ్ళతో మీ అత్తవారితో చెపితే కాస్త పెద్దవాళ్ళు మందలించి బుద్ధిచెప్పి దారికి తెచ్చేవాళ్ళేమో." విజయ అంది. శారద అదోలా నవ్వింది.

"డాక్టర్-మీరు అమాయకుల్లా మాట్లాడుతున్నారు. ఈ దేశంలో ఒక ఆడపిల్లని కన్న తల్లిదండ్రులు అల్లుడికి వంగి నమస్కారాలు చేసేవారే తప్ప, అతని ప్రవర్తనని వేలెత్తి చూపి నిలదెట్టి ప్రశ్నించే అధికారం వున్నవారా? ప్రశ్నించి అల్లుడిని ధిక్కరించే శక్తి, ధిక్కరించాక ఆ పరిణామాలని ఎదుర్కోగల నిబ్బరం వుందా?"

"అవుననుకో. పెద్దలకి తెలిస్తే కొస్త నచ్చచెప్పి కాపురం సరిచేసే వారేమో."

"అయింది డాక్టర్. అదీ అయింది డాక్టర్. ముందులో కొన్నాళ్ళు వాళ్ళకి తెలియదు, తరువాత నేను చెప్పనక్కరలేకుండా వాళ్ళకే తెల్సింది."

"ఎలా?" కుతూహలంగా అడిగింది విజయ.

"ఒకసారి మా అన్నయ్య ఈయన్ని పండక్కి పిలిచి తీసి కెళ్ళడానికి వచ్చాడు. పెళ్ళయింతర్వాత ఆయన ఎన్నిసార్లు పిలిచినా ఏ పండగకీ రాలేదు. సంవత్సరాదికి రాశారు. దసరాకి దీపావళికి రాశారు. సంక్రాంతికి రాశారు.ఒక్క ఉత్తరానికీ యీయన జవాబన్నా యీయలేదు. మొదటి పండగకి ఉత్తరం రాగానే అప్పటికే నేను కాపురానికి వచ్చి ఐదు నెలలు అయిందేమో, అమ్మ నాన్నలని ఈ వంకనన్నా చూడచ్చన్న ఉత్సాహంతో "పండగకి ఎప్పుడు బయలు దేరి వెడదామండీ" అన్నాను సంతోషంగా. ఆయన చిరచిరలాడుతూ 'వెడ్తున్నామని ఎవరు చెప్పారు. నేను వెళ్ళను. చాలు, పెళ్ళి అంత బాగా చేశారు, యింక పండగకి పిలిచి తవ్వి తలకెత్తుతారా!' హేళనగా అన్నారు. నేను నిరుత్తరనయ్యాను. నీళ్ళు కారిపోయేను.

పుట్టింటిమీద ఆశ ప్రతీ ఆడపిల్లకీ వుంటుంది. పెళ్ళయి వచ్చాక పుట్టింటికి మళ్ళీ వెళ్ళలేదు. ఐదు నెలలు అయింది. అందరినీ చూడాలనివుంది. ఒకవేళ ప్రేమానురాగాల్లో ముంచెత్తే భర్తయితే

పుట్టింటిమీద ధ్యాస వుండనంత అన్యోన్యతలో కరిగిపోతూంటే అదో రకం. ఆ అదృష్టం లేదేమో పదేపదే అమ్మవాళ్ళనీ చూడాలనిపించేది. యీ పెళ్ళి చేసుకుని నేనెంత నష్టపోయానో అన్న ఆలోచన వచ్చి నప్పుడల్లా మావాళ్ళు గుర్తువచ్చారు. అయినా అప్పుడే ఏం కొంప మునిగింది యిప్పుడే వెళ్ళక్కరలేదంటారు అని అడగలేకపోయాను. ఈ పండగ వంకనైనా వెళ్ళచ్చన్న ఆశకూడా పోయాక, పట్టరాని కోపం, దుఃఖం వచ్చింది. ఆ రాత్రంతా ఏడిచాను. ఆ మర్నాడు కనీసం నేనొక్కర్తినేనా వెడతానని అడిగాను ఆశగా. మహా తప్పు మాట అడిగినట్టు ఆశ్చర్యంగా చూసి "నీకు మొగుడి గౌరవంతో ఏం సంబంధం లేదనుకుంటే అలాగే వెళ్ళు. ఏ మొహం పెట్టుకుని అడుగు తున్నావు".... అన్నారు కటువుగా. పుట్టింటికి వెళ్ళడానికి ఆయనగారి గౌరవానికి సంబంధం ఏమిటో అర్థం కాలేదు.

"ఏం, అంత అపరాధం వాళ్ళేం చేశారు? వేలు యిచ్చలేక పోవచ్చుగాని మీ గౌరవాలకి ఏ లోటు రాదు. బొత్తిగా అంత గతిలేని వాళ్ళనుకోకండి మా వాళ్ళు" పౌరుషంగా అన్నాను.

"ఇదిగో. నీకు వెళ్ళాలంటే నిరభ్యతరంగా వెళ్ళచ్చు. నామాట మీద లెక్కలేని పక్షంలో నిరభ్యంతరంగా వెళ్ళచ్చు. కాని మరి తిరిగి రానక్కరలేదు." అనేసి వెళ్ళిపోయారు. మరి తిరిగి రావద్దు! ఏమిటో ఆ బెదిరింపు! సరే, రాను, ఏమిటో యీయన బెదిరింపు నేనూ చూస్తాను. ఎగిరి పడుతున్న గుండెలతో ఆ క్షణంలోనే వెళ్ళిపోవా లన్నంత ఆవేశం ముంచెత్తింది. ఒక్క రెండు నిమిషాలలో ఆవేశం చల్లారగానే, తిరిగి రాకుండ ఎక్కడికి వెడతాను! తిరిగి వెళ్ళనంటే అమ్మ నాన్న వూరుకుంటారా? పెళ్ళయిన ఆడపిల్లని పుట్టింటివారు మాత్రం ఎన్నాళ్ళుంచుకుంటారు? లోకులకి జడిసి అయినా కాపురానికి రాకతప్పుతుందా! వెడితే తిరిగి రావద్దంటే ఏం చెయ్యాలి! అలా వెళ్ళి మళ్ళీ వస్తే మరింత లోకువవుతాను? ఆలోచిస్తుంటే ఈ దేశంలో ఓ ఆడపిల్ల స్థితి ఎంత అధోగతిలో వుంది. కాలం మారింది, రోజులు మారాయన్నారు: ఏం మారింది, ఈ నాటికీ భర్త దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి బతకాల్సిందే గదా. ఆలోచిస్తుంటే ఏడుపొచ్చింది. అక్క

బావ వచ్చి వుంటారు. అంతా సరదాగా గడుపుతూంటే నేనిలా....
రాత్రంతా ఏడిచాను అందరినీ తలుస్తూ.

ఆ తర్వాత మరో మూడు సార్లు మావాళ్ళు పండగలకి రమ్మనడం, ఆయనకి వీలులేదంటే కనీసం నన్నైనా పంపమంటూ ఎన్నిసార్లు రాసినా యీయన జవాబు రాయలేదు, నన్ను పంపలేదు. మావాళ్ళని చూడాలన్న కోరిక పీడించినా గత్యంతరంలేక మనసు చంపుకున్నాను. ఈయన ఈ వైఖరితో నా మనసు మరింత విరక్తి చెందింది ఆయనపట్ల. నా కంటికి ఆయనొక నరరూప రాక్షసుడు! చదువుకున్న మూర్ఖుడు. సంస్కార హీనుడు! మానవత్వం మరిచిన మనిషి! మనసులో ఈ రకంగా తిట్టుకుంటూ పైకి భర్తే దైవం అన్నట్టు ఆయన మాట జవదాటకుండా కాపురం చేయడంకంటె ఆత్మవంచన మరేమిటి? నాలా బతికే ఆడవాళ్ళు ఎందరో! లోకం దృష్టిలో మేమంతా పతివ్రతలం. నా మనసులో నా భర్తకి సూదిమొనంత స్థానం అటుంచు—ఆయనంటే నాకు ద్వేషం-కక్ష-కసి-అసహ్యం!

ఆఖరికి మా వాళ్ళకి చూచాయగా ఆయన అలిగారని, పెళ్ళిలో లోటుపాట్లు కారణంగా నన్ను పుట్టింటికి పంపలేదని, పండగకి పిలికి ఘనంగా సత్కరిస్తే వస్తారేమో అంటూ రాశాను. ఆ మాటలు ఎంత మధనపడి, మనసు చంపుకుని ఆత్మాభిమానం బలిపెట్టుకుని రాశానో ఆనాడు. కేవలం అమ్మ నాన్నలని చూడాలన్నా ఆశ నాచేత అలా రాయించింది. ఈ నరకంనించి ఓ వారం రోజులు విముక్తి దొరికినా చాలని రాశాను.

ఆ ఉత్తరం రాశాక పండగముందు అన్నయ్యని మమ్మల్ని తీసుకురమ్మని పంపారు. అన్నయ్యవచ్చి పిలిచాడు. 'నాకు శలవు దొరకదు రావడం కుదరదు.' అన్నారు ఆయన ముభావంగా. అన్నయ్య పాపం నచ్చచెప్పబోయాడు. 'ఒక్క పండగకీరాలేదు, శలవు ఎందుకు దొరకదు, ఎలాగైనా రావాలి' అంటూ బతిమిలాడాడు 'సారీ వీలవదని చెప్పాగా' అన్నారు ఆయన చిరాగ్గా. అన్నయ్య నిస్సహాయంగా చూశాడు. ఆయన ధోరణికి నా మనసు వుడికిపోతూంది. అన్నయ్య మొదటిసారిగా మా యింటికివస్తే భార్య తరఫు బంధువనైనా కనీసం

నటనైనా కనపరచి ఆదరంగా ఆహ్వానించలేదు. ఆయన అన్నింటికి ముభావంగా సమాధానాలు చెప్పారు. ఆఖరికి అన్నయ్య "పోనీ కనీసం శారదనైనా పంపండి. పెళ్ళయి వెళ్ళాక అది మళ్ళీరానేలేదు. అమ్మ గోలపెడ్తూంది చూడాలని." ఆరాటంగా జవాబు కోసం చూశాను. ఆయన నా వంక ఒకసారి చూసి నా మొహంలో ఆరాటం చూసి నన్నేడిపించాలన్నట్టుగా 'ఇప్పుడు తను వెడితే నాకు భోజనం యిబ్బంది. మరోసారి వస్తుందిలెండి' అని బెడ్‌రూములోకి వెళ్ళిపోయారు. ఉక్రోషం ముంచుకు వచ్చింది నాకు. ఆయన వెంట విసురుగా లోపలికి వెళ్ళాను. "నేను అన్నయ్యతో మా యింటికి వెడుతున్నాను. అమ్మవాళ్ళని చూసి నాలుగురోజులలో వస్తాను. స్థిరంగా అన్నాను. 'వీల్లేదు' అన్నారాయన కటువుగా. "ఏం ఎందుకు వీల్లేదు. ఎంత మీరు నా భర్తైనా పుట్టింటికి కూడా వెళ్ళవద్దనే హక్కు మీకులేదు. నేనేం మీకు వంటలక్కనికాదు. పెళ్ళికాకముందు ఏం చేశారు భోజనానికి అదే చెయ్యండి ఈ నాలుగు రోజులూ" ఆవేశంగా అన్నాను "నోరు మూసుకో అట్టే పేలకు వెడితే నీకు నాకు సరి...." అన్నారు నన్ను గుప్పిటలో పెట్టే ఆఖరి అస్త్రం వదిలి. ఆ క్షణంలో వళ్ళు మరిచాను. ఇన్నాళ్ళకపి, దుఖః, రోషం ముంచెత్తాయి. "సరే, మీకంత పెళ్ళాం అక్కరలేదనుకున్నప్పుడు నాకూ మొగుడు అక్కరలేదు. అడుగడుగునా మీ జులుము, అధికారం యింత సహించే ఓర్మి నాకు లేదు. అణిగి మణిగి వుంటున్నానని యింకా అణగదొక్కితే ఎంత సాధుజంతువైనా తిరగబడ్తుంది అన్నది గ్రహించండి. మీ బెదిరింపులు ఆపండి, పెళ్లాన్ని ఎలా వదిలేస్తారో నేనూ చూస్తాను." అన్నయ్య వింటున్నాడని తెలిసే గట్టిగా అరిచాను. ఆయన నాకేకలకి అన్నయ్య ముందు ఆయన గుట్టు బయటపడుతూందన్న కోపంతో, ఉక్రోషంతో చెంప ఛెళ్ళుమనిపించారు. "నీకెంత పొగరు. అన్నని చూడగానే పొగరు మరింత ఎక్కువైనట్లుందే. ఫో....ముందు ఇంట్లోంచి" అన్నారు. అన్నయ్య మా మాటలువిని పడకగది దగ్గరకి వచ్చాడు ఆరాటంగా మా యిద్దరి స్థితి చూసాడు.

'శారదా' అన్నాడు గాబరాగా ఆ పిలుపుతో యిన్నాళ్ళు భరిం

చిన ఆవేదన మరి దాగలేదు. అన్నయ్యా అంటూ అన్నయ్య గుండెలమీద వాలిపోయాను.

'అన్నయ్యా నన్ను మనయింటికి తీసికెళ్ళిపో అన్నయ్యా.... యింక నేనిక్కడ వుండలేను అన్నయ్యా—నన్ను నరకంనించి తీసికెళ్ళు' అంటూ బేలగా వెక్కి వెక్కి ఏడ్చాను. జరిగిన సంఘటనకి మతిపోయినట్లు అన్నయ్య—'ఊరుకో శారదా ఊరుకో. బావగారూ ఏమిటిది? శారదని కొట్టారామీరు' నమ్మలేనట్టు అన్నాడు. ఆయన పరువు బైటపడిందన్నట్టు పరాభవం జరిగినట్టు మొహం గంటపెట్టు కున్నారు.' బావగారూ ఏమిటది చదువు సంస్కారమున్న మీరు ఇలాగైనా ప్రవర్తించాల్సింది. ఆడదాన్ని కొట్టేంత నీచానికి దిగజారతారా అదేం తప్పుమాట అంది పుట్టింటికి వెడతాననడం అంత నేరమా? వాడికీ ఆవేశం వచ్చి ధాటీగానే అడిగాడు. "నేనువద్దన్న పని చేయడం నా కిష్టం వుండదని తెలిసీ దానికా పొగరేమిటి మాటికి మాట ఎదురు చెప్పడం, ఎదిరించడం తప్పు మీ చెల్లెలికి నమ్రతగా వుండడం తెలియదా? తెలియకపోతే తెలియ చెప్పండి.

"ఈవిడ మూలంగా నా వాళ్ళందరికీ దూరం అయ్యాను. కట్టుకున్న మొగుడిని, అత్తవారిని సరిగా చూడడం నేర్పండి."

"ఏమిటి ఎదిరించాను. పెళ్ళయి వచ్చిన దగ్గరనించి ముందు రోజునించి ఒక్కలా కాల్చుకు తింటున్నారు. నన్ను నా వాళ్ళని ఆడిపోసుకుంటూంటే ఎంతకని సహిస్తాను. అన్నయ్యా, ఏం పెళ్ళి చేశారు మీరంతా కలిసి - నా గొంతుకోసారు. ఒక్కరోజు సుఖం లేదు ప్రాణానికి - నన్ను నరకంనించి తీసుకుపో - లేదంటే ఇంత విషం తెచ్చి యియ్యి." ఏడుస్తూ అన్నాను.

"తీసుకుపొండి. మా చెల్లెలికి ఆ బుర్ర తిరుగుడు తగ్గితే పంపండి. భర్త కావాలిస్తే చచ్చినట్లు పడివుండమనండి. లేదంటే తీసుకుపొండి." కటువుగా అని జోళ్ళు తొడుక్కొని బయటకు వెళ్ళిపోయారు.

అన్నయ్య నాద్వారా ముందునించి సంగతులు విన్నాడు.వాడూ చిన్నవాడు. కర్తవ్యం ఏమిటో ఏం చెయ్యాలో వాడికీ తోచలేదు.

"ఏమిటో ఇలాంటి మనిషి. ఈ లోకంలోకూడా ఇలాంటివారు వున్నా రంటే నమ్మలేకుండా వున్నాను. చదువుకున్నవాడు. సంపాదించుకుం టున్నవాడు చొత్తిగా యింతలేకీగా పెళ్ళిలో కట్నాలకోసం లాంఛ నాలకోసం సారెకోసం భార్యనిలా హింసిస్తాడా. మన ఖర్మకొద్ది దొరి కాడు. యిలాంటివాడని తెలియదు.' అంటూ వాపోయాడు. ఇద్దరం కలిసి వెళ్ళడానికే నిర్ణయించాం. యింటికెళ్లాక నాన్న అమ్మ ఏం అంటారో చూద్దాం. తరువాత సంగతి తరువాత అమ్మ నిన్ను చూడా లని బెంగపెట్టుకుంది. పద బయలుదేరు అన్నాడు. ఆ క్షణంలో ఆ నరకం నించి బయటపడపోతున్నందుకు బ్రహ్మానందపడి చకచకా పెట్టె సర్దుకున్నాను.

* * *

ఏడాది తరువాత నా వాళ్ళని చూడగానే కళ్ళు నిండాయి. అప్పటికైనా వచ్చినందుకు అమ్మ నాన్న సంతోషించారు. ఆ సంతోషం పట్టుమని రెండు గంటలే! అన్నయ్య నోట సంగతి విన్న అమ్మ నాన్నల మొహాలు వివర్ణమయ్యాయి. కలవరపడ్తూ 'నిజమేనా తల్లీ.' ఆందోళనగా అడిగారు నాన్న. నిజమన్న సంగతి నా మొహమే చెప్తూంటే యిద్దరూ విలవిలలాడారు! "యిదేం ఖర్మ. సుఖపడ్తావని శక్తికి మించి ఖర్చుపెట్టి పెళ్ళిచేస్తే నీ అదృష్టం యిలా తయారై యిందా. అయ్యో మాకెందుకు రాయలేదు. చదువుకున్నవాడు, వున్న వాళ్ళు అని చేశాం, వీళ్ళిలాంటివాళ్ళని తెలుసుకోలేకపోయాం గదా." అమ్మ కళ్ళు నిండాయి.

"నాన్నా - అతనెంత పొగరుగా మీ చెల్లెలిని తీసుకుపొండి అన్నాడో తెలుసా. తప్పు తనది పైపెచ్చు దీన్ని తిట్టాడు. కొట్టడం ఏమిటి నాన్నా. వెంటనే మీరు ఏదన్నా చెయ్యాలి నాన్నా." ఆవేశంగా అన్నాడు అన్నయ్య. నాన్న ఆవేదనగా "ఏం చెయ్యను?" అన్నారు నిస్సహాయంగా చూస్తూ.

"నాన్నగారూ. నాకున్న డిగ్రీకి ఏదన్నా ఉద్యోగం దొరికితే చూసి పెట్టండి నాన్నా....ఐదో యింత సంపాదించుకుని నా బతుకు నేను బతుకుతాను. నన్నో మనిషిగా చూడని ఆడందంలోకి యింక

వెళ్ళను నాన్నా. ఆడదానికి మొగుడెంత అవసరమో మొగాడికి ఆడ దాని అవసరం అంతకంటె ఎక్కువని ఆయనకి తెలియచెప్తాను" ఆవే శంగా అన్నాను.

నాన్నగారు ఏం అనాలో ఏం మాట్లాడాలో తెలియనట్టు మౌనంగా ఆవేదనగా కూర్చున్నారు. అమ్మ కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది. "శారదని తీసికెళ్ళి దిగబెట్టినపుడు మీరెళ్ళి నాలుగూ అడగండి. అసలతని ఉద్దేశం ఏమటో కనుక్కోండి. మాకింతకంటె శక్తి లేదు అని దణ్ణం పెట్టండి."

"అమ్మా." అరిచాను కోపంగా. "వీల్లేదు. మనం ఏం తప్పు చేశామని వంగి దండాలు పెట్టాలి. మనం లొంగితే యింకా నెత్తి కెక్కుతారు. ఆడపిల్ల నిచ్చినంత మాత్రాన బానిసల్లా పడివుండాలా. ఆయన కంత పెళ్ళాం అక్కరలేదనుకుంటే నాకూ మొగుడు అక్కర లేదు." తీవ్రంగా అన్నాను. అమ్మ అదోలా నవ్వింది.

"శారదా నీకింకా చిన్నతనం. ఒకసారి పెళ్ళంటూ అయ్యాక ఆ మొగుడు కావాలనుకోడానికి అక్కరలేదనుకోడానికి ఈ దేశంలో ఆడదాని చేతిలో ఏం లేదమ్మా. మన సమాజం. మన కట్టుబాట్లు.... యివన్నీ నీ కర్థంకావు. కట్టుకున్న మొగుడ్ని కాదనడం అంతసుళువు కాదు. దాంతో మన పరువు ప్రతిష్ట నీ తోబుట్టువుల భవిష్యత్తు అన్నీ ముడిపడి వుంటాయి. ఈ బంధాలు తెంచుకోడం అంత సుళువే అయితే రోజూ ఎందరో తెంచుకుని పోయేవారు...." నాన్నగారు నెమ్మదిగా అన్నారు.

తెల్లబోయాను. నేనెంత తెలివితక్కువదాన్ని. ఎంతసేపూ నాగురించి నేను ఆలోచించుకున్నాను!! నాన్నగారి మాటలతో హతాశు రాలి నయ్యాను.

ఈ దేశంలో ఆడపిల్లని కన్న తల్లిదండ్రులు ఆడపిల్ల పెళ్ళి చేసి పంపాక అమ్మాయి అదృష్టం బాగుండి సుఖపడితే సంతోషిం చడం లేకపోతే కన్నీరు కార్చడం మినహా ఏంచెయ్యలేని నిస్సహాయు లని మా అమ్మ నాన్నలని చూశాక నా కర్థం అయింది. అమ్మాయిని అల్లుడు హింసిస్తూంటే ఎదిరించి ధైర్యంగా యింటికి తీసుకు రాగలిగే

ధైర్య సాహసాలు వారికి లేవు.

దానికి వాళ్ళని నిందించి ప్రయోజనం లేదు. వాళ్ళుమాత్రం ఏం చెయ్యగలరు. సమాజాన్ని. చుట్టూ లోకులని కాదనే నిబ్బరం. కాదని ఎదిరించి నిలబడగలిగే సత్తువా వుండదు. మనిషి సంఘజీవి. అమ్మాయి కాపురానికి ఎందుకు వెళ్ళలేదు - ఫలానా వారి అమ్మాయి కాపురం వదిలి పుట్టింటి కొచ్చింది అంటే జవాబు చెప్పలేని నిస్సహాయులు. ఒక పిల్ల పరిస్థితుల ప్రాబల్యంతో పుట్టిల్లు చేరితే ఆ కుటుంబంలో మిగతా పిల్లల పెళ్ళిళ్ళు సమస్య అయి కూర్చుంటుంది.

తరువాత పదిహేను రోజులు మావాళ్ళు నాకు ఇదే విషయాన్ని విపులంగా చెప్తూ వచ్చారు అవకాశం వచ్చినప్పుడల్లా నా మంచికోరే చెప్పవచ్చు. కాని దాని చాటున వాళ్ళ నిస్సహాయు. పరువు ప్రతిష్టల ప్రలోభం. నా తోబుట్టువుల భవిష్యత్తు అన్నీ ఆధారపడిన సత్యం గ్రహించాక నేనేం చెయ్యగలను. నిస్సహాయంగా తలదించుకుని బలిపశువులా నాన్నగారివెంట మళ్ళీ ఆనందంలో అడుగుపెట్టాను.

నేను వచ్చిన పది రోజులకి ఆయనగారి నించి నాన్నకి తాఖీదు వచ్చింది. "నేను వద్దన్నా నా మాట వినక నిర్లక్ష్యంగా వెళ్ళింది మీ అమ్మాయి. నా మాట లెక్కలేని పెళ్ళాం నా కవసరం లేదు. ఇక ముందు యిలా జరగదని హామీయిస్తే మీ అమ్మాయి మళ్ళీ యిక్కడికి రావచ్చు. లేదంటే శాశ్వతంగా అక్కడే వుంచుకోండి" అంటూ వచ్చిన ఉత్తరాన్ని చూసి నాన్న అమ్మ గాభరాపడి నన్ను వెంటనే ప్రయాణం కట్టించారు. నాన్న వచ్చి దిగబెట్టి నచ్చచెప్పారు. నీకేం భయంలేదు అంటూ అమ్మ వూరడించింది. భయపడితే మాత్రం ప్రయోజనం ఏమిటి? అక్కడికి వెళ్ళకా తప్పదు - బ్రతకకా తప్పదు. మొండి ధైర్యంతో పాటు నిరాశ, నిర్లిప్తతా కూడా చోటు చేసుకుంది నాలో.

* * *

అల్లుడి ముందు తప్పుచేసిన కుర్రాడిలా నాన్న నెమ్మదిగా. సంజాయిషీ ఇచ్చే ధోరణిలో బతిమిలాడుతున్నట్టు. ప్రాధేయపడ్తున్నట్టు మాట్లాడుతూంటే అవమాన భారంతో నా తల వాలిపోయింది.

ఆడపిల్లగా పుట్టినందుకు సిగ్గుపడ్డాను. ఆడపిల్లగా పుట్టించినందుకు ఆ దేముడ్ని నిందించాను.

"మీ అమ్మాయికి బుద్ధిచెప్పుకోండి. ఈసారికి క్షమిస్తున్నాను. మరోసారి ఇలా జరిగితే సహించను'' అన్నారు. ఆయన నాన్నకు సమాధానంగా. నాన్నగారు నన్నేమనలేక ఏం చెప్పలేక, వదిలి వెళ్ళ లేక దిగులుగా నా తల నిమిరి, చమర్చిన కళ్లని వత్తుకుని నా తల ప్రేమగా నిమిరి ఒకసారి దగ్గరకి తీసుకుని మొహం తిప్పుకు వెళ్ళి పోయారు. అయిపోయింది ఇంకేముంది. నాకు బతుకయినా చావయినా ఇక్కడేనని నా వాళ్ళు సయితం నిర్ణయించారు.

మా నాన్న మామగారికి మీ అబ్బాయి ఇలా అనిరాస్తే మేమేం చేస్తాం. ముందునించి మీ అమ్మాయి ప్రవర్తన సరిగ్గాలేదు, వాడి ప్రవర్తన అలా మారడానికి మీ అమ్మాయే కారణం అని జవాబు వచ్చింది.

ఇటు కన్నవారు అత్తవారు అంతా నా ఖర్మ అని తేల్చాక ఇంకేముంది చేయడానికి - పిచ్చిగా నవ్వుకున్నాను. డాక్టర్‌గారూ ఆ రోజునించి నా బతుకు మరింత నరకమయింది. నాకు ఈ ఇంటికంటే గత్యంతరం లేదని, కన్న తల్లిదండ్రుల సయితం నన్నాదరించరన్న సంగతి నాకేకాదూ ఆయనకీ అర్థం అయింది. ఆయ నేమన్నా ఇది వరకు మాదిరి జవాబు చెప్పగలిగే శక్తి నేను కోల్పోయానని ఆయనా గ్రహించారు. దాంతో ఆయన పశుత్వం మరింత విజృంభించింది. ఏ మాటలంటే నేను బాధపడ్తానో అవే పదే పదే అనడం ఆరంభిం చారు. నేను మౌనంగా వూరుకుంటే "ఏం పాపం నోరు పడి పోయిందే, అహంకారం పొగరు ఇప్పటికైనా తగ్గిందా. పుట్టింటికి పరిగెడితే ఏ బాబూ నిన్ను ఆదుకోడని అర్థమైందా. నీకీ ఇల్లేగతి అని తెలుసుకున్నావా, ఏం జరిగినా కట్టుకున్నవాడితోనే బతుకు అన్నది అర్థం అయిందా. ఏదో తప్పు ఎత్తి ఏ చిన్న సాకు దొరికినా, అసలు ఏ కారణం లేకపోయినా నన్నెత్తి పొడుస్తూ హేళనచేస్తూ వ్యంగోక్తు లతో నన్ను నా వాళ్లని ఆడిపోసుకుంటూ నన్నేడిపించడమే పరమా వధిగా తయారయ్యారు.

ఆ వాతావరణంలో జీవచ్ఛవంలా బతుకుతూ, సిగ్గు అభిమానం పౌరుషం అన్నీ విడిచి ఆయనపడేసే తిండికోసం కుక్కలా బతకడం దుర్లభంగా వుండేవి. ఎన్నోసార్లు ఆ హింస అవమానం భరించలేక చచ్చిపోదామనుకునే దాన్ని. ధైర్యం చాలేదికాదు. అసలు అలాంటి బతుకులో కూడా ఇంకా ఏదో మూల చిన్న ఆశ, బతుకుపట్ల తీపి నన్ను చావనీయలేదు. పోనీ ఇంట్లోంచిపోయి అమ్మ నాన్నల దగ్గరకి పోకుండా ఏదన్నా ఉద్యోగం చేసుకుంటూ బతికితేనో అన్న ఆలోచన వచ్చేది. కాని నాకు ఉద్యోగం ఎవరిస్తారు? నాలాంటి బి.ఎ. లు లక్షల మంది వుండగా ఉద్యోగం అంత సులువుగా దొరుకుతుందా. అసలెలా ప్రయత్నం చేయడం. ఈ సంగతి ఈయన గుర్తిస్తే చంపుతారు. అసలు అలా ఉద్యోగం చేసుకుందామన్నా దాంతో మావాళ్ల పరువు ప్రతిష్ఠలు, నా తోబుట్టువుల భవిష్యత్తు ముడిపడి వున్నాయిగదా! ఇంకొకరి కోసం అంత త్యాగం చెయ్యాలా ఈ ఆలోచనలు నన్ను ఉక్కిరి బిక్కిరి చేయసాగాయి.

ఈలోగా నాకు నెల తప్పింది. దానికి సంతోషించాలో ఏడా రించాలో అర్థంకాని పరిస్థితిలో పడ్డాను. అందరూ అన్నట్టు పిల్లలు పుడితే ఈయన మారుతారేమో ఆయన. బిడ్డల తల్లిగా నన్ను అవి మానిస్తారేమో అన్న ఆశ ఒకవైపు ఈ బంధం ఏర్పడితే ఆయన మారకపోతే పిల్లలకోసం అన్నా జీవించక తప్పని స్థితిలో ఇక్కడే పడుండాలి అన్న భయం ఒకవైపు - పెళ్లయిన ఏడాది తరువాత భార్య నెల తప్పితే సంతోషించని భర్తలుంటారా లేక సినిమాలలో, కథలలో అంతలా అతిశయోక్తులుగా చూపిస్తారా? పది రోజులు గడిచాక ఆ మాట చెప్పాను ఆయన మొహంలో భావాలు పరికిస్తూ. 'ఆహా' అన్నారు అతిమామూలుగా. మనసులో సంతోషపడ్డారో లేదో భగవంతుడికే తెలియాలి, పైకి మాత్రం ఆయన ముఖకవళికలు ఏమాత్రం మారలేదు. లేక నా దగ్గర అది నటనో నాకు తెలియదు. ఎంత దుర్మార్గపు భర్త అయినా కడుపుతోవున్న స్త్రీని అపురూపంగా చూస్తారంటారు. అదీ అబద్ధమే అయింది నా విషయంలో. వేవిళ్లతో బాధపడ్తున్నాగాని, వంట్లో సరిలేక లేవలేకపోయినా, వేళపట్టున ఏది

అమరకపోయినా ఆయనగారికి ఏ చిన్న లోటువచ్చినా ఇంత పిసరు సర్దుకోకపోగా 'ఈనాటికి లోకంలో కడుపుతోవున్న దానివి నీ వొక్క_ర్తివేకాదు. ఎప్పుడుచూసినా పడక-బద్ధకంబలిస్తే అలాగే వుంటుంది. లేచి కులాసాగా తిరిగితే కదా ఆరోగ్యం బాగుంటుంది. ఎప్పుడు చూపినా నిద్ర మొహం నీవున్ను' అంటూ విసుక్కునేవారు. ఆయన పట్ల నా విముఖత మరింత పెరిగింది. ఇంక ఆ పిల్లలని చూసుకుని బతుకు ఈడ్చాలి అన్న విరక్తిలో, నిర్లిప్తతలో పడ్డాను.

నన్ను ఆ బంధంతో బంధించడం ఇష్టంలేనట్టు భగవంతుడు నా మీద దయతలిచో, నన్నింకా పరీక్షించడానికో అన్నట్టు— మూడో నెలలో ఎబార్షన్ అయింది. బాత్‌రూములో బాల్చి ఎత్తుతూ కాలుజారి పడ్డాను. అసలే నీరసంగా తిండి లేకుండావున్న నాకు ఆ దెబ్బకి రక్తస్రావం అయింది. 'తీరి కూర్చుని ఏదో తెస్తావు. నిన్ను బాల్చి ఎవరు మోయకున్నారు' అంటూ తిట్టారు. బాల్చితో వేడినీళ్ల స్నానానికి నేను పెట్టాలి. అలాంటి ఆయన బాల్చి ఎందుకు మోసానని తిడితే ఏం చెయ్యడం! ఆస్పత్రిలో తీసికెళ్లి పడేశారు. ఎబార్షన్ అయింది. అసలే నీరసం మీద చాలా రక్తంపోయి వారం రోజులు పక్కనంటిపెట్టుకుని వుండాల్సి వచ్చింది. ఆ వారం రోజులు ఆయన విసుగు చెప్పనలవికాదు. బాధతోవున్న మనిషికి ఓదార్పు ధైర్యం ఇవ్వాల్సిందిపోయి విసుక్కుంటూంటే ఈ ప్రాణంపోతే ఎంత హాయిగా వుండేదని బాధపడ్డాను. అమ్మని చూడాలని వూరికే తపనపడింది మనసు. నోరు విడిచి అడగడానికి అభిమాన పడ్డాను. అడిగినా ఆయన వాళ్లకి రాయకపోతే అనిపించి వూరుకున్నాను.

ఇంటికి వచ్చాక శవాకారంగా తయారయినా నా అవతారం చూపి, పనిచేసుకోడానికి నేను పడే అవస్థ చూపి ఆ రాయిలాంటి మనిషికి కూడా జాలి అనిపించింది గాబోలు నాలుగు రోజులుపోయాక 'మీ అమ్మగారిని కొన్నాళ్ళు రమ్మని రాయి. సాయం వుంటారు' అన్నారు. ఇప్పుడయినా మీ యింటికెళ్ళు రెస్టుతీసుకురా అంటే సంతోషించేదాన్ని. అమ్మరావాలి. చాకిరి చెయ్యాలి. ఆయన గారికి సమస్త సౌకర్యాలు జరగాలి. ఒకరోజయినా ఆయన సర్దుకోరు 'అవసరం

లేదులెండి, నామీద మీకెందుకంత జాలి' అన్నాను ఉక్రోషంగా—

"అయితే ఏడు, నీ ఖర్మపోనీ అని చెబితే బుర్ర తిరుగుడు" అన్నారు కోపంగా.

శ్రీధర్ గదిలోకి వస్తూ విజయని చూసి "ఇవాళ డ్యూటీకి శలవు ఇచ్చేసావా ఏమిటి, నీ పేషంట్లు కాచుకు కూర్చున్నారు అవతల. వెళ్లిపొమ్మన్నావా ఏమిటి వాళ్లని" నవ్వుతూ అడిగాడు. విజయ టైమ్ చూసుకుని అయ్యో ఈ మాటల్లో పడి టైము కూడా చూడలేదు.... జస్ట్ ఎ మినిట్—

'శారదా కాసేపు రెస్టుతీసుకో పని పూర్తి చేసుకువస్తాను.' విజయ హడావిడిగా లేచి వెళ్లింది. వెడుతున్న విజయని శ్రీధర్‌ని చూస్తే ముచ్చట అన్పించింది శారదకి. అతని కళ్ళల్లో ఆమెపట్ల ఎంత అనురాగం, ఆరాధన కనిపిస్తుంది. అలాగే విజయా శ్రీధర్‌ని దేముడన్నట్టు భావిస్తున్నట్టు ఆమె ప్రతిచర్యలో కన్పిస్తుంది. ఎంత అదృష్టవంతురాలు డాక్టర్-ఆలుమగల అన్యోన్యతని వించిన సంపద ఏం కావాలి ఆడదానికి!

అందంగా, ఆనందంగా వుండే ఆవిడ వెనక ఏదో కథ వుందంటే ఆశ్చర్యకరమనిపిస్తోంది. ఆవిడ కథ తెలుసుకోవాలని శారదకి మహా ఆరాటంగా వుంది. గంటసేపటి నుంచి మాట్లాడి మాట్లాడి అలసిపోయి కళ్ళు మూసుకొంది శారద.

*　　　*　　　*

శారదా, సరే యిన్నాళ్ళనించి లేనిది యివాళ కొత్తగా ఏం జరిగిందని ఆత్మహత్యకి తలపడ్డావు చెప్పు. కొత్తగా వచ్చిన కష్టం ఏమిటి? పన్నెండు గంటలవరకు ఊపిరి తిరగని పనిలో సతమతమయి పేషంట్లు వెళ్ళాక ఆరాటంగా గదిలోకి వస్తూనే అడిగింది విజయ. శారద మాటాడలేనట్లు కళ్ళు వాల్చుకొంది.

"ఏం జరిగింది శారదా?" ఆరాటంగా చూపింది విజయ చెప్పమన్నట్లు.

"డాక్టర్! మొన్నటి రోజుతో నా సహనం, ఓర్పు ఆఖరి మెట్టుకు వెళ్ళాయి. డాక్టరుగారూ! మా చెల్లెలి పెళ్ళండీ. మరి నాలుగు

రోజుల్లో. చెల్లెలి పెళ్ళికి కూడా వెళ్ళ వీలులేదంటే నా మనసెంత బాధపడుతుందో ఆయనకి తెలీదా! తెలిసే నేను ఏడిస్తే చూడాలని ఆయనకి సరదా. పెళ్ళికి వెళ్ళడానికి వీలులేదంటే నేను సహించలేక, ఇన్నాళ్ళు అణిగి వున్న కసి, ఉద్రేకం నాలో కట్టలు తెంచుకోగా వళ్ళు మరిచి అరిచాను, తిట్టాను—'మీరు మనుషులు కాదు పశువులు, రాక్షసులు. మీలో సంస్కారం మాట దేముడెరుగు-మానవత్వం లేదు, నరరూప రాక్షసులు, నేనేం తప్పు చేశానని నన్నిలా హింసిస్తున్నారు నా మీద యింత కక్ష మీ కెందుకు? ఛీ. మీ మొహం చూడాలంటేనే అసహ్యం నాకు. మీతో కాపురంకంటె యింత విషం మింగి చావడం నయం' అంటూ కసి తీరా తిట్టి ఏడిశాను. అన్ని మాటలు అన్నాక ఆయన వూరుకుంటారా? ఆయన కసితీరా కొట్టారు. వళ్ళు మరిచి నేను అరిచినట్టు వళ్లు మరిచి ఆయన కొట్టారు. ఆ దెబ్బలకి, ఆ తిట్లకి ఆ రోజుల్లో నాకు భవిష్యత్తుపట్ల మినుకు మినుకుమనే ఆశ కాస్త ఆరిపోయింది. యింకెందుకు బతకాలో తెలియలేదు. ఈ యిల్లు వదిలి వెళ్ళేదారి లేదు. వెడితే భవిష్యత్తు అగమ్యం. నా వాళ్ళకి నేను సమస్య అవడం యిష్టంలేక ఇంతకంటె గత్యంతరం కనపడక ఈ నిర్ణయానికి వచ్చాను డాక్టరుగారూ—చెప్పండి డాక్టర్! యిప్పుడు చెప్పండి నేను తొందరపడ్డానా? నేను చేసింది తప్పా? నా సమస్యకి పరిష్కారం ఏదన్నా వుందంటారా? చావుతప్ప మరో మార్గం నాకుం దంటారా? ఇప్పుడు జవాబు చెప్పండి డాక్టర్! నన్ను బతికించి నా కెంత ద్రోహం చేశారో ఇప్పటికయినా అర్థమయిందా డాక్టర్—" ఆవేశంగా సవాల్ చేస్తున్నట్లు అడిగింది శారద.

విజయ సాలోచనగా శారద వంక చూస్తూండి పోయింది ఒక నిమిషం. ఏదో నిశ్చయించుకొన్నదానిలా స్థిరంగా తలెత్తి—

"ముందే చెప్పానుగా శారదా! ప్రతి సమస్యకి పరిష్కార మార్గం వుంటుందని."

శారద ఆశ్చర్యంగా చూసింది.

"అవును శారదా—నీ సమస్యకి పరిష్కారం నీవు ఆయనని ఎదుర్కోగలగడమే. అణిగి మణిగి పడివున్నన్నాళ్ళు మరింత అణ

చాలనే ప్రభావం మనిషిది. అందులో నీ భర్తలాంటి మగవాళ్ళకి భార్య అంటే అణిగి పడివుండేదని, ఎక్కడికీ పోలేదని, చచ్చినట్లు ఏమన్నా భరిస్తుందని వాళ్ల వూహ. వాళ్ళ అపోహ తొలగించి—భార్య అంటే బానిస కాదు, భార్య అంటే ఆ సంసారంలో భర్త కెంత స్థానం వుందో భార్యకీ అంతే స్థానం వుందని అతనికి తెలియ చెప్పడం నీ బాధ్యత. భార్య స్థానం భర్త పాదాల దగ్గర కాదు హృదయంలో అని నిరూపించాలి నీవు—అవసరమైతే ఎదిరించాలి."

"మీకు నేను చెప్పింది సరిగా అర్థం అయినట్టు లేదు. ఆయనని ఎదిరించకపోతేనే నా గతి ఇలా వుంది. ఎదిరిస్తే బతకనిస్తారా" ఆశ్చర్యంగా అడిగింది శారద.

"అవును బతకనీయడు. ఇంట్లోంచి పొమ్మంటాడు. సరే వెళ్ళిపోతున్నాను అను" విజయ నిబ్బరంగా చెపుతూంది. శారద విచిత్రంగా చూసింది.

"ఎక్కడికి పోను? మీకు చెప్పానుగా నన్ను స్వీకరించే స్థితిలో మావాళ్ళు లేరని. మరి ఎక్కడికి వెళ్ళను? ఏ అండ చూసుకొని ఆయన్ని ఎదిరించను?" జాలిగ అంది శారద.

"పిచ్చి శారదా, బతకదలచుకొంటే మార్గమే కనపడలేదా నీకు ఇన్నాళ్ళు-ఆయనింట్లో చేసే వంట ఏ యింట్లో చేసినా ఆ మాత్రం తిండి పెట్టి-మరో నలభయ్యో ఏభయ్యో సంపాదించుకోగలవు. అంతకంటె గౌరవంగా బతకగలవని ఆయనకి తెలియచెప్పు, అలా తెగేసి, తెగించి నిర్ణయాలు చేయడం చెప్పినంత సులువు కాదని నాకు తెలుసు అంటే నిన్ను వంట పని చెయ్యమని చెప్పడం కాదు నా ఉద్దేశం-ఆయన నిన్ను మనిషిగా, భార్యగా గౌరవంగా చూడకపోతే యిల్లు విడిచి నీవు వెళ్ళగలవన్న భావం ఆయనకి కలిగించు. ఏదన్నా అంటే నీవు వెళ్ళిపోతావన్న భావంతో భయంతో ఆయన్ని వుంచాలి నీవు—"

శారద అర్థం కానట్లు చూసింది—"అదెలా? నేనలా జవాబిస్తే సరే పో అంటే ఎక్కడికి పోను? ఆయన నా బెదిరింపు వుత్తి బెదిరింపే అని గ్రహిస్తే........"

"అది బెదిరింపు కాదని ఆయనకి తెలిసేలా నీ మీద మళ్ళీ చెయ్యి చేసుకొంటే యిల్లు వదిలి నా దగ్గరికిరా—ముందుగా ఆయనకి ఇక ముందు కొట్టి కట్టి హింసిస్తే పడివుండనని, గౌరవంగా భార్య కీయాల్సిన స్థానం ఇవ్వకపోతే ఆ రోజుతో నీకూ నాకూ సరి అన్న వుద్దేశం మాటలతో తెలియజెయ్యి. అప్పటికీ లెక్క చెయ్యకపోతే చేతలతో చేసి చూపించు. శారదా, అలాంటి సమయం వచ్చినపుడు నీకు నేను అండగా నిలుస్తాను; సంఘ భయంతో నీ తల్లిదండ్రులు నిన్ను ఆదరించలేకపోవచ్చు. కాని సాటి స్త్రీగా నిన్ను నేను ఆదుకొంటాను. నీకూ ఓ డిగ్రీ వుంది. ఏదో బతుకు తెరువు చూపించే వరకు నిన్ను నేను ఆదుకుంటాను శారదా—ఏదో వుద్యోగం దొరికాక నీ బతుకు నీవు బతకలేకపోవు."

"డాక్టర్." నమ్మలేనట్టు చూసింది శారద. 'మీరు - మీరు నన్ను ఆదుకుంటారా.' కృతజ్ఞత భావంతో ఆమె గొంతు మూగ పోయింది. 'మీకు నేనేం అవుతానని యింత దయ చూపిస్తారు డాక్టరు గారూ. కన్నతల్లి తండ్రులే నా ఖర్మానికి నన్ను వదలగా - మీరు.... నన్ను ఆదరిస్తారా.' శారద కళ్ళు చెమ్మగిల్లాయి.

"శారదా ముందే చెప్పానుగదా. ఏ స్త్రీ అయినా భర్త ఆదర ణకి దూరం అయి బతకడం అంటే అదెంత నరకమో నాకు తెలుసు. అలాంటి దురవస్థనించి ఒక్క స్త్రీని రక్షించినా అంతకంటె సంతృప్తి నాకేం వుంటుంది. శ్రీధర్ నేను డాక్టర్లుగా రెండు చేతులా ఆర్జి స్తున్నాం. నీకో బతుకు తెరువు దొరికేవరకు నిన్ను ఆదుకోడం మాకేం కష్టంకాదు."

"కాని. డాక్టరుగారూ. లోకం....నా స్థానం...."

"లోకం. వెధవ లోకం సంగతి మరిచిపో. నీ భర్త నిన్ను హింసిస్తూంటే ఏం చేసిందా లోకం నీకు. చూడు శారదా. లెక్క చెయ్యని వాళ్ళ జోలికిరాదు లోకం. భయపడుతూంటే మరింత లోకువ కట్టి సాధిస్తారు మనుష్యులు. ఎన్నాళ్ళు అంటారు. రెండు రోజులు వింతగా చెప్పుకుంటారు. మూడోరోజు అలవాటయి మానేస్తారు. ఒక ఆడది ఎంత నరకం కాకపోతే సంసారం వదులుకుంటుంది అన్న

యింగిత జ్ఞానంతో ఆలోచించలేని మనుష్యుల గురించి నీవు పట్టించుకో వద్దు...."

శారద ఆలోచనలో పడింది ఒక్క_క్షణం. విజయ మాటలతో ఏదో ధైర్యం, తెగింపు కల్గుతూంది. కాని ఈ ధైర్యం చివరివరకు నిలుస్తుందా! లేదా యిటుకాకుండా అటుకాకుండా తన బతుకు తయారవుతుందా అన్న సందిగ్ధంలో కొట్టుమిట్టాడింది. ఆమె సంశయం గుర్తించినట్లు విజయ "శారదా. యిప్పుడే అంత దూరం ఆలోచించ నవసరం లేదు. ముందు మాటలతో సవ్యంగా నీ భర్త మారితే సంతోషమే. చూడు శారదా ఈ మగవాళ్ళకి మాత్రం పెళ్ళాం యింట్లోంచి లేచిపోయిందంటే పరువు తక్కువ కాదనుకుంటావా? భార్య యింట్లోంచి వెళ్ళిపోయిందంటే వాళ్ళుమాత్రం నలుగురిలో తలెత్తుకోగలరా? పైపై బెదిరింపులేకాని నిజంగా భార్య యింట్లోంచి వెళ్ళిపోవడం వాళ్ళకిమాత్రం యిష్టం అనుకుంటున్నావా? శారదా యీనాడు స్త్రీలకి చాలా హక్కులు వున్నాయి. భార్యని పొమ్మనడం రమ్మనడం అంతా వాళ్ళకిష్టమే కాదు. ఒకవేళ యింకా మూర్ఖంగా అతను ప్రవర్తిస్తే, మారకపోలే నీకు అండగా నేనున్నాను. తరువాత కోర్టు వుంది నీకు న్యాయం చేకూర్చడానికి."

శారదకంతా ఏదో అయోమయంగా వుంది. తనిన్నాళ్ళు ఎందుకింత తెలివి తక్కువగా భయపడింది. అతను భార్యని వదలడం అంత సులువా. ఈ మాత్రం ఆలోచన లేకుండా అంతలో ఎందుకు భయపడింది. అమ్మ నాన్న రానీయరని, లోకులు ఏమంటారోనని పిచ్చి భయాలతో నరకంలో మగ్గింది. యిప్పుడు విజయ యిచ్చిన చేయూత ఆసరాతో తన బతుకుని చక్కదిద్దుకోడమో - తెగతెంపులు చేసుకోడమో తన చేతిలో పని!

"ఏమిటంతలా ఆలోచిస్తున్నావు. నీ ఆలోచనలు నాకు తెలుసు. చూడు శారదా మీవారు ఊరినించి ఎప్పుడు వస్తారు?"

"మరి రెండు మూడు రోజుల్లో."

"ఆహా. అయితే ఒక పని చెయ్యి. రేపు రెస్టు తీసుకుంటే నీ ఆరోగ్యం చక్కబడుతుంది. ఎల్లుండి బయలుదేరి మీ చెల్లెలి పెళ్ళికి

వెళ్ళు. చెల్లెలు పెళ్ళికి వెళ్ళవద్దనే హక్కు ఆయనకిలేదు. ఆయనకిష్టం లేకపోతే మానవచ్చు నిన్ను వద్దనడం అమానుషం. అంచేత ఇంట్లో ఉత్తరం రాసి పక్కింట్లో తాళం యిచ్చి వెళ్ళు. పెళ్ళయ్యాక తిరిగిరా. అప్పుడు ఆయన గొడవ లేవదీస్తే అలా నిన్ను కట్టడిచేసే అధికారం భర్త అయినంత మాత్రాన లేదని తెలియచెయ్యి-చేయిచేసుకుంటే నీ అస్త్రం వుపయోగించు...."

"ఏమిటి గీతా రహస్యం భోధిస్తున్నావు. ఈ పూటకి భోజనం వద్దా ఏంటి - పోనీ క్యారియర్ పంపమంటావా? యిటు భోజనం అటు గీతోపదేశం పూర్తవుతుంది." శ్రీధర్ గుమ్మందగ్గర నిలబడి వింటూ హాస్యంగా అన్నాడు. "పన్నెండున్నర అయింది తెలుసా."

"ఐడియా. గుడ్ ఐడియా. ప్లీజ్ యింటికెళ్ళి భోజనం పంపించవూ వంటవాడితో. ఎలాగో శారదకి భోజనం పంపాలి, ఆ చేత్తో నాకూ."

"బాగుంది. ఏదో హాస్యంగా అంటే—అయినా ఆ అమ్మాయిని పాపం ఎందుకలా పాడుచేస్తావు. నీవు మొగుడిని వదిలింది చాలక అందరికీ నేర్పిపెడ్తున్నావా. చూడండి శారదగారూ. ఆవిడమాటలు విని చెడిపోకండి." చమత్కారంగా అన్నాడు శ్రీధర్.

"మొగుడ్ని వదిలి నేను చెడిపోయింది ఏమి లేదులే, నీవు దొరికావు." విజయ నవ్వుతూ అంది.

"బాగుంది నీ అదృష్టంకొద్ది నాలాంటి వెర్రి వెంగళాయి దొరికాడు. అందరికీ దొరకవద్దూ."

విజయ కళ్ళు శ్రీధర్‌వైపు తిరిగాయి. ఆ కళ్ళల్లో ఆరాధన, ప్రేమ శారద దృష్టిని దాటిపోలేదు. "నిజం శ్రీ - మగవాళ్ళంతా నీలా ఆలోచించితే మా ఆడవాళ్ళకి యిన్ని సమస్యలు మిగిలివుండేవికావు." ఆమె గొంతు బొంగురుపోయింది...."శారదా, శ్రీధర్ అన్నది నిజం. భర్తతో తెగ తెంపులు చేసుకోడం కష్టంకాదు. ఆ స్త్రీకి మిగిలిన జీవితం మోడై పోకుండా తిరిగి నీరుపోసి చిగురింపచేసే పురుషుడు దొరకడం దుర్లభం—నా పుణ్యంకొద్ది శ్రీధర్ దొరికాడు."

"అపాపు. ఈ మాటలు కొన్ని వేలసార్లు విని విని విసిగెత్తి

K. S. R

పోయాను. ఇప్పటికే గర్వంతో నా ఛాతి యింత వెడల్పు అయిపోయింది. యింకా పెరిగిందంటే కొత్త షర్టులు కొనుక్కోవాలి. సరే నేను వెళ్ళి భోజనం పంపిస్తాను" అంటూ వెళ్ళాడు శ్రీధర్.

వాళ్ళిద్దరి అన్యోన్యత అనురాగం చూస్తుంటే శారద మనసు సంతృప్తితో నిండిపోయింది. తను కలకన్న జీవితం యిది! తనకి దక్కింది ఏమిటి? "శారదా ఏమిటి ఆలోచిస్తున్నావు. నేను చెప్పినట్లు చెయ్యి.

"భగవంతుని దయవల్ల నీ కాపురం చక్కబడితే మంచిదే. లేదంటే ఏదో ఉద్యోగం చేసుకుందువుకాని. శ్రీధర్‌లాంటి సంస్కారి. ఉన్నతుడు మరొక పురుషుడు నీ జీవితంలో తటస్థపడితే నీకు జీవితంలో లోటు వుండదు...."

"డాక్టర్‌గారూ. మీగురించి చెపుతానన్నారు. చెప్పండి ప్లీజ్. వినాలని చాలా ఆరాటంగా వుంది. నిజంగా మిమ్మల్ని చూస్తుంటే మీరు జీవితంలో కష్టాలు పడ్డారంటే నమ్మశక్యంకాని విషయంలా అనిపిస్తూంది. చెప్పండి ప్లీజ్." ఆత్రుతగా అంది.

విజయ నవ్వింది. "ఏం చెప్పమంటావు. నీకు తెలియని కొత్త విషయాలు లేవు. నీలాగే మొగుడి చేతిలో చివాట్లు, చెప్పు దెబ్బలు తిని అవమానం సహించిన దానినే."

"అలా కాదు సరిగా చెప్పండి."

"వుండు. ఇదిగో క్యారియర్ వచ్చింది. భోజనం చేస్తూ చెప్తాను." క్యారియర్ విప్పి రెండు ప్లేట్లలో వడ్డించింది విజయ.

ఇద్దరూ భోజనం చేయసాగారు. విజయ ఎంతసేపటికి తనకథ చెప్పక పోవడం చూసి ఆరాటం అణుచుకోలేక శారద "చెప్పండి మరి." అంటూ తొందరపెట్టింది.

"నీవు ఆ విషయం మరిచిపోవన్నమాట సరే ఇందాక చెప్పానుగా శారద, మొగుడి చేతిలో హింస అనుభవించిన వారి అన్ని కథలూ ఒకలాగే వుంటాయని మీ ఆయనకంటె మా ఆయన మరి రెండు ఆకులు ఎక్కువే చదివారు. మీ వారికి నిన్ను హింసించడం ఒక్కటే వ్యసనం కాని మా ఆయనకి తాగుడు, వ్యభిచారం వుండ

వలసిన వ్యసనాలన్నీ వుండేవి...." శారద ఆశ్చర్యంగా చూసింది.

"మరి అతను అలాంటి వాడని ముందు మీకు తెలియలేదా?"

"హ....తెలిస్తే....చూస్తూ చూస్తూ ఏ తల్లిదండ్రులు పిల్లనిస్తారు. అందులో అపురూపంగా ముగ్గురు మగపిల్లలు తరువాత పుట్టిన ఆడపిల్లని తీసికెళ్ళి అలాంటి హీనుడికి ఎందుకిస్తారు?

"ఐశ్వర్యం మధ్య పుట్టాను, అపురూపంగా పెరిగాను, ముల్లోకాలు గాలించి తెచ్చినట్టు అందగాడు, ఉద్యోగస్థుడు, ఆస్థిపరుడు అయిన వరుడ్ని వెదికి తెచ్చి ఏభై వేలు ఖర్చుపెట్టి వైభవంగా పెళ్ళి చేశారు. తక్కినవన్నీ చూశారుగాని గుణం సంగతి మరిచిపోయారు నాన్నగారు. లేదు మరిచిపోలేదు. తెలుసుకోలేక పోయారు. ఇంతకీ నన్ను కన్నారు కాని నా రాతని కనలేదు వాళ్ళు! వాళ్ళు చేయగలిగిందంతా చేశారు. కాని నా అదృష్టాన్ని వాళ్ళెలా మార్చగలరూ? ఆయన మేడిపండని. వయోముఖ విషకుంభమని చూడగానే ఎవరికి తెలుస్తుంది. పచ్చగా ఆరడుగుల పొడుగుతో అందంగా దృఢంగా వుండే ఆయన రూపం, ఆయన నాలుగంకెల సంపాదన, రెండు లక్షల ఆస్థి చూసి చిలుక గోరింకలా వున్నారు. ఇద్దరికిద్దరూ అందంలో, ఐశ్వర్యంలో పోటీపడుతున్నారు. ఇదంతా విజయ అదృష్టం అన్నారంతా-కాబోలనుకుని పొంగి పోయాను నేనూ.

"కాని నేనెంత అదృష్టవంతురాలినో మొదటి రాత్రే తెల్సిపోయింది. అబ్బ! శారదా ఆ రోజు గుర్తు వస్తే భయంకరమైన కల వచ్చినట్లు వణుకు వస్తుంది. ఆ రాత్రి....

*    *    *

ఆ రాత్రి....మొదటిరాత్రి అందరి కన్నెపిల్లల మాదిరే కోటి ఆశలతో కోర్కెలతో గదిలో అడుగు పెట్టింది విజయ. అప్పటికే ప్రకాష్ గదిలోవున్నాడు. తెల్లని వెన్నెలలాంటి కాంతి పాలనురుగులాంటి పాన్పు అంతకంటె తెల్లని మల్లెలు, జాజులమాలలు వేలాడుతున్నాయి మంచానికి. ఆ పాన్పు మీద మన్మథుడిలా కన్పించాడు. ప్రకాష్ విజయకి. అలవోకగా పాన్పు మీద పవళించివున్న ప్రకాష్ విజయ గదిలోకి రాగానే అదోలా విలాసంగా నవ్వాడు.

విజయని ఆపాదమస్తకం పరీక్షించి సిగరెట్టు పొగ విలాసంగా వదిలి పక్కమీదనించి లేచి విజయవైపు అడుగులు వేశాడు. విజయ సిగ్గుతో తలదించుకుంది. ప్రకాష్ జానపద హీరోలా చూపుడు వేలితో విజయ చుబుకం ఎత్తి కళ్ళలోకి అదోలా చూసి "ఊ ...అందగత్తెవే ఈ అందాన్ని ఇన్నాళ్ళు ఎవరూ ఆస్వాదించలేదా?" అన్నాడు అదోలా నవ్వుతూ. విజయ బిత్తరపోతూ చూసింది. "ఏం—ఇంత అందాన్ని ఎవరికీ ఇవ్వకుండా నా కోసమే దాచి వుంచావా ఇన్నాళ్ళూ—ఏమో ఈ ఆడవాళ్ళని నమ్మలేం, చెప్పు నేను ఎన్నోవాడిని. పరవాలేదు నేను ఏం అనుకోను." విషపు నవ్వు నవ్వాడు...."ఏమిటీ మాటలు". అర్థం కాక తెల్లపోతూ చూసింది విజయ "పోనీ నీవు ఎవరిని ప్రేమించ లేదూ ఇన్నాళ్ళు. నిజంగా ఇష్టపడే చేసుకున్నావా ఈ పెళ్ళి?" మొహంలో మొహంపెట్టి బుజాలమీద చేతులు వేశాడు. విస్కీవాసన గుప్పున కొట్టింది. ఉక్కిరి బిక్కిరి అవుతూ...."ఏమిటిది మీరేం మాట్లాడుతున్నారు అసలు?" అంది మాటలు కూడ దీసుకుంటూ భయంగా.

"నా మాటలే అర్థంకానంత అమాయకురాలివా....ఆహాహా.... పోనీలే. రా....నీ అందం అంతా నా కోసం ఇన్నాళ్ళు దాచావన్న మాట థాంక్స్...." అంటూ మోటుగా కౌగిలిలోకి లాగి బలంగా చేతులు బిగించి పెదాలు అందుకోబోయాడు. విజయ వెగటుగా మొహం తిప్పుకుని "మీరు....మీరు తాగారా...." అంది భయం భయంగా చూస్తూ—

"ఏం తాగకూడదా....మగువతోపాటు మధిర కూడా కలిస్తే ఎంత మజాగా వుంటుందో తెలుసా....కమాన్....ఆలశ్యం చేయకు."

మొరటుగా విజయని నలిపివేయసాగాడు. విజయ ఉక్కిరి బిక్కిరి అవుతూ.... "వదలండి....ఛీ....ముందు వదలండి నన్ను— తాగివచ్చి....మీరు మీరిలాంటి.... "విజయ మాటలు పూర్తికాక ముందే అతను విజయని మాట్లాడనీయకుండా నోటితో పెదాలు మూశాడు. "ఊ....మరి ఎలాంటి వాడి ననుకున్నావు." అన్నాడు వికటంగా నవ్వి. విజయ ఊపిరి అందక గిలగిలలాడి మొహం తిప్పు

కుంటూ, కౌగిలిలోంచి వదిలించుకోడానికి పెనుగులాడింది. భయంతో, అవమానంతో, ఆవేశంతో, అసహ్యంతో ఆమె గుండెలు ఎగిసి పడుతున్నాయి. గట్టిగా రెండు చేతులతో ప్రకాష్‌ని ఒక్క విదిలింపుతో విదిలించి తీక్షణంగా చూస్తూ "ఏమిటిది....మీరు....స్వప్రహాలో వున్నారా అసలు. ఛీ.... తాగివచ్చి నాతో మొదటి రాత్రి భార్యతో ప్రవర్తించవలసిన తీరుయిదా. చదువుకున్నవారు. ఓ రాగుబోతులా" విజయకి ఆవేశంతో మాట తడబడింది.

"తాగుబోతులా ఏమిటి తాగుబోతునే. మీ ఆడవాళ్ళతో ఇంత కంటె సున్నితంగా ప్రవర్తిస్తే లొంగుతారా....నాకిలాగే అలవాటు." విజయ కోపానికి బెదరనట్టు నవ్వి మళ్ళీ దగ్గరకు లాక్కోబోయాడు. విజయ దిగ్భ్రాంతితో చూస్తూ.

"అంటే....మీకిలా అలవాటంటే అర్ధం...." తడబడ్తూ అడిగింది.

"అర్ధం వెరీ సింపుల్ మైడియర్. నీకు కొత్తేమోగాని.నాకీ అనుభవం కొత్తకాదు."

జంకు గొంకు లేకుండా తెగేసి చెప్తున్న ప్రకాష్‌ని నమ్మలేనట్టు చూసింది. అతను అబద్ధం ఆడడం లేదన్నది గ్రహించింది. విజయ. ఆమెకా క్షణంలో ఏం చెయ్యాలో కూడా తోచనంత దిగ్భ్రాంతి కల్గింది. ఎన్ని రకాల సంబంధాలు ఎంచి ఎంచి ఆఖరికి ఓ తాగుబోతు, వ్యభిచారినా తను వివాహం ఆడింది. పై రూపం చూసి ఎంతలా మోసపోయారు తామందరూ! విజయ తనని తాను మరిచిపోయింది. "ఎంత మోసం ఎంత దగా మీరిలాంటి వారని తెలియకుండా దాచి మమ్మల్నింత మోసం చేస్తారా." కోపంతో జేవురించిన మొహంతో పిచ్చిగా అరిచింది.

"మోసం! దగా మీరు ముందుగా నీవు తాగుబోతువా, వ్యభిచారివా అని అడిగారా నీ చదువెంత, నీ జీతం ఎంత, నీ ఆస్థి ఎంత అని ఆరాతీసారు. వాటికి జవాబులు వచ్చాయిగా" హేళనగా. అన్నాడు ప్రకాష్. "అయినా డియర్ అమూల్యమైన కాలాన్ని యిలాంటి వృధా సంభాషణతో గడిపేస్తావా కమాన్ డార్లింగ్" విజయ చేయి

పట్టుకుని, నడుంచుట్టూ చేయివేసి మంచంవైపు లాగాడు. విజయ తీక్షణంగా చూసి చేయి లాక్కుంది విసురుగా. "నన్ను వదలండి— నన్ను ముట్టుకోవద్దు. నా జోలికి రావద్దు." అంది కఠినంగా.

"బలే మొదటిరాత్రి పెళ్ళాం వద్దంటే మానేసేటంత చవటనా. కమాన్ బేబీ....అనవసరంగా గొడవచెయ్యకు." మొరటుగా విజయని ఎత్తుకెళ్ళి మంచం మీద పడేశాడు. విజయ దెబ్బతిన్న దెబ్బులిలా లేచింది. తిరస్కారంగా చూసింది.

అతని ముఖం మరింత కఠినంగా మారింది.

"చూడు....ఇందాకటినించి పోనీగదా అని ఇంత వరకు వూరుకున్నాను. ఒకసారికంటె పిలవడం నా కలవాటు లేదు.ఊ....రా...." కటువుగా అన్నాడు ప్రకాష్. విజయ బిత్తరపోతూ చూసింది ఆ కోపాన్ని. 'నీవు మాటలతో లొంగేదానివి కావన్నమాట. సరే' ప్రకాష్ ఒక్కొ అడుగువేస్తూ ముందుకు వస్తూంటే పిల్లిచేత చిక్కబోయే గోరంకలా వణికింది. ఆలోచనకి వ్యవధిలేదు. శక్తికొద్దీ ప్రతిఘటించింది. కాని అతని పశుబలం ముందు, అందులో తాగిన బలంముందు ఎంతోసేపు ప్రతిఘటించలేక పోయింది.

* * *

'శారదా....ఆ రోజు అనుభవం ఏ ఆడదానికీ వద్దు శారదా—' కళ్ళు మూసుకుని పెదాలదురుతూండగా అంది. ఆ సంఘటన ఇన్నాళ్ళ తరువాత తలుచుకున్నా విజయ వళ్ళంతా చెమట పట్టింది. "శారదా— అది మొదటి రాత్రి కాదు. నా పాలిట కాళరాత్రి. అంత అమానుషంగా, పశువులా ఏ భర్తా ప్రవర్తించి వుండడు. స్త్రీ పురుష సంబంధం మీదే విరక్తి, ఏహ్యత కలిగిస్తుంది ఆ అనుభవం. అప్పటి నా నిస్సహాయత, మనస్థితి ఊహించు. ఏడవడానికి కూడా మనసు మొద్దుబారిపోయింది. నిస్సహాయంగా, నిస్సత్తువుగా తోటకూర కాడలా అలా వేళ్ళాడి వుండిపోయాను. నేను ప్రతిఘటించిన కొద్ది ఆయన పశుత్వం మరింత పెరిగింది. గిల్లాను, రక్కాను, కొరికాను. జుట్టు పీకాను. నా ప్రతిచర్య అగ్నిలో అజ్యం పోసినట్టు ఆయన పశుత్వాన్ని వృద్ధి చేసింది. ఆఖరికి ఏమయితేనేం ఆయన ముందు ఓడిపోయాను. నా

సర్వస్వం దోచుకున్నారు....' విజయ గొంతు వణికింది.

శారద కళ్ళ రెప్పలు ఆర్చడం మరిచి వింటూంది ఆశ్చర్యంగా "ఇదేమిటి. ఆయనసలు అలాంటి వారెందుకయ్యారు. ఏమయినా కారణం వుందా....మంచి కుటుంబం అంటున్నారు, ఆస్థిపరులు, చదివినవారు అన్నారు. అలాంటి వ్యక్తి ఇంత అమానుషంగా ప్రవర్తించడానికి ఏదన్నా కారణం వుండి వుంటుందని నా ఉద్దేశం."

"కారణం వుంది. ఏ కారణం అయితేనేం నా బతుకు బండలు అయింది. ఎవరితో చెప్పుకోను? ఏమని చెప్పుకోను. తమ ముద్దుల కూతురి బ్రతుకు ఇలా వక్రించిందని అమ్మకి నాన్నకి చెప్పి వాళ్ళనీ బాధించనా—ఏం చెయ్యాలి! ఒకసారి తాళి కట్టాక ఆ భర్తని తప్పించుకోడం అంత సుళువా? అసలు ఆయనెందు కింత అమానుషంగా ప్రవర్తించారు! ఇష్టంలేని పెళ్ళా? నాకేం తక్కువ? అందం, చదువు, ఆస్థి అన్నీవున్న నాకేం లోటని ఆయనకీ పెళ్ళి యిష్టం వుండదు? ఇంకెవరినన్నా ప్రేమించారా? పెద్దలు వప్పుకోకపోతే బలవంతాన చేసుకుని ఆ కక్ష నా మీద చూపారా? ఆయనకిన్ని వ్యసనాలు ఎందుకు అలవాటయ్యాయి. ఆ మిగిలిన రాత్రంతా నా ఆలోచనలవి! ఆయన వంటి మీద తెలివిలేనట్టు పడుకుంటే ఆయనని అంటుకుంటూ పడుకోడం కూడ అసహ్యమనిపించి సోఫాలో వ్రాలిపోయి తెల్లవార్లూ జాగారం చేశాను.

తెల్లారి వాడిపోయిన నా మొహం, ఏడుపుతో ఎర్రబడ్డ కళ్ళు చూసి అమ్మ 'రాత్రంతా నిద్రలేనట్టుంది, హాయిగా వేడినీళ్ళ స్నానం చేసి టిఫిను తిని పడుకో' అంది నవ్వి. అలాంటి అమ్మకి ఏం చెప్పను? ఎంత తల్లి అయినా నా భర్త ప్రవర్తన ఇది అని మొదటి రాత్రి జరిగింది ఎలా చెప్పను. నోటి చివరి వరకు వచ్చిన మాటలని బలవంతాన నిగ్రహించుకున్నాను. జరగవలసింది జరిగాక యిప్పుడు చెప్పి ప్రయోజనం ఏమిటి? అసలు విషయం ఏమిటో తెల్సుకోకుండా ముందే చెప్పి వాళ్ళనీ బాధ పెట్టడం ఎందుకు? నిన్నరాత్రికి ముందు ఈయన సంగతి తెలిస్తే ఎంత బాగుండేది? ఆలోచించి ఆయన సంగతి ఏమిటో తేలాకే చెప్పవచ్చని ఊరుకున్నాను.

రెండో రాత్రి గదిలోకి వెళ్ళకుండా ఏ కారణంతో తప్పించు కోవాలా అని ఎన్ని విధాలో ఆలోచించాను. కాని అది ఇంట్లో పెద్ద అలజడి లేవదీస్తుంది. బంధువుల గుసగుసలకి దారితీస్తుందని ఆ ఉద్దేశం విరమించుకున్నాను.

ఆ సమస్య రాకుండానే ఆ మధ్యాహ్నం ప్రకాష్ రాత్రి ఫ్లయిట్‌లో హనీమూన్‌కి వెళ్ళిపోతాం అని నాన్నకి చెప్పేడట. నాన్న అమ్మ అయ్యో మూడు నిద్రలు అంటూ గోలపెట్టారు. కాని ఆయన వినిపించుకోలేదు. వాళ్లమ్మ గృహప్రవేశం అంది. ఏం లేదని కొట్టి పారేశాడు అతను. అంతా ఏమనలేక వూరుకున్నారు. హనీమూన్ నించి ఇటువచ్చి సామాన్లు అవి తీసివెళ్లాలి అంటే అన్ని అక్కడికి పంపండి అన్నాడు. అంత మూర్ఖంగా ఏం చెప్పినా కాదనే అల్లుడిని చూసి అమ్మ నాన్నా అతని స్వభావాన్ని అర్థం చేసికోలేక బాధపడ్డారు. అమ్మ నన్ను చాటుగా పిలిచి హనీమూన్ నించి ఎలాగైన ఇక్కడికి రావడానికి వప్పించమని చెప్పింది. అంతగా రాకపోతే ఉద్యోగం వూరు చేరగానే రాస్తే తాను సామాన్లు పట్టుకుని వస్తానంది.

ఒకరాత్రి అనుభవంతో ప్రకాష్ తత్వం అర్థం అయ్యాక అలాంటి మనిషి వెంట వెళ్ళాలంటే ఏదో భయంతో గుండెలు దడ దడ లాడయి....కాని తప్పదు? ఈ మనిషికి 'హనీమూన్' ఏమిటి అని నవ్వు వచ్చింది అంత బాధలోనూ—

"పోనీ ముందురోజు అలా అయినా తరువాత సక్రమంగా ప్రవర్తించలేదా?" శారద ఆరాటంగా అడిగింది.

"ఆ మనిషికి సక్రమంగా ప్రవర్తించడం తెలిస్తే ముందురోజే అలా ఎందుకు గడుస్తుంది—" హనీమూన్ అంటూ తీసికెళ్ళి బెంగుళూరులో ఓ హోటల్లో పడేశారు. ఆ గదే మామూలు దంపతులైతే స్వర్గంలా కనిపించేదేమో! నా పాలిట నరకం అది! ఎటు పోవడానికి లేని బందిఖానా తయారు చేశారు నాకోసం!

ఎవరితో చెప్పుకోడానికి కూడా వీలులేకుండా నా వాళ్ళనించి దూరం చెయ్యడానికి ఈ హనీమూన్ ఏర్పాటు చేశారని రెండు రోజుల్లోనే తెలుసుకున్నాను.

ఆ రాత్రి-భోజనానికి ముందు సీసాలు పెట్టుకు కూర్చున్నారు. 'రుచి చూస్తావా డియర్.' అన్నారు గ్లాసులోకి వంచి - తిరస్కారంగా మొహం తిప్పుకున్నాను. ఆయనలా నా కళ్ళముందే నేసు లేనట్టే తాగడం సహించలేక ఆయన వంక సూటిగా చూస్తూ "నేన కొన్ని విషయాలు అడుగుతాను, జవాబు యిస్తారా?" అన్నాను కరకుగా. అప్పటికే మందు తల కెక్కింది గాబోలు ఉషారుగా సిగరెట్టు పొగ నామీదకి ఊది- 'ఓ యస్.' అన్నారు.

"ఈ పెళ్ళి ఎందుకు చేసుకున్నారు?"

"వాట్ - పెళ్ళి ఎందుకు చేసుకొంటారు, ఆడదాని అవసరం కోసం."

"హు...ఆడది మీకు పెళ్ళిచేసుకోకపోయినా దొరుకుతుందిగా." కసిగా అన్నాను.

"కరక్ట్. ఆడదాని అవసరం అంటే యిల్లు వాకిలి, వంట గింట-పిల్లలు. ఎన్నాళ్ళు బాచలర్ లైఫ్ అని విసిగెత్తి చేసుకున్నాను."

"ఓహో. భార్య అంటే మీరిచ్చే నిర్వచనం ఇదన్నమాట.."

"అబ్బబ్బ, అంత పెద్ద మాటలు వాడితే అర్థాలు నాకు తెలియవు." చిద్విలాసంగా అన్నారు. మాటలకోసం ఒక్కక్షణం తడుముకున్నాను.

"మీ కిన్ని వ్యసనాలు వున్నాయని దాచి ఒక స్త్రీని మోసంచేసి పెళ్ళాడడం అమానుషం అన్పించలేదా. ఏ స్త్రీ అయినా తెలిసి తెలిసి మీలాంటి వారిని పెళ్ళాడుతుందనుకున్నారా." ఆవేశంగా అడిగాను.

"అందుకేగా దాచింది." వేళాకోళంగా అన్నారు. అలా మాట్లాడే మనిషిని ఏం చెయ్యగలరు ఎవరన్నా.

"ఆడదంటే మీకింత చుల్కన భావం ఎందుకు?"

ఆయన ఒక్క క్షణం మాట్లాడలేదు. తరువాత కసిగా చేతిలో సిగరెట్ ఏష్ ట్రేలో నొక్కుతూ—"మీ ఆడవాళ్ళని ఇలా అణచి వుంచాలి. అలా అయితేనే మీరు లొంగుతారు. చనువిస్తే నెత్తి కెక్కుతారు...." కటువుగా అన్నారు.

"ఆహా. మిమ్మల్ని కన్నతల్లి - మీ రక్తం పంచుకు పుట్టే

చెల్లెలు అందరూ ఆడవాళ్ళే అని మరవకండి. అణిచి మణిచి వుంచితే ఆడదే కాదు నోరులేని సాధు జంతువైనా తిరగబడ్తుంది. ప్రేమతో విషం తాగించగలరు...."

"స్టాపిట్. ఈ నీతులు నాదగ్గిర వల్లించకు." కసిరారు.

"సరే, మీరు ఎందుకిలా తయారయ్యారు. అందుకేమన్న కారణం వుందా లేదా యిది మీ స్వభావమా?" సూటిగా అడిగాను.

"ఆ ప్రశ్నకి జవాబు నీ కనవసరం." అన్నారు నానించి చూపులు తప్పించి.

"సరే....నా విషయం గురించి మాట్లాడుతాను. తెలియక మోసపోయి మీ కిచ్చి పెళ్ళిచేశారు మా నాన్నగారు, కాని యిప్పుడు తెలిశాక నేనింక మీతో కాపురం చేస్తాననా మీ ఉద్దేశం...."ఆవేశంగా అడిగాను.

"చెయ్యకు." నిర్వికారంగా తాగుతూ అన్నారు.

"సరే, రేపే నేను యిక్కడనించి వెళ్ళిపోతాను. తరువాత మళ్ళీ కోర్టులో కలుసుకుందాం." బింకంగా అన్నాను.

"నేను డైవోర్సు యియ్యకపోతే,.... యివ్వడానికి యిష్ట పడకపోతే"....అన్నారు సూటిగా చూసి. ఆ ప్రశ్నకి జవాబు నాకు తెలియదు. అవును ఆయన డైవోర్సు యీయడానికి యిష్టపడకపోతే ఏం చెయ్యాలి?

"మీరు తాగుబోతని, వ్యభిచారని కోర్టులో నిరూపించితే కోర్టు వారే యిస్తారు డైవోర్సు." ఆ రూల్సు వగైరాలు తెలియకపోయినా డబాయించినట్లన్నాను.

ఆయనకళ్ళు తాగడంవల్లో, కోపంతోనో ఎర్రబడ్డాయి. 'ఆహా. ఎలా నిరూపిస్తావు?' హేళనగా అన్నారు. నిజమే ఎలా నిరూపిస్తాను?

జవాబుకి నేను తడుముకోడం చూసి వ్యంగ్యంగా నవ్వారు. ఆ నవ్వుకి ఉక్రోషం వచ్చింది.

"ఛీ - మీరింత నీచులు. హీనులు అనుకోలేదు....మీలాంటి వాడితో కాపురం కంటె చావడం నయం. చావనైనా చస్తాను కాని మీతో కాపురం చెయ్యను....కోర్టులో విడాకులు దొరకక పోవచ్చు

కాని, మీతో బలవంతంగా కాపురం ఎన్ని కోర్టులు కలిపినా చేయించ లేవు నాచేత. అది గుర్తుంచుకోండి. నేను రేపు ఉదయం ప్లైట్‌లో వెళ్ళిపోతాను. నాకీ పెళ్లే కాలేదనుకుంటాను....నిన్న రాత్రి జరిగింది ఏదో పొరపాటని, యికముందు అలా ప్రవర్తించరని చెప్తారని మీ వెంట వచ్చాను. తాళి కట్టించుకున్న పాపానికి మీరు యికపై సజావుగా ప్రవర్తిస్తారేమో నన్న ఆశతో వచ్చాను. కాని అది పట్టిమాట అని తెలుసుకున్నాను. యింక పిచ్చి భ్రమతో ఇక్కడ వుండేంత తెలివి తక్కువదానిని కాను...." కటువుగా అన్నాను.

నా మాటలన్నీ ఆయనకి కోపం తెప్పిస్తాయని తెలుసు. కాని ఆడింది ఆటగా పాడింది పాటగా ముద్దుగా పెరిగిన నేను ఆయన తిరస్కారం, హేళన భరించలేకపోయాను. నా జీవితం యిలాంటి వాడి వల్ల నాశనం అయిందన్న దుఃఖం కసిగా మారింది. నేను కన్న కలలన్నీ యీ విధంగా మారేసరికి, ఎదురు చూడని ఈ పరిణామానికి నా మనసు విపరీతంగా దెబ్బతింది. ముందు సంగతి ఏమిటన్న ఆలోచనకి కూడా వ్యవధి లేనంతగా ఉక్కిరి బిక్కిరి చేసింది రాత్రి సంఘటన, వెంటనే ప్రయాణం!—నా జీవితం కంటె ఎక్కువా నాన్నగారి పరువు ప్రతిష్ఠ. తమ ముద్దుల కూతురు జీవితం యిలా అయిందంటే వాళ్ళు మాత్రం సహిస్తారా? లోకం కోసం తమ కూతుర్ని తాగుబోతు, వ్యభిచారి చేతిలో వదులుతారా? అసలు నిన్ననే చెప్పవలసిందేమో! ఇక్కడికి రావడంలో తొందరపడ్డానా - పొరపాటు చేశానేమో - ఏమయితే అవనీ - తరువాత సంగతి తరువాత, ముందు నాన్నగారితో చెప్పి ఆ తరువాత ఆలోచించవచ్చు - నిశ్చయించుకున్నాను. నా నిశ్చయం నా మొహం మీదే కన్పించినట్లుంది.

"అయితే వెళ్తున్నావన్నమాట." అన్నారు నిరసంగా చూస్తూ.

"ఇందాకే చెప్పాను ఆ మాట. మీలాంటి భర్తని నేనే కాదు ఏ ఆడదీ అంగీకరించదు. గతిలేక ఎవరన్నా భరించవచ్చు. కాని నాకా ఖర్మ లేదు." నిబ్బరంగా అన్నాను.

"నేను వెళ్ళనీయకపోతే" కటువుగా అడిగారు. ఆ తీవ్రతకి ఒక్క క్షణం గుండె కొట్టుకోలేదు. వెంటనే లేని ధైర్యం తెచ్చుకుని

"నన్నాపడం మీ తరంకాదు." అన్నాను ఆవేశంగా. అంతే ఆయన ఒక్క ఉదుటున లేచి నా చెంప ఛెళ్ళుమనిపించారు. "నీకెంత అహం కారం—నాతరం కాదూ....యిప్పుడే చూపిస్తా నాతరం అవునో కాదో." అన్నారు. నన్ను గట్టిగా రెండు చేతులు పట్టుకు లాక్కెళ్ళి మంచంపై పడేస్తూ. ఆ కొట్టిన దెబ్బకి కళ్ళ ముందు మెరుపులు మెరిసి కళ్లు చీకట్లు కమ్మాయి. దెబ్బ అన్నది ఏమిటో తెలియకుండా పెరిగిన నన్ను ఆ దెబ్బ స్థాణువుని చేసింది. ఏం జరిగిందీ తెలుసుకునే లోపలే ఆయన చేతిలో గిలగిల లాడుతున్నాను. "నీ పొగరు యిలాగాని అణ గదు. మీ ఆడవాళ్ళ నిలాగే అణిచి పెట్టాలి. హా-నీకు నా సంగతి యింకా పూర్తిగా తెలియదు కాబోలు. నా కెదురు చెప్పి బతకగలనను కుంటున్నావా. నేను నీ మొగుడ్ని అని మరిచిపోకు. నిన్ను అంత సుళు వుగా వదులుతా ననుకుంటున్నావా. నీకిదే శిక్ష." అమానుషంగా మొదటిరోజుని మించి పశువులా ప్రవర్తిస్తుంటే ప్రతిఘటించే శక్తి కూడా లేకపోయింది. ఎలాగో ఒక్క నిమిషం ఊపిరి పీల్చుకునే వీలు దొరకగానే 'ఛీ-పశువా, రాక్షసుడా నన్ను వదులు. లేకపోతే అరు స్తాను. నలుగురిని పిలుస్తాను. పోలీసులకి రిపోర్టు యిస్తాను.' ఎగిసి పడుతున్న గుండెలతో అరిచాను....'అరు, నిన్ను రక్షించే వాడెవడో చూస్తాను.' నోరు గట్టిగా దవడ ఎముకలు విరుగుతాయేమో నన్నంత బలంగా నొక్కారు. బాధతో గిలగిలలాడాను. ఆ రాక్షస క్రతువు పూర్తి అయ్యాక—లేచి "వళ్లు దగ్గర పెట్టుకు మసులుకో. నన్ను రెచ్చగొడితే యిదే జరుగుతుందని గుర్తుంచుకో." వగరుస్తూ అన్నారు. ఆ క్షణంలో నా చేతిలో ఆయుధం ఏదన్నా వుంటే ఆయనని హత్య చేసివుండేదానిని....కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ వగరుస్తూ అలా పక్క మీదే పడవున్నాను.

ఆయన బాత్‌రూముకి వెళ్ళగానే - ఆ క్షణంలోనే అక్కడ నించి వెళ్ళిపోవాలన్న ఆవేశంలో చటుక్కున లేచి చిరిగిన జాకెట్టు మార్చుకున్నాను. నలిగిన చీర విప్పి మరోటి కట్టుకొని పైన వున్న నాలుగు వస్తువులు పెట్టిలో కూరి చకచక గుమ్మం వైపు అడుగులు వేశాను. అదే నిమిషంలో బాత్‌రూమ్‌లోంచి ఆయన రానే వచ్చారు.

ఒక్క నిమిషం ముందు అయితే ఆ గది దాటగలిగేదాన్ని. నా చేతిలో పెట్టివంక చూసి జరగబోయేది గ్రహించారు. చటుక్కున ముందుకు వెళ్ళి తలుపు తీస్తున్న నన్ను ఒక్క అంగలో సమీపించి పక్కకి బలంగా నెట్టి తలుపు లాక్ చేసి తాళం వేశారు. వికటంగా నవ్వారు. 'ఇంకా నీకు బుద్ధి రాలేదన్న మాట.' అంటూ విసురుగా నా చేతిలో పెట్టె లాగారు. 'వదలండి నన్ను. వదలండి.' పిచ్చిగా అరిచాను. 'తలుపు తీయండి - ఈ నరకంలో ఒక్క క్షణం వుండను. నన్ను వదలండి.' పెట్టె గింజుకోబోయాడు. ఆయన నా మాటలు లక్ష్యపెట్ట నట్టు పెట్టె టేబిల్ మీద పడేశారు. నా చేతిలో హాండ్ బాగ్ లాక్కు న్నారు. దాన్లో తాళంతీసి పెట్టి తీశారు. చీరలు అన్ని విసిరి దాన్లో వున్న డబ్బు - నా బంగారు వస్తువులు - బ్యాగులో పర్సు అన్నీతీసి రూములో వున్న గ్రాడెజ్ బీరువాలో పడేసి లాక్ చేశారు. ఆ తాళం, తలుపు తాళం లాల్చీ జేబులో వేసుకుని నావైపు చూడకుండానే నిర్ల క్ష్యంగా వెళ్ళి పడుకున్నారు. నిస్సహాయంగా నిలబడి చూడడం మినహా ఏం చెయ్యలేక పోయాను. నన్ను అక్కడ బందీ చేశారని గ్రహించగానే ఏడుపు ముంచుకు వచ్చింది. సోఫాలో కూలబడి.... ఏనాడు కంట తడి బెట్టని నేను వెక్కి వెక్కి హృదయ విదారకంగా ఏడిచాను. అక్కడ లేని అమ్మ నాన్నలని ఉద్దేశించి రాత్రంతా ఏడు స్తూనే వున్నాను.

ఆ వూర్లో వున్న పది రోజులు నేను బందిఖానాలోనే గడి పాను. ఆయన ఎప్పుడూ రూములోనే వుండేవారు. ఎప్పుడన్నా పైకి వెళ్ళినా రూము తాళం వేసుకు వెళ్ళేవారు. అక్కడనించి వెళ్ళే మార్గం లేదని స్పష్టపడింది. ఆయన రూములోంచి వెళ్ళిన కాసేపటిలో తలుపులు బాది ఏ బాయ్‌నో పిలిచి తాళం తెమ్మని పారిపోతే అన్న ఆలోచన వచ్చింది. కాని....అలా చేస్తే హోటలులో అంతా ఏమను కుంటారు? మేనేజరుకి ఏం చెప్పాలి. ఏం అనుకుంటే నాకేం. నేనెవరో యిక్కడ ఎవరికీ తెలీదు. ఎవరేం అనుకున్నా ముందీ బంది ఖానా నించి బయటపడాలి. ఓ రోజు తెగించి ఆయన బయటికి వెళ్లాక కిటికీలోంచి బాయ్‌ని పిలిచి సాధ్యమైనంత సహజంగా "బాయ్-మా

వారు నేనిండాక బాత్‌రూములో వున్నానని పైన తాళం వేసి వెళ్లారు. మీ స్పేర్ తాళం తీసుకొచ్చి తలుపు తీయి. ఆయనెప్పటికి వస్తారో ఏమిటో" అన్నాను. నా మాటలు వినగానే బాయ్ నా వంక అదోలా చూశాడు.

"తాళం లేదండి. రెండు తాళాలు వారే తీసుకున్నారు" అన్నాడు. ఆయన ముందు జాగ్రత్తకి, ఆ తెలివికి తెల్లపోయాను.

మరో రోజు మరో ఆలోచన వచ్చింది. 'నాన్నకి టెలిగ్రాం యిస్తే-' అనిపించి వెంటనే కాగితంమీద తక్షణం వచ్చి కల్సుకో వల్సింది అని ఎడ్రసు యిచ్చి టెలిగ్రాం రాశాను. టెలిగ్రాం యివ్వ డానికి కూడా రూపాయి డబ్బులు లేకపోయాయి. బాయిని పిలిచి నా చేతి వాచి టెలిగ్రాం యిచ్చి ఎలాగైనా టెలిగ్రాం పంపమని బతిమ లాడాను. బాయ్ నావైపు భయంగా, అనుమానంగా చూసి "వద్దండీ- మేనేజర్-మీరేం చెప్పినా చెయ్యొద్దని, మీ దగ్గిర ఏం తీసుకోవద్దని అన్నారు" అంటూ నేను పిలుస్తున్నా వినకుండా వెళ్ళిపోయాడు. హతాశురాలి నయ్యాను. ఆయన అన్ని విధాల పకడ్బందీగానే నన్ను బందీ చేశారని తెలిసింది. సరే - ఎన్నాళ్ళిక్కడ వుంచుతారు, వూరు వెళ్లాక ఎన్నాళ్ళని బందిఖానాలో పెడ్తారు చూద్దాం అనుకున్నాను.

"ఏమిటీ అమానుషత్వం ఆయనింత క్రూరంగా ఎందుకు తయారయ్యారు!"

శారద ఆశ్చర్యం పట్టలేక మధ్యలో అడిగింది. విజయ అదోలా నవ్వింది.

"వుండు చెపుతాను. తొందరపడకు ఊ....మా పదిహేను రోజుల హనీమూన్ ముగిసింది. ఆయనను ఎదిరించితే ఆయనలో రాక్షసత్వం మరీ ఎక్కువవుతున్నదని గమనించి మిగతా రోజులు ఆయనేమన్నా వూరుకుని, ఆయనకి కావల్సినపుడు వళ్ళు అప్పగించాను. ఆయనని కాదనకపోతే, ఎదిరించకపోతే పశుత్వం అంత వుండేది కాదు. ఆయనకి బెదిరి లొంగానని "ఏం బుద్ధి వచ్చిందా, ముందే యీ బుద్ధివుంటే ఎంత బాగుండేది" అన్నారు ఒక రోజు తాగిన మత్తులో లేనపుడు-దేనికి మాట్లాడేదాన్ని కాను నేను.

"వూరికి వెళ్ళేముందు మా యింటికి వెళ్ళి సామాన్లు తెచ్చుకోవాలి. నా బట్టలు అవీ అన్నీ వుండిపోయాయి" అన్నాను.

"అన్నీ పంపమంటాను. నీ వాళ్ళు యిచ్చే ఫర్నిచర్కి మొహం వాచిలేను. ఇంట్లో అన్నీ వున్నాయి. అయినా ముందు మనం వెడ్తున్నది మా యింటికి."

'నేను ముందు మా యింటికి వెళ్ళాలి—' పట్టుదలగా అన్నాను.

"వీలులేదు." కటువుగా అన్నారు తీక్షణంగా చూస్తూ—

ఇంకేం అంటాను. వాళ్ళింటికి వెళ్ళాం. గృహప్రవేశం అంటూ అత్తగారువాళ్ళు హడావిడి చెయ్యబోతే ఈయన అవేం అక్కరలేదన్నారు. ఆవిడ నిట్టూర్చి 'వీడు ఎప్పుడూ యింతే ఏ ముద్దూ ముచ్చటా లేదు' అన్నారు బాధగా. మా అత్తగారు, మామగారు చాలా మంచివాళ్ళలాగే కన్పించారు. ఎంతో అభిమానం ఆదరణ చూపారు. కన్న కూతురిలా ఇది తినమ్మా అది తినమ్మా 'అదేమిటి కొత్త పెళ్ళికూతురివి నవనవలాడుతూ వుండాలి, ఇలా ఎండిపోయావేమిటి, ఆ భోజనాలు అవి పడలేదా—ఏమిటి నీ మొహం అలావుంది. ఆప్యాయంగా దగ్గిర కూర్చోబెట్టుకుని కొసరి కొసరి వడ్డించేవారు ఆమె. ఆమె చూపే అభిమానం చూసాక నా హృదయంలో గూడు కట్టుకున్న దుఃఖం అంతా ఆమెతో వెళ్ళబోసుకోవాలనిపించి. కాని, మీ కొడుకిలా అని ఆమెతో ఎలా చెప్పను? ఇంట్లో మా ఇద్దరి వరస చూసి, కొత్త దంపతుల్లా సంతోషంగా వుండకపోవడం చూసి ఆవిడకే అనుమానం వచ్చినట్లుంది. ఓసారి ఇద్దరం భోంచేస్తున్నప్పుడు 'ఏమ్మా అలా వున్నావు. మీ ఇంటిమీద బెంగా' అన్నారు. అంత ఆప్యాయతకి తట్టుకోలేనట్టు నా గొంతులో దుఃఖం అడ్డుపడింది. కాదన్నట్టు చప్పున తల ఆడించాను. నా కళ్ళల్లో అప్పుడే నీరు తిరిగింది. 'ఏమిటమ్మా ఏం జరిగింది?' ఆరాటంగా అనుమానంగా చూస్తూ అడిగారు ఆవిడ. నేనేమి చెప్పలేక పోయాను. టొట టొట కన్నీరు కారింది. ఆవిడ చకితురాలై .... 'విజయా—ఏమయింది? ప్రకాష్....వాడేమన్నా అన్నాడా....వాడు సరిగా లేడా నీతో....'

అడగలేక అడిగినట్లు అడిగారు. అవునన్నట్టు తల ఆడించడం మినహా ఏం చెప్పలేకపోయాను. ఆమె అనుమానంగా చూస్తూ "ఏం అన్నాడు. ఏం చేశాడు?" 'నల్లబడ్డ మొహంతో అన్నారామె. "ఆయన త్రాగి నన్ను....నన్ను....అమానుషంగా" చెప్పలేక కళ్ళు తుడుచుకున్నాను. ఆవిడ తెల్లపోతూ- "వాడు తాగుతాడా" అన్నారు.

"ఒక్క తాగుడేకాదు. అన్నీ వున్నాయి....తాగి, రాక్షసుడిలా ప్రవర్తిస్తారు. ఎదురు తిరిగితే నన్ను కొడ్తారు. ఆయనిలాంటి వారని మాకు చెప్పకుండా దాచి ఈ వివాహం చెయ్యడం మీకు న్యాయమా? ఏనాడు దెబ్బ అంటే ఏమిటో ఎరగకుండా ముద్దుగా పెరిగాను. ఈనాడు నన్నిలా ఆయన...."ఏడుస్తూ అన్నాను ఉక్రోషంగా. ఆవిడ కలవరపడ్తూ 'నిజంగానా విజయా తాగుతున్నాడా, నిన్ను కొడ్తున్నాడా, అయ్యో పట్టుమని పదిరోజులేనా అవకుండా కొత్త పెళ్ళికూతుర్ని కొట్టడమా. వుండు....వాడిని అడుగుతాను' ఆవిడ ఆవేశంగా అన్నారు. "వాడిలా తాగుతాడనే మాకు తెలియదమ్మా.ఇంక ఇలా ప్రవర్తిస్తాడని మాకు మాత్రం ఎలా తెలుస్తుందమ్మా...." ఆవిడ దోషిలా సంజాయిషీ ఇస్తున్నట్టున్నారు.

"వారికీ పెళ్ళి ఇష్టంలేదా. ఇష్టంలేని పెళ్ళి ఎందుకు చేసుకున్నారు?" ఆవేశంగా అడిగాను.

"ఇష్టపడకపోతే ఎందుకు చేస్తామమ్మా మేము- అంత చిన్న పిల్లాడా మెడలువంచి చెయ్యడానికి. చాలా రోజులు పెళ్ళి చేసుకోను చేసుకోను అన్నాడు. ముందు సుశీల అనే అమ్మాయిని చేసుకుంటానన్నాడు. కాని ఆ అమ్మాయి ఎందుకో ఇష్టపడలేదు. తరువాత చాలా రోజులు పెళ్ళిమాట ఎత్తితే చేసుకోను అనేవాడు. ఆఖరికి నీ సంబంధం వచ్చాక వాళ్ళ నాన్నగారు గట్టిగా అడిగితే సరే అన్నాడు."ఆవిడ మాటలు వినగానే ఏదో క్లూ దొరికినట్లయింది. "ఎవరా అమ్మాయి? ఎందుకు చేసుకోనంది?" కుతూహలంగా అడిగాను. ఆయన ప్రవర్తనకి, స్త్రీలపట్ల ఆయనకున్న ద్వేషానికి ఏదో కారణం వుండచ్చన్న నా అనుమానానికి చిన్న ఆధారం దొరికినట్లు అన్పించింది. ఆ అమ్మాయి తిరస్కారం యీయనలో స్త్రీల మీద ప్రతీకార వాంఛగా

మారిందా?....

"ఆ అమ్మాయిదీవూరే. ఆస్టేలేనివాళ్ళు. అయితేనేం పిల్ల అపురూప సౌందర్యవతి. వీడికి కాలేజీలో జూనియర్‌ట. ఆ అమ్మాయిని ప్రేమించాడో ఏమిటో మేం వాడి చదువయ్యాక ఉద్యోగం దొరకగానే పెళ్ళి చేసుకోమంటే ఫలాన అమ్మాయిని చేసుకుంటాను అడగండి అన్నాడు. మగపిల్లవాళ్ళం మేం ఎలా అడగుతాం అనుకున్నాం. మధ్యవర్తి ద్వారా వాకబుచేశాం. కుటుంబం, సాంప్రదాయం మంచిదే- లేనింటిదయితేనేం మా కున్నది చాలదా అని వాడు యిష్టపడుతున్నాడని మధ్యవర్తి ద్వారా మేమే కబురు చేశాం—తల్లిదండ్రులు చాలా సంబరపడి ఇష్టపడ్డారు. కాని ఆ అమ్మాయి ససేమిరా చేసుకోనందిట.... మేం ఆశ్చర్యపడ్డాం—ఆ కబురువిని వాడు అదోలా అయ్యాడు. చాలా రోజులు ఏదోలా వున్నాడు. మరే సంబంధాలు చూపినా వద్దన్నాడు ఓ ఏడాది. తరువాత నీ సంబంధం వచ్చాక ఇష్టపడ్డాడు. ఇంతకంటె మాకేం తెలియదు విజయా. వాడిలా నీ పట్ల అమానుషంగా ప్రవర్తిస్తాడని మేం ఎలా కలగంటాం తల్లీ—వుండు అసలు వాడిని నాలుగూ అడుగుతాను. ఇష్టంలేకపోతే మానాలిగాని చేసుకుని ఇలా ప్రవర్తిస్తాడా. వాళ్ళ నాన్నగారితో కూడా చెప్తాను". అన్నారు ఆమె కోపంగా 'నీకేం లోటని ఈ వెధవ్వేషాలు వేస్తున్నాడు వాడు.' అంటూ ఆవిడ ఫోంచేసి చేయి కడుకుని మామగారి గదిలోకి వెళ్ళారు.

ఆ అమ్మాయి ఎవరో? ఎందుకు యీయన్ని తిరస్కరించిందో అని ఆలోచించాను. లేనింటిపిల్ల ఆస్థి, అందం చదువు అన్నీ వున్న వరుడ్ని తిరస్కరించిందంటే తగిన కారణం వుండే వుంటుంది. ఆ అమ్మాయి తిరస్కారంతో ఈయనగారి అహం దెబ్బతిని ఆ కోపం ఇలా తీర్చుకుంటున్నారు గాబోలు! అసలేం జరిగిందో తెలిస్తే బాగుండు అనుకున్నాను.

తల్లి తండ్రి గట్టిగా చివాట్లు పెట్టినట్లున్నారు. రాత్రి గదిలోకి వస్తూనే తీక్షణంగా నా వంక చూసి "అమ్మతో ఏం చెప్పావు?" అన్నారు కటువుగా. ఇంట్లో అంతా వున్నారన్నా భరోసాతో నిబ్బరంగా

"జరిగినవి, మీ అమానుషత్వం, రాక్షసత్వం" అన్నాను. దగ్గిరకివచ్చి చెయ్యి గట్టిగా నొక్కి— 'ఎందుకు చెప్పావు?' కర్కశంగా అన్నారు. 'విని, బుద్ధి చెప్తారని' అన్నాను కోపాన్ని అణుచుకుంటూ- ఆ చెయ్యి వదలకుండా మెలితిప్పుతూ 'నీ పొగరు తగ్గలేదన్నమాట—' అన్నారు క్రూరంగా చూస్తూ.

'మీ అహంకారం తగ్గేవరకు నా పొగరు తగ్గదు. ముందా చెయ్యి వదలండి. మీరింత అహంభావులనే సుశీల మీ ఆస్తి అంతస్తు లని తృణప్రాయంగా చూసి మిమ్మల్ని తిరస్కరించింది. మీకు పాఠం నేర్పింది. అయినా ఆడదంటే మీ చుల్కన భావం పోలేదు. ఆ కోపం యితరులమీద చూపి పగ సాధిస్తున్నట్టు పైశాచికానందం పొందే మీ రాక్షస ప్రకృతి తగ్గేవరకు నా పొగరు తగ్గదు. స్త్రీ అంటే ఏమిటో యిప్పటికయినా తెలుసుకోండి. ఆమెని గౌరవించని మగాడు జీవితంలో ఎప్పుడూ బాగుపడడు.' ఆవేశంగా అన్నాను. ఆయన మొహం తెల్లగా పాలిపోయింది. అప్రయత్నంగా నా చేయి వదిలి విస్మయంగా చూసారు నా వంక.

"హు-ఒకసారి మీ అహంకారంవల్ల సుశీలని జారవిడుచు కున్నారు. యింకా మీ అహం తగ్గకపోతే కట్టుకున్న భార్యనీ కోల్పో తారు అన్నది గుర్తించితే మీకు నాకు కూడా మంచిది." గంభీరంగా అన్నాను. ఆయన ఆ షాక్‌లోనించి తేరుకున్నారు. "నన్ను కాదన్నం దుకు సుశీలకి పాఠం నేర్పాను. నన్నీ బెదిరింపులు ఏమి చేయ్యలేవని గుర్తించు. నా మాట కాదన్న వారిని క్షమించే అలవాటు నాకు లేదు." కసిగా హేళనగా విషపు నవ్వు నవ్వారు తల పంకిస్తూ. యింట్లో అందరూ వున్నారనో మరెందుకో గాని అంతకంటె ముందుకు వెళ్ళ కుండా వదిలారు నన్ను.

'మర్నాడు నన్నక్కడ వదిలి ఆయన ఉద్యోగం ఊరు వెళ్లారు. వెళుతున్నట్లు నాకు చెప్పలేదు. నా సంగతి ఏమిటో చెప్పలేదు. ఆయన వెళ్ళాక 'ఎక్కడికి వెళ్ళారు ఆయన?' అడిగాను అత్తగారిని. ఆవిడ తెల్లబోయి 'నీతో చెప్పలేదా. శలవు లేదని వెళ్ళాడు. అక్కడ ఎవరినైనా వంటకి కుదిర్చి, బియ్యం, పప్పులు సామాన్లు కొని వారం

రోజులలో నిన్ను తీసికెడ్తానన్నాడు. అయినా నీతో చెప్పకపోవడం ఏమిటి? నిన్న ఆయన నేను బాగా చీవాట్లుపెట్టాం. 'ఆ అమ్మాయిని మర్యాదగా చూడకపోతే వాళ్ల యింటికి పంపేస్తాను' అని మీ మామ గారు కేకలేశారు. వాడు నీకు పొగరని, ఎదిరిస్తావని ఏదో చెప్ప బోయాడు. 'మొదటి రోజునించి ఏ ఆడపిల్లా పొగరుగా ప్రవర్తిం చదు. అలా ప్రవర్తించిందంటే అది నీ లోపం అన్నమాట' అన్నాను. ఇంకేం అనలేదు వాడు. ఆ కోపంతో నీతో చెప్పలేదు గాబోలు' ఆవిడ బాధపడ్తూ అన్నారు. సాధారణంగా అత్తమామలు కోడలిని సరిగా చూడకపోతే భర్త ఆసరా కోరుతుంది స్త్రీ. అలాంటిది నేను అత్తమామల ఆసరా కోరాను. వారి సహృదయతకి మనసులోనే అభినందించాను.

"నేనొకసారి అమ్మవాళ్ల యింటికి వెళ్ళి సామాన్లు తీసుకుని వస్తానండి" అన్నాను.

"వాడు నీ సామాన్లు అవే'పంపమని రాస్తానన్నాడు. రెండు మూడు రోజులలో వస్తానన్నాడు. నీవీలోపల వెడితే ఎలా.... అక్కడకి వెళ్ళాక వెడ్డువుగానిలే....లేదంటే కోపంవస్తుంది వాడికి." అన్నారావిడ. నా మొహంలో నిరాశ చూసి "చూడమ్మా విజయా! నీకు తల్లిలాంటిదాన్ని చెప్తున్నాను. వాడు కాస్త దుడుకువాడు. చిన్న ప్పటినించీ కోపం, పట్టుదల. తనదే పైచెయ్యిగా వుండాలనే పంతం వాడివి. పుట్టుకతో వచ్చిన గుణాలు ఒక పట్టానపోవు. తల్లిదండ్రులం గనక వాడి కోపం, పంతం సహిస్తాం. అలాగే పెళ్లయ్యాక భార్యా అవన్నీ చూసీచూడనట్టు సర్దుకోవాలమ్మా!"

"అత్తగారూ! సహించటం అంటే ఎంతవరకండి? ఎంత భార్య అయినా తిట్టి కొట్టి రాక్షసుడిలా ప్రవర్తిస్తే సహించగలదా!" ఆవేశంగా అన్నాను.

"చూడమ్మా! సహించక ఎదురుతిరిగేవో అనుకో. వాడి కోపం మరింత ఎక్కువవడం, ఇద్దరి మధ్య కలతలు మరింత ఎక్కు వయి ఇల్లు నరకం అవడం మినహా ప్రయోజనం ఏముంది? భార్యా భర్తలలో ఎవరు తగ్గారన్నది కాదు ముఖ్యం. సంసారం సాఫీగా

నడవడం."

"ఇవన్నీ పాత మాటలు. మొగుడు ఎలాంటివాడైనా, తిట్టినా కొట్టినా సహించి పడుండాలి అనే పతివ్రతల రోజులు కావు యివి. భార్య అంటే బానిస కాదు అని తెలియజెప్పే రోజులు. భార్యని తోటి మనిషిగా, తన ఇంట్లో సమాన స్థాయినిచ్చి చూడని భర్తని ఏ భార్యా క్షమించదు." తీవ్రంగా అన్నాను.

"క్షమించక ఏం చేస్తుందమ్మా! నీ వెర్రికాని ఎంత రోజులు మారినా, మన ఆడవాళ్ళ కథలు మారవమ్మా!" ఆవిడ అదోలా నవ్వి అన్నారు.

"ఆ కథల్ని మీ తరం స్త్రీలు మార్చలేకపోయారు. ఆ పని ఈ తరం స్త్రీ చేస్తుంది." నిబ్బరంగా అన్నాను. ఆవిడకి ముందు రోజు సంగతి బెంగుళూరులో నన్ను ఎలా బందీని చేసింది అన్నీ చెప్పి, "ఈ స్థితిలో నేనే కాదు ఏ ఆడదైతే మాత్రం సహిస్తుంది. ఈ రోజు యింకా యిక్కడ వున్నానంటే మీ మొహం చూసి. బెంగుళూరులో ఆయన భయంకొద్ది తప్పించుకునే మార్గంలేక పడి వున్నాను. లేదంటే ఆ రోజుతోనే ఆయనకి నాకు సరి అయ్యేది." ఆవేశంగా అన్నాను.

ఆమె కలవరపడ్డారు. "తొందరపడకమ్మా విజయా! భర్తని కాదన్న ఆడదానికి పుట్టింట కూడా స్థానం దొరకదు. నీవు ఉద్రేకపడి చెయ్యగలిగింది ఏమీ వుండదు."

"ఉద్రేకం, ఆవేశం నాలో యిప్పటికే సగం చచ్చాయి. మిగతా సగం పూర్తిగా చావకముందే నా ఆత్మాభిమానం కాపాడుకోవాలి. మా నాన్నగారికీ సంగతి తెలిస్తే తమ ముద్దుల ఏకైక గారాల పట్టికి పట్టిన గతి చూసి లోకాన్ని లెక్కచెయ్యరని నా నమ్మకం. పోనీ, పుట్టింట ఆదరణ లభించకపోతే ఏదో ఉద్యోగం చేసుకు బతకలేకపోను. ఏ బతుకయినా ఈ బతుక్కి తీసిపోదండి."

ఆవిడ తెల్లబోతూ, "నీవు చాలా దూరం ఆలోచిస్తున్నావు విజయా! అంత అవసరం వస్తుందనుకోను. వాడిని మేము చీవాట్లు పెట్టాం. వాడు మారుతాడు. నీవూ మరో అవకాశం వాడికి యియ్యా

లమ్మా! ఊ అంటే ఆ అంటే విడిపోవడానికి యిది విదేశం కాదమ్మా!" నచ్చచెప్పసాగారు.

"హుఁ—మారితే సంతోషమే. కాని నాకా నమ్మకం లేదు. ఆయన మారేలోగా నేను మిగిలివుంటానా?" శుష్కహాసం చేశాను. ఆవిడ జవాబు యివ్వలేనట్టు నిస్సహాయంగా చూశారు. "అత్త గారూ! ముందే చెపుతున్నాను. రేపు ఏనాడో నేను ఇల్లు వదలవలసి వస్తే నన్ను దూషించకండి. మీరు కన్నతల్లిగా నన్ను అభిమానంతో చూశారు గనక మీ మాట మన్నించి ఆయనకి ఒక అవకాశం యిస్తాను. ఆయన మారితే గతం మరిచి క్షమిస్తాను. లేదంటే లోకానికి భయపడి మాత్రం ఆ నరకంలో బతకను." నా నిశ్చయం తెలియజేశాను.

* * *

ఎంత తేలిగ్గా అంతా నా చేతిలో వున్నట్టే నిబ్బరంగా చెప్పాను ఆ రోజు.

"ఏం, ఏమయింది? ఆయన మారలేదా?" శారద ఆరాటంగా అడిగింది.

"ఆయన మారితే అసలీ కథే వుండేది కాదుగా!" విజయ నవ్వింది.

"అవునవును. తరువాత ఏం జరిగింది?"

"తరువాత ఓ పదిహేను రోజులు నేను అత్తవారింట్లోనే వున్నాను. మనిషి దొరకలేదని దొరగ్గానే వచ్చి తీసికెడతానని మామ గారికి ఆయన రాశారు. ఈలోగా మా యింటికి వెడదామంటే ఎప్పు డొస్తారోనని వెళ్ళనీయలేదు మా అత్తగారు. ఇంటికి ఉత్తరం రాద్దా మనుకున్నాను. ఆయన వ్యవహారం ఎలా వుంటుందో చూడకుండా ముందే ఈ సంగతులు రాసి వాళ్లని బాధపెట్టడం ఎందుకని కేవలం క్షేమం రాసి వూరుకున్నాను.

అక్కడుండగా ఓ రోజు ఆయన పెళ్ళికి మధ్యవర్తిత్వం వహించి సుశీలతో మాట్లాడడానికి వెళ్ళిన ఆయన వచ్చారు. మాటల్లో సుశీల ఈ వూర్లోనే వుంటుందని విన్నాక ఆమెని ఒకసారి కలుసు

కోవాలన్న కోరికని అదుపులో పెట్టుకోలేకపోయాను. అత్తగారు 'వద్దమ్మా! ఇంటిగుట్టు రచ్చకెక్కించినట్టవుతుంది' అన్నారు. నేనేమీ చెప్పనని కేవలం ఆమె ఈయన్ని తిరస్కరించిన కారణం తెలుసుకుంటానని ఆవిడని వప్పించాను.

సుశీల ఇంటికి వెళ్ళి నన్ను నేను పరిచయం చేసుకున్నాను. ఆమె చకితురాలై, నా రాకకి కారణం అర్థంకానట్టు తెల్లబోయి చూసింది.

"కూర్చోండి. చాలా సంతోషం. ప్రకాష్ పెళ్ళి చేసుకున్నాడన్నమాట. నాకు తెలియదు." అంది నవ్వుతూ.

ఆమెని చూశాక ప్రకాషే కాదు, ఏ మగవాడన్నా ఆమెని ప్రేమించకుండా వుండలేని అందం ఆమెది. అన్నీ కలిసిన అంతటి అపురూప సౌందర్యాన్ని చూసి చకితురాలినయ్యాను. ఆమె ముందు అందగత్తెగా పేరుపొందిన నేను వెలవెలబోయాను. అంతటి అందం ఆమెకి ఎక్కడనించి వచ్చిందో! పాలుగారే బుగ్గలు, విసనకర్రలా కనురెప్పలు, అంతంత కళ్లు, కొనదేరిన ముక్కు, చిన్న నోరు, అతి లేత తమలపాకులవంటి ఆ చేతులు....అబ్బ! ఏ భాగం చూసినా దేవుడు ప్రత్యేక శ్రద్ధ తీసుకొని చేసిన శిల్పంలా వుంది. ఆమె తండ్రి ఏదో ఆఫీసులో గుమాస్తాట. ఇల్లు నిరాడంబరంగా వుంది. ఇల్లే కాదు, ఆమె కూడా చాలా నిరాడంబరంగా వుంది! ఆమె అలంకరణలో ఏదో కొట్టొచ్చినట్లు లోపం కన్పించింది. ఆమె నుదుట బొట్టు లేదు!

"మీరిలా నన్ను వెతుక్కుంటూ రావడం చాలా ఆశ్చర్యంగా వుంది. నా గురించి మీకెలా తెలుసు? మీ రాకకి ఏదైనా ప్రత్యేక కారణం వుందా?" కాసేపటికి అడిగింది. అసలు సంగతి దాచి లాభం లేదని సూటిగా అడగదలచింది అడిగాను.

"మీరు ప్రకాష్‌ని నిరాకరించారని విన్నాక—సామాన్య కుటుంబంలోంచి వచ్చిన మీరు ఒక ధనికుణ్ణి, చదువు, సంపాదన వున్న వ్యక్తిని తిరస్కరించడానికి పురికొల్పిన కారణం తెలుసుకుందామని వచ్చాను."

సుశీల ఆశ్చర్యంగా చూసింది. "మీకెలా తెల్సింది? ప్రకాష్ చెప్పాడా?" ఆమె మొహంలో ప్రసన్నత మాయమయింది.

"ప్రకాష్ చెప్పలేదు. మా అత్తగారు మాటల్లో అన్నారు."

"జరిగిపోయిన సంగతులు ఇప్పుడెందుకులెండి. అవి తలుచుకోవాలని నాకు లేదు. చెప్పడం నాకు, వినడం మీకూ మంచిది కాదు." ముభావంగా అంది.

"ప్లీజ్. ఆ విషయంతో నా భవిష్యత్తు ముడిపడివుంది. దయచేసి ఏం జరిగిందో చెప్పండి."

సుశీల ఆశ్చర్యంగా చూసి, "అంటే....?" అంది.

"అంటే వివరంగా చెప్పలేను, కాని ఆయన ప్రవర్తనకీ— మీ తిరస్కారానికి సంబంధం వుండవచ్చని నా అనుమానం. భర్తని గురించి అంతకంటె చెడుగా చెప్పలేను....మీ తిరస్కారంతో ఆయన అహం దెబ్బతిని వుంటుంది. ఆ కోపం. కసి మీమీద తీర్చుకోలేక మరొకరిమీద తీర్చుకుంటున్నారు. అసలు మీరెందుకు ఆయనలాంటి వ్యక్తిని తిరస్కరించారు?" సుశీల మొహం కఠినంగా మారింది.

"ఆస్థి—అంతస్తుకంటె నా ఆత్మాభిమానం ముఖ్యమనిపించి తిరస్కరించాను. డబ్బు ఎర చూపించిన ఆ అహంభావిని నేనే కాదు. వ్యక్తిత్వం వున్న ఏ ఆడపిల్లైనా తిరస్కరిస్తుంది...." మొహం ఎర్రబడగా ఆవేశంగా అంది.

"అంతకంటె వివరంగా చెప్పగలరా?" అన్నాను.

"ఆ నీచుడి గురించి మాట్లాడాలంటేనే నాకు అసహ్యం. క్షమించండి. మీ భర్తనిలా అన్నందుకు కష్టపెట్టుకోకండి. కాని అతని నిజస్వరూపం తెలిస్తే మీరూ అసహ్యించుకుంటారు, కాలేజిలో నాకు బాగా సీనియర్. నా అందం నాకు శత్రువయింది. ప్రతి మగాడి దృష్టి నామీదే. రకరకాల పేర్లు, ఏడిపించడం, పిల్లికూతలు, గోడలమీద పేర్లు, అల్లరి. ఇవన్నీ నాకు తప్పేవిగావు. ఇలా నన్ను ఆటపట్టించే వాళ్ళందరికీ లీడర్ ప్రకాష్. అతని కుడిభుజం శ్యాం. డబ్బుంది అందం వుంది. ప్రతి ఆడపిల్లా తనంటే పడి చస్తుందనుకునేవాడు

ప్రకాష్. ఆడపిల్లల్ని చుల్కనగా చూసి ఏడిపించడం, ఏ అమ్మాయి యన్నా తిరగబడితే ఇక ఆ పిల్ల అవస్థ దేముడికెరుక. వెధవ ఫోజులు పెడుతూ తిరిగే ఆ ప్రకాష్‌ని చూస్తే నాకు వళ్ళు మండేది. దానికి తోడు అతని లేకి బుద్ధులు చూసి మరింత కోపం వచ్చేది. ఎన్ని అన్నా నన్ను కానట్టు విననట్టు దులుపుకుని పోయేదాన్ని. ఒక సారి జుత్తు కత్తిరించాడు వెనుకనించి. మరోసారి చీరలాగాడు— అతన్ని నేను కేర్ చేయడంలేదని, అతన్ని చూసి అసహ్యించు కుంటానని గమనించాడు గాబోలు ఓ రోజు అతని కుడిభుజం శ్యాంతో నాకు కబురు పంపాడు వంటరిగా వున్నప్పుడు.

"మీరంటే ప్రకాష్‌కి చాలా ప్రేమండి. మిమ్మల్ని పెళ్ళి చేసు కోవాలను కుంటున్నాడు...." అన్నాడు వెకిలిగా నవ్వి.

"ఆహా మిత్రుడి తరఫు రాయబారం వచ్చావా?" అన్నాను హేళనగా.

"లేదండి. మీరు అతని ప్రేమ గుర్తించటం లేదని చెప్తు తున్నాను."

"ఓహో....అంత ప్రేమ వున్నవాడు అతనే చెప్పొచ్చుగా ఆ మాట. ప్రేమిస్తున్నానని మరొకడిచేత కబురు పంపేంత రసహీను డన్నమాట."

"బాగుంది. అతని అంతస్థు....మీ అంతస్థు ఎక్కడ? అయినా ప్రేమకి యివన్నీ హద్దులుండకూడదని, అసలు మీ ఉద్దేశం ఏమిటో? ఆహా—అతనిలాంటివాడిని పెళ్ళాడడం ఏ అమ్మాయికైనా భాగ్యమే అనుకోండి. అయినా...."

ఆయనగారు కబురంపగానే, ఆయనలాంటి గొప్పవాడు పెళ్ళాడుతానని అనగానే సంతోషంతో మూర్ఛపోతాననుకుని—అతన్ని వెంటనే అంగీకరిస్తానన్న నమ్మకంతో శ్యాంతో కబురంపాడన్న మాట. నాలాంటి బీదదాన్ని తనంతట తను అడగటం నామోషి అను కున్నాడు గాబోలు—అతని అహంకారం తలుచుకోగానే వళ్ళు వుడి కింది. కోపంగా ఆవేశంగా కళ్ళెర్రజేసి "షటప్! మీ ఫ్రెండుగారికి లక్షలుండచ్చు. కాని ఆయనగారు కోరిందే తడవుగా అడిగిందే

భాగ్యం అని ఆనందపడిపోయి పెళ్ళాడేంత దౌర్భాగ్యురాలిని కానని మీ ఫ్రెండుకి చెప్పు. పెళ్ళి కాకపోవచ్చు. మీ ఫ్రెండులాంటి శ్రీమంతుడ్ని పొందకపోవచ్చు. కాని ఆడదాన్ని గౌరవంగా చూడని, మీ జులాయి ఫ్రెండుని, అలాంటి అహంభావిని మాత్రం నేను పెళ్లాడనని తెలియచెయ్యి. వెళ్ళు! మరోసారి యిలా వచ్చావంటే ప్రిన్సిపాల్‌కి చెవుతా" అని తిట్టి పంపాను.

మొహం మాడ్చుకుని వెళ్లాడు శ్యాం. ఆ మర్నాడు కాలేజిలో నేను మేడమెట్లు దిగి వస్తూంటే ప్రకాష్ మెట్లమధ్యలో అడ్డంగా నిలబడి నన్ను చూపి అదోలా నవ్వి చటుక్కున నా చేయి పట్టుకున్నాడు. ఆ సాహసానికి భయంకంటె ఆశ్చర్యం ఎక్కువవేసింది. తీక్షణంగా చూసి "వదులు" అన్నాను.

"వదలడానికి కాదు పట్టుకుంది. ఈ పాణిగ్రహం చెయ్యనిదే నాకు నిద్ర కూడా రాదు" అన్నాడు.

విసురుగా చెయ్యి లాక్కుని "అది ఈ జన్మలో చెయ్యలేవు" అన్నాను.

అతని మొహం నల్లబడింది.

"ఓహో! ఏం చూసుకుని ఆ పొగరు? అందగత్తెనని? నేను తలుచుకుంటే నిన్ను పెళ్ళి చేసుకోవడం పెద్ద విషయంగాదు. నాలాంటివాడిని పొందడమే వరం అనుకుంటూ పైకి బెట్టు చేస్తున్నావు కదూ?"

"ఛీ! నిన్నా. రోడ్డున పోయే ముష్టివాడినన్నా పెళ్ళాడుతానుగాని నిన్ను నా కంఠంలో ఊపిరి వుండగా పెళ్ళాడను" అన్నాను.

అతని కళ్ళు నిప్పులు చెరిగాయి. కర్కశంగా "అలాగా! ఎలా చేసుకోవో నేనూ చూస్తా" అన్నాడు దర్పంగా.

"బాగా చూడు. దారి వదులు. లేకపోతే ఈ విషయం చాలా దూరం వెడ్తుంది" అని విసురుగా తోసుకుని పైకి వెళ్ళాను.

ఆ మర్నాడు ప్రకాష్ చాలా ప్రేమ కురిపిస్తూ "నిన్న తొందర పడ్డానని నేనంటే చాలా యిష్టం అని. ఏదో అల్లరి చిల్లరగా ఏడిపించినప్పటికీ నా అందానికి ముగ్ధుడయి ప్రేమించి వివాహం చేసుకోవాలను

కుంటున్నానని అన్యథా తలచకుండా నా అభ్యర్ధన తీసేయవద్దని, నీవు లేకపోతే బతుకే లేను. పిచ్చివాడినయిపోతాను" అంటూ పదిపేజీల ప్రేమలేఖ రాశాడు. ఒక్కక్షణం నిజమా అనుకున్నాను. కాని అతని సంగతి రెండేళ్ళుగా చూస్తూ అంత సుళువుగా అతన్ని నమ్మలేక పోయాను. బెదిరించి నన్ను లొంగదీసుకోలేక ఈ దారిన నన్ను వప్పించి పెళ్ళి చేసుకుని నామీద కసి దీర్చుకోడానికి వేసిన ఎత్తు అన్పించింది. ఉత్తరం చించేశాను. కాలేజిలో అభ్యర్ధనగా, జాలిగా చూశాడు. మళ్ళీ శ్యాంతో కబురంపాడు—నా జవాబు మారదని ఖచ్చితంగా చెప్పాను.

అంతే—ఆ మర్నాటినుంచి నా పాట్లు భగవంతుని కెరుక! నా పేరు గోడలనిండా మరోడితో కలిసి వెలిగింది. పిల్లికూతలు, నవ్వులు, చప్పట్లు, కేకలు ఒకటేమిటి పిల్లలందరిని కూడేసి ఏడిపించాడు. రెండు రోజులు చూసి భరించలేక ప్రిన్సిపాల్‌కి రిపోర్టు యిచ్చాను. ఆయన చివాట్లుపెట్టారు.ఆ తరువాత కాలేజి మానేసి రోడ్డుమీద,మా ఇంటి ఎదురుగా గొడవ ఆరంభించారు. మా యింటి గోడలమీద పోస్టర్లు వెలిశాయి. అమ్మ నాన్న నిలదీయడం, తిట్టడం, ఇరుగు పొరుగు చెవులు కొరుక్కోడం, ఇంట్లోంచి కదిలి వెడితే నా వెనకాల ఎక్కడనించి ప్రత్యక్షమయ్యేవారో నలుగురు తయారు. పరిస్థితి భరించలేనిదిగా తయారైంది. అదృష్టవశాత్తు ఎలక్షన్స్ అయి కాలేజికి శలవులు యిచ్చారు. బతికాననుకొని యింట్లో కూర్చునేదానిని ఎక్కడికీ కదలకుండా. ఈ పుకార్లతో నా పెళ్ళి ఎక్కడ కాదోనని మావాళ్ళ భయం. ఆఖరికి పరీక్షలు అయింది అనగానే నా పెళ్ళి ప్రయత్నాలు ఆరంభించారు. ఆ సమయంలో ప్రకాష్ నాన్నగారు మధ్యవర్తిద్వారా నన్ను చేసుకుంటామని కబురంపారు. అమ్మ నాన్నల సంతోషానికి అవధులు లేవు. ఇది ప్రకాష్ ఎత్తేనని నాకు తెలుసు. అదృష్టవంతురాలి వని అందరూ పొగిడారు. ససేమిరా ఈ సంబంధం చేసుకోనన్న నన్ను అమ్మ, నాన్న తిట్టారు, భయపెట్టారు, నచ్చచెప్పారు. ఈ పెళ్ళిచేస్తే నా శవానికే చేస్తారని తేల్చి చెప్పేశాను.కారణం అడిగారు. ముందునించి ప్రకాశ్ సంగతి చెప్పాను. ఆ—ఏదో కుర్రతనం,

కొ_త్త బాగున్న ఆడపిల్లని ఏదో అంటారు. అంత మాత్రానికి యింత మంచి సంబంధం వదులుకోడం అవివేకం అని నచ్చచెప్పబోయారు. ప్రకాష్ తత్వం తెలిసీ—ఈ పెళ్ళి చేసుకోడం నా గొంతుకి నేను బిగించుకునేది మంగళసూత్రంకాదు ఉరిత్రాడని తెలిపి తిరస్కరించాను. అమ్మవాళ్ళు తిట్టి తిట్టి విరక్తితో వూరుకొన్నారు. విజయగారూ! ఆనాటి నా తిరస్కారం ప్రకాష్‌లో ఇంత పగ రేపుతుందని, ఇంతలా పగబట్టి క్రూరంగా కాటువేసి నా జీవితాన్ని సర్వనాశనం చేస్తాడనుకోలేదండీ.' సుశీల కళ్ళల్లో నీరు చిమ్మింది. ఆశ్చర్యంగా చూశాను. విజయగారూ!... మీ ప్రకాష్ మనిషి కాడండీ—మానవరూపంలో దానవుడు. నా పసుపుకుంకాల్ని తుడిచేశాడండీ!" భోరుమంది.

చకితురాలినయ్యాను. "అంటే....అంటే...." అడగలేక పోయాను.

"నాకు పెళ్లయింది విజయగారూ! నా భర్త శ్రీమంతుడు కాడు, అందగాడు కాడు, ఉన్నతోద్యోగి కాడు, నా మనసెరిగినవాడు, నన్ను మెచ్చినవాడు, సంస్కారం వున్నవాడూ. మా అంతస్థుకి తగినవాడ్ని చూసి చేశారు. ఆర్నెల్ల కాపురంలో మరిచిపోలేని అనుభూతులు చవిచూశాను.ఆలుమగల అన్యోన్యానికి ఆస్థి అంతస్థులు అవసరం లేదన్నది తెలుసుకుని నా అదృష్టాన్ని అభినందించుకున్నాను. నా ఆనందం, అదృష్టం ఆర్నెల్లలో తుడుచుకుపోయింది. ఆ ప్రకాష్....ఆ నీచుడు—నా కాపురంలో చిచ్చుపెట్టడానికి చేయదగింది అంతా చేశాడు. ఆకాశరామన్న ఉత్తరాలు రాశాడు. ఆయనతో ముందే ప్రకాష్ గురించి చెప్పాను. ఆయన ఆ విషయాన్ని చాలా తేలికగా తీసుకుని బుట్టదాఖలా చేశారు ఆ ఉత్తరాలు. ఆ ఎత్తు పారలేదు. పెళ్ళయ్యాక మొదటిసారి పండగకి వెళ్లాం యిద్దరం. వారం రోజులు సరదాగా గడపాలనుగున్నాం. పండగ ముచ్చట్లు అయ్యాయి. ఇద్దరం రోజూ ఊరి చివరికి వాహ్యాళికి వెళ్ళేవాళ్ళం. కనుచీకటివేళ—ఓరోజు—ఆ రోజు కాళరాత్రి నాకు. ఎవరో ముగ్గురు మనుష్యులు మామీద పడి నన్ను పట్టుకుని నోరు నొక్కి—నా కళ్ళ

ముందే యమదూతల్లాంటి యిద్దరూ ఆయన్ని కత్తితో పొడిచి పొడిచి చంపారు. రక్తం వరదలు అయింది. నా నుదుటి కుంకం తుడుచుకు పోయింది. వాళ్ళెవరో నాకు తెలియదు. కాని ఆ పని వాళ్ళెందుకు చేశారో నాకు తెలుసు. డబ్బులకి కక్కుర్తిపడి నిండు ప్రాణం తీశారు. ఆ వూర్లో ఆయనని తెల్సినవారే లేరు. అంత కసి కోపం ఎవరికీ వుండే ఆస్కారం లేదు. నామీద ప్రకాష్ కసి కోపం ఆయనని బలి తీసుకున్నాయి. ఆ నిజం నాకు తెలుసు. కాని ఎలా నిరూపించను? ఆ సమయంలో ప్రకాష్, అతని మిత్రబృందం అందరూ మనోహరి యింట్లో పార్టీలో మునిగి వున్నట్టు పకడ్బందీగా సాక్ష్యం సృష్టించు కున్నారు.

"ఎంత ఘోరం!" నాకు తెలియకుండానే నా నోట్లోంచి ఆ మాటలు వచ్చాయి.

"నన్ను కాదన్నందుకు సుశీలకి పాఠం నేర్పాను" అన్న ఆయన మాటలు నా మనస్సులో ప్రతిధ్వనించాయి. ఆయన మాటలకి అర్థం యిదా! వణికిపోయాను.

"హూ ఘోరం! మీకూ నాకూ ఘోరం: ఆ రాక్షసుడికి వినోదం! అంతటితోనైనా నన్ను వదిలాడా? ఆయన పోయాక జీవచ్ఛవంలా పడివున్న నా దగ్గిరకి ఒక రోజు కల్లబొల్లి దుఃఖం నటిస్తూ వచ్చాడు. నా బతుకిలా అయిపోయినందుకు తనెంతో బాధ పడ్తున్నానన్నాడు. నేనిలా మోడులా వుంటే సహించలేనన్నాడు. తిరిగి నా జీవితం పుష్పింపచేస్తానన్నాడు. తనని అపార్థం చేసుకో వద్దన్నాడు. తన ప్రేమ నిరూపించుకోవడానికి ఒక అవకాశం ఇయ్యమన్నాడు. ప్రకాష్ మాట్లాడింది అంతా విన్నాను ఓపిగ్గా. ఆ క్షణంలో అతనిమీద అసహ్యం, కోపం పట్టలేకపోయాను. ఆ నీచుడ్ని చూస్తుంటే నా వళ్ళు వుడికిపోయింది. చటుక్కున లేచి మొహంమీద తుఫ్‌మని ఉమ్మాను. 'నీకు నా జవాబు యిది. గెటౌట్. ఇంతకంటె ఇంకేం చేస్తావు నన్ను. మళ్ళీ యీ ప్రాంతాల కనిపిస్తే నిన్ను చంపందే వదలను. వెళ్ళు.' వెర్రిగా అరిచాను. నల్లబడ్డ మొహంతో పళ్ళు కొరికి క్రూరంగా చూసి వెళ్ళాడు. విజయగారూ! ఆ రోజుతో

నా జీవితంలోంచి తప్పుకున్నాడు ప్రకాష్. అంతకంటె నన్నేం చెయ్యాలో తెలియలేదు గాబోలు." శుష్కహాసం చేసి అంది సుశీల.

"మీ జీవితంలోంచి తప్పుకుని నా జీవితంలో ప్రవేశించాడు. మీ మీద ఎలా చూపాలో తెలియని కసి కట్టుకున్న భార్య కనక పడి వుంటుందని నామీద చూపుతున్నాడు." నాకు తెలియకుండానే అనేశాను. సుశీల ఆశ్చర్యంగా చూసింది. తరువాత సానుభూతిగా, "ఐయామ్ సారీ! అతని పాలపడడం మీ దురదృష్టం. అతనికి తను చాలా అందగాడినని, ఆస్తి వుందని, ఆడపిల్లలు తన వెంటపడాలని కోరిక. తనని తిరస్కరిస్తే అతని అహం దెబ్బతింటుంది. అతన్ని కాదంటే అతనిలో పశుత్వం మేల్కొంటుంది. అతనికి ఎదురు తిరిగితే రాక్షసుడే అవుతాడు. అసలు ఆ మనిషిలో ఏమన్నా మెంటల్‌గా లోపం వుందేమో అనిపిస్తుంది ఒక్కోసారి, విజయ గారూ!" అంది సుశీల.

ఆ మాటలో నిజం వుందనిపించింది నాకూ. "మీరు ...మీ రిప్పుడేం చేస్తున్నారు?" అన్నాను సానుభూతిగా.

సుశీల శుష్కహాసంచేసి "చేయడానికి ఏముంది? బతకాలిగా! ఏదో ఉద్యోగం చూసుకుని మోడులా బతుకీడుస్తున్నాను." అంది. వెళ్ళడానికి లేచాను.

"విజయగారూ! ఒక్క మాట. ఎలాగో పెళ్ళి అయింది. భర్తగా అతన్ని మీరు భరించాలి కనక—అతన్ని మంచిగా మార్చ గలరేమో ప్రయత్నించండి, అతన్ని రెచ్చగొట్టడంవల్ల మరింత రాక్షసుడవడం మినహా ప్రయోజనం వుండదు. ఒక స్నేహితురాలిగా యిది నా సలహా." అంది అభిమానంగా. ఏం మాట్లాడేందుకు లేక స్నేహంగా చెయ్యి నొక్కి వచ్చాను.

ఇంటికి వచ్చి అత్తగారితో అంతా చెప్పాను. ఆవిడ మొహం పాలిపోయింది. చెమట పట్టింది. "నిజం. నిజంగానా....వీడు అంత పని చేయించాడంటావా! నమ్మలేకుండా వున్నాను." గుండెలమీద భయంగా చేయి వేసుకున్నారు.

"హు....కన్నతల్లి కనక మీరు నమ్మలేరు. ఇంకా యిలాంటి

వారితో కాపురం చెయ్యమనే అంటారా? నన్ను కోడలిగాకాక కూతురిగా భావించి చెప్పండి."

ఆవిడ యిబ్బందిగా చూశారు. "అమ్మా, విజయా! నీవే అన్నావు. నేను కన్నతల్లిని. కొడుకు ఎలాంటివాడైనా తల్లి అభిమానించకుండా వుండలేదు. వాడి శ్రేయస్సు కోరుతూనే వుంటుంది. చిన్నప్పటినించీ వాడి స్వభావం వింతగానే వుండేది. ఒక్కడే కొడుకేమో! ఆడింది ఆటగా పెరగడంతో పంతం, మంకుతనం, గారాబం, కోపం అన్నీ వుండేవి. అంతేగాదు. తను చెప్పిన పని చేయని ఆయాని గిల్లేవాడు, కొరికేవాడు. నౌకరు ఏదన్నా తెమ్మన్నది తేకపోతే చేతిలోది మొహంమీద విసిరేవాడు. వాడు అడిగింది చేయం లేదంటే తిండి తినేవాడుకాదు. ఇంట్లో అన్నీ విరగగొట్టి పాడుచేసేవాడు. ఇంట్లో కుక్కపిల్లని తోకపట్టి పీకిపీకి అది కుయ్యోమంటే ఆనందించేవాడు. పిల్లి చెవులు ఎత్తిపట్టి కుదేసేవాడు. వీధిలో పిల్లలతో ఆడుతూ వాళ్ళని నానావిధాలా ఏడిపించేవాడు. ఆఖరికి పక్షి కనిపించినా రాయి విసిరేవాడు. చీమ కుట్టినా కసిగా కాలితో రాసేవాడు. ఇదంతా మా పెంపకం లోపమేమో! ముద్దుచేసి పాడుచేశాం అని బాధపడేవాళ్ళం. ఒక్కగానొక్కడ్ని ఏమీ అనలేక, అంటే వాడి హఠం భరించలేక వాడు అవునన్నది చేసేవాళ్ళం. అదంతా చిన్నతనం. సరే యిప్పుడు తను కావాలన్నది దొరకలేదని యింత అమానుషంగా ప్రవర్తించాడంటే యింక వాడ్ని గురించి ఏం అనుకోవాలో అర్థంగావడంలేదు. నేనేం చెప్పను. నా కొడుకుతో కాపురం చెయ్యొద్దని ఎలా చెప్పను? నీ యిష్టం తల్లీ!" అందావిడ బాధగా. ఆవిడ మనోవ్యధ అర్థం అయింది.

"చూడమ్మా! వాడి అదృష్టం ఎలా వుందో! కుదురుగా కాపురం చేసుకుంటాడో, వడ్డించిన విస్తరిని చింపి పోగులు పెట్టుకుంటాడో వాడి అదృష్టంమీద ఆధారపడివుంది. ఆ అదృష్టాన్ని పరీక్షించుకోడానికి వాడికి ఒక్క అవకాశం యియ్యమని తల్లిగా అడుగుతున్నాను. నాకు కూతుర్లు లేరు. కూతురైతే ఏం చెప్పేదాన్నో మరి. కాని కొడుకుని కని కన్నకడుపుతీపి తెలుసుకున్నాను.

ఇంత చెప్పినా వాడిమీద మమకారం చావడంలేదు. నాకోసం వాడికి ఒక్క అవకాశం యిచ్చి చూడగలవా విజయా! ఇది ఆజ్ఞ కాదమ్మా! అభ్యర్థన." అన్నారు ఆమె నా చేతులు పట్టుకుని. అంతటి సహృదయిని మాట ఎలా కాదనగలను? సరే అనక తప్పలేదు.

* * *

ఆ సరే అనడం ఎంత పొరపాటో తరువాత మూడు నెలల నరకయాతన తెలియచెప్పింది. ఆయన మారుతారని ఆశించడంలో నా తెలివితక్కువతనం తెల్సింది.

కాపురానికి వెళ్లాను. అక్కడ నాకోసం బంగారు పంజరం తయారుచేశారు. చక్కని ఇల్లు. అంతకంటె చక్కని ఫర్నిచర్. వంటకి, పనికి అన్నింటికి కలిపి ఒక మనిషి.

ఆ మనిషి వంటే కాకుండా, ఇంటి యజమానురాలికి కాపలాదారనీ, ఆ ఇంటికి ఘూర్ఖా అనీ, యజమాని నియమించిన గూఢచారినీ నాకు తెలియడానికి చాలా రోజులే పట్టింది. నేను మా ఇంటిక్కి రాసిన ఉత్తరాలు పోస్టుచెయ్యకుండా, నాకు వాళ్ళు రాసే ఉత్తరాలు తిన్నగా పోస్టాఫీసుకే వెళ్ళి మాయం చేస్తున్నాడనీ, నేనెవరితో మాట్లాడకుండా, కలవకుండా ఏర్పాటుచేసినవాడనీ అర్థం అవడానికి నెలరోజులు పట్టింది.

నేనిక్కడకి రాగానే మా ఇంటికి ఉత్తరం రాసినా వాళ్లెందుకు జవాబు రాయలేదో, కొత్త కాపురం సరిదిద్దడానికి వస్తానన్న అమ్మ ఎందుకు రాలేదో, ఏ సంగతీ తెలియక ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబురాయని వాళ్ళమీద కోపం తెచ్చుకున్నాను. పెళ్ళిచేసి పంపి మరిచిపోయారని కోపం వచ్చింది.

ఆయనకి రోజంతా ఆఫీసు పని. సాయంత్రం ఇంటికొచ్చాక తాగి వళ్లు తెలియకుండా రాత్రంతా పడుకోడం దినచర్య. ఆయనేం చేసినా అదేమని అడిగే హక్కు నాకు లేదు. "ఏమిటిలా తాగడంలో మీ ఉద్దేశం? మీకో భార్య, ఆ భార్యకో మనసు వుంటుందని గుర్తుందా?" అంటే హేళనగా, నిర్లక్ష్యంగా నవ్వేవారు. గట్టిగా అడిగితే 'నోర్ముయ్!' అనేవారు.

"నోరు మూసుకుని పడివుండడానికి నేనేం బొమ్మని కాను. ప్రాణం వున్న మనిషిని. ఏ సరదా, ఏ ముచ్చటా లేకుండా మీరు పడేసే తిండి తింటూ పడివుండడానికి మిమ్మల్ని పెళ్లాడలేదు." అన్నాను కోపంగా ఒక రోజు.

"సరదా నీకు లేదు....కమాన్ తాగుదాం, డాన్స్ చేద్దాం.... ఇంకా ఆ తరువాత ఎంజాయ్ చేద్దాం....కమాన్!" అన్నారు.

"ఛీ! మీతో మాటలేమిటి?" అసహ్యించుకున్నాను.

"మీరేదో మారుతారన్న భ్రమతో మీ అమ్మగారి మాట కాదన లేక వచ్చాను. నన్ని ఇంట్లో వుండమనా, వెళ్లమనా మీ ఉద్దేశం?" తీవ్రంగా అన్నాను.

"అది నీ యిష్టం." నిర్లక్ష్యంగా అన్నారు.

"సరే. రేపే నాన్నగారికి టెలిగ్రాం యిచ్చి రమ్మంటాను. ఆయనే నిర్ణయిస్తారు ఏం చెయ్యాల్సింది." ఆ మాట విని నిర్లక్ష్యంగా నవ్వారు.

మర్నాడు పనివాడితో టెలిగ్రాం పంపాను. మూడు రోజు లయినా నాన్నగారు రాలేదు. ఆశ్చర్యపడ్డాను. అర్జంటని టెలిగ్రాం యిచ్చినా ఆయన రాకపోవడంతో ఏమీ అర్థంకాక తికమకపడ్డాను. అపురూపంగా పెంచి పెళ్ళిచేసి యింతలా ఒక్కసారిగా నా ఖర్మానికి నన్ను వదిలేసినట్టు ఎలా వూరుకున్నారన్న అనుమానం వచ్చింది. ఏడుపు వచ్చింది. నాన్న రాలేదు సరే, నేనే వెళ్లాలని నిశ్చయించుకుని ఆయనతో చెపితే ఎలాగో వప్పుకోరని ఆయన ఆఫీసుకి వెళ్లాక గప్‌చిప్‌గా సూట్‌కేసు చేతపట్టుకుని టాక్సీ తెమ్మన్నాను పనివాడిని.

"ఎక్కడికెడుతున్నారమ్మా?" అన్నాడు వాడు.

మామూలుగా అడుగుతున్నాడనుకుని "మా పుట్టింటికి వెడు తున్నాను. నాలుగు రోజులలో వస్తాను. ఆయన వస్తే చెప్పు." అన్నాను.

"అయ్యగారితో చెప్పకుండా ఎలా వెడతారు?" అన్నాడు అదోలా చూసి.

నేనంత పట్టించుకోకుండా "ఫరవాలేదు, నీవు చెప్పులే."

"కాదమ్మగారూ! అయ్యగారికి చెప్పకుండా మీరు వెళ్ళ వీలు లేదు." అన్నాడు.

తెల్లబోతూ చూశాను. "ఏమిటీ?" అన్నాను ఇంకా నమ్మలేక.

"అయ్యగారితో చెప్పకుండా మీరు వెడితే అయ్యగారు నన్ను తిడ్తారు. అంచేత వెళ్ళడానికి వీలులేదు." ఖచ్చితంగా అన్నాడు.

వాడి ధైర్యానికి విస్తుపోతూ కోపంగా "మధ్య నీవెవడివి చెప్పడానికి? ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? ముందెళ్ళి టాక్సీ తీసుకురా." తీక్షణంగా అన్నాను.

వాడు ఆ కోపానికి జడవలేదు. పైపెచ్చు యింకా ధాటీగా "నేను వెళ్ళను. మిమ్మల్ని వెళ్ళనివ్వను." అన్నాడు.

వాణ్ని ఏం చెయ్యాలో తెలియనంత కోపం వచ్చింది. వాడి సరస చూస్తే లాభం లేదనిపించి "సరే, నేనే వెళ్ళి ఎక్కుతాను." అన్నాను. విసురుగా పైకి వెళ్లబోయాను. వాడు గుమ్మానికి అడ్డంగా చెయ్యిపట్టి "అమ్మగారూ! అనవసరంగా గొడవపడకండి. లోపలికి వెళ్ళండి. మీరు వెళ్ళడానికి లేదు. అంతగా వెళ్లాలంటే అయ్యగారు వచ్చాక వెళ్లండి. అయ్యగారు వచ్చేవరకు గుమ్మం దాటనివ్వను." అంటూ అడ్డంగా నిలబడ్డాడు.

"నీకెంత ధైర్యం! నౌకరు వెధవ్వి. ఇంటి యజమానురాలితో యిలా మాట్లాడతావా? ఆయన రానీ నీ పని చెప్తా." కోపంతో వణికిపోతూ అరిచాను. వాడు నా కోపానికి బెదరలేదు. "అడ్డం లేస్తావా, నలుగురినీ కేకలు వేయమంటావా?" వాడు నా మాట విన నట్టు కదలలేదు. కోపం పట్టలేక విసురుగా వాడి చెయ్యి తోసి "జాగ్రత్తగా మసులుకో, నీ కింత పొగరా?" అన్నాను బయటికి వెళ్ళబోతూ. వాడు నా చేయిపట్టి నన్ను లోపలికి తోసి తలుపులు మూశాడు. నిర్ఘాంతపోయాను. "అమ్మగారూ! అనవసరంగా అల్లరి చెయ్యకండి. మీరిక్కడనించి వెళ్లలేరు. మిమ్మల్ని కాపలా కాయడం నా పని. మీరు వెళ్లారంటే నన్ను చంపుతారు అయ్యగారు. నా ఉద్యోగం పోతుంది. అయ్యగారొచ్చేవరకు లోపలే వుండండి." అంటూ పైన గడియవేసి తాళంపెట్టాడు. చకితురాలినై పోయాను.

నాకు కాపలా పెట్టారా వీడిని! వీడు కాపలా కాస్తున్నాడా? ఆశ్చర్యం నుంచి తేరుకున్నాక ఒక్కొక్క సంగతీ అర్థమయినట్లయింది. నా ఉత్తరాలు అసలు మావాళ్ళకి అందకుండా చేసివుంటాడు. వాళ్ళ ఉత్తరాలు నాకందకుండా ముందే మాయం చేశాడన్నమాట. ఎంత ఘోరం! కట్టుకున్న భార్యని కాపలా కాయడానికి నౌకరుని పెట్టు తాదా? వళ్లు మరిచిపోయాను కోపంతో. ఆవేశంతో వణికిపోయాను. ఎన్నాళ్ళు నన్నిలా బంధిఖానాలో పెడ్తారు? ఎలా యిక్కడనుంచి వెళ్ళడం? కోపంతో బుసలుకొడ్తూ కూర్చున్నాను. వీడు ఫోను చేశాడో ఏమిటో ఆయన ఆఫీసునుంచి వెంటనే వచ్చారు. తలుపు తీయగానే కలపడ్డాను. "ఏమిటి మీ ఉద్దేశం? నన్నిలా బందీచేసి పైగా నౌకరువాడిని కాపలా పెట్టడంలో మీ ఉద్దేశం ఏమిటి?" తీక్షణంగా అడిగాను. ఆయన విలాసంగా ఓ నవ్వు నవ్వారు.

"అర్థం వెరీ సింపిల్ మై డియర్! కొత్తగా తెచ్చుకున్న పెంపుడుకుక్క కాస్త మచ్చిక అయ్యేవరకు కట్టిపడేయకపోతే ఇటు అటు పారిపోతుంది. పోట్లగేదెని స్వేచ్ఛగా వదిలితే మరి యిల్లు చేరదు. ఎవరి వస్తువు వాళ్లు జాగ్రత్తగా వుంచుకోవాలనుకోడంలో తప్పు వుందా? అంత కష్టపడి పెళ్లాడి తెచ్చుకున్న పెళ్లాం పోతానని బెదిరిస్తూంటే చూస్తూ పోనిచ్చే వెర్రివెధవలుంటారా?" చాలా వినో దంగా అన్నారు. ఇలాంటి మనిషిని ఎవరేం చెయ్యగలరు? ఎగిసి పడుతున్న గుండెలతో "ఎన్నాళ్ళిలా నన్ను కట్టడి చేయగలరను కుంటున్నారు?" అడిగాను.

"చెప్పాగా! కుక్క మచ్చిక అయి మాలిమి అయ్యేక పొమ్మన్నా పోదుకదా, తంతున్నా కాళ్ళదగ్గిరే పడివుంటుంది. పోట్ల గేదెని నాలుగు రోజులు నడ్డి విరిగేలా తంతే పొగరు అణిగి పడి వుంటుంది. అలాగే నీవూ. ఇది నీ ఇల్లు, ఇంకెక్కడికీ పోలేను అని గుర్తించేవరకు—నన్ను కాదని పోలేవు అని గుర్తించాక అప్పుడు బంధిఖానా వుండదు నీకు. ఎంతయినా మగాడ్ని. పెళ్లాం వదిలి వెళ్ళి పోయిందనే అపవాదు భరించగలనా డియర్!" హేళనగా నవ్వారు.

తిట్టాను, ఏడిచాను. ఏం చేసినా ఆ రాయి కరగలేదు.

ఆయన అన్నట్టు - ఆయనను వదిలిపోకుండా నీవే గతి అని పడివుండాల్సిన స్థితి, ఆయనను కాదనలేని స్థితి వచ్చి మీద పడింది. నా అవస్థలు చాలనట్టు, నామీద ఇంకా కక్ష తీరక భగవంతుడు శాపం యిచ్చినట్టు మొదటినెలకే నెల తప్పాను. ఆ సంగతి గుర్తించగానే వళ్లు జలదరించింది. ఇదేం ప్రారబ్ధం అని కుమిలిపోయాను. ఇంక పుట్టబోయే పిల్లకోసమన్నా యీ భర్తని అంగీకరించడం మినహా దారి ఏముంది? తండ్రి ఎవరో తెలియని బిడ్డని సమాజం ఆదరించదు. ఆ బిడ్డకోసం, ఆ బిడ్డ భవిష్యత్తుకోసం నా భవిష్యత్తు అంధకారం చేసుకుని ఈ నరకంలో మగ్గవలసిందేనా? 'భగవంతుడా! నాకీ బిడ్డ వద్దు తీసుకుపో' అని ప్రార్థించాను. విలపించాను. ఆ దేవుడు నా మొర ఆలకించలేదు.

ఆయనకా విషయం చెప్పాలనిపించలేదు. అయినా ఎన్నాళ్లు దాచగలను. వికారం వాంతులు ప్రారంభమయ్యాయి. ఆయనకీ విషయం అర్థం అయ్యాక "గుడ్. నీవు దారికి వచ్చే రోజులు మొదలయ్యాయి అన్నమాట. ఇంకెక్కడికి పోతావు?" అన్నారు విలాసంగా.

ఆ మనిషితో మాట్లాడాలంటేనే అసహ్యం పుట్టింది. మాట్లాడినా ప్రయోజనం లేదని తెలిశాక నా ఖర్మానికి తిట్టుకుంటూ ఏడ్చుకుంటూ యింట్లో పడివున్నాను. ఆయనతో పోట్లాడే ఓపికకూడ లేని నీరసం - వేవిళ్ళతో సతమత మవుతూంటే అమ్మ గుర్తువచ్చి కుమిలి కుమిలి ఏడిచేదాన్ని. పుట్టాక యిన్నాళ్ళు చూడకుండా వుండలేదు. మూడు నెలలే అయినా మూడు యుగాలు గడిచినట్లనిపించింది. ఏడుస్తున్నా, తిండితినకుండా నీరసంతో వాలిపోయినా ఆయనేం పట్టించుకోలేదు. ఆయన అవసరాలు చూడడానికి వాడున్నాడు. నాతో రాత్రి తప్ప ఆయనకేం అవసరం లేదు. అలాంటి స్థితిలో నా ఖర్మానికి నేను పక్కమీద పడివుండేదాన్ని. ఈ గర్భం ఎలా తీసుకోనా అని ఎన్ని విధాలో ఆలోచించాను. ఏ మందు మింగను. ఎలా తెచ్చుకోగలను. అని విచారించాను. గెంతాను-దుమికాను-వేడిచేసే పదార్థాలు గుర్తున్నంతవరకు తిన్నాను. ఊహ - ఆ తండ్రిని మించిన మొండిదిలా

వుంది ఆ పిండం. హతాశురాలినై-కర్తవ్యం తోచక నిర్లిప్తురాలినై వుండిపోయాను. చావాలన్నా అనుక్షణం కాపలా!

నా బాధ చూడలేక, నా గోడు వినలేక ఆ దేవుడు జాలి తలచి నట్లు ఒక రోజు హఠాత్తుగా నాన్నగారు వచ్చారు. ఆ సమయానికి ఆయన లేరు యింట్లో. నేను బాత్‌రూములో వున్నాను. బాత్‌రూము లోంచి వచ్చి బట్టలు కట్టుకుంటూ యధాలాపంగా గేటువైపు చూశాను. పనివాడిని నాన్నగారు ఏదో అడుగుతున్నారు. వాడేం చెప్పాడో హతాశులైనట్లు వెనుదిరిగారు.

ఆయన్ని చూడగానే 'డాడీ' అని ఒక్క గాఢ కేకపెట్టి వీధి లోకి పరిగెత్తాను. నా కేకవిని ఆయన ఆశ్చర్యంగా వెనుదిరిగి నిర్ఘాంత పోయి పనివాడివంక చూశారు.

'డాడీ.' అంటూ ఒక్క ఉదుటున ఆయన గుండెలమీద వాలి పోయి తెలివి తప్పిపోయాను ఆయన చేతుల్లో. మళ్ళీ తెలివి వచ్చే సరికి సోఫాలో వున్నాను.

నాన్నగారు ఆదుర్దాగా ఆందోళనగా. 'అమ్మా విజయా. ఏమిటి తల్లీ యిలా అయిపోయావు. ఏం జరిగిందమ్మా' అంటూ ఆరాటంగా అడుగుతున్నారు గుడ్ల నీరు కక్కుకుంటూ.

వదిలితే మళ్ళీ కనపడరన్నట్టు చిన్నపిల్లలా ఆయన మెడ పెన వైచుకున్నాను. 'డాడీ. నన్నీ నరకంనుంచి తీసికెళ్ళు డాడీ. యిది నరకం డాడీ. ఆయన రాక్షసుడు డాడీ.' వెక్కి వెక్కి ఏడుస్తూ అన్నాను.

"ఏమిటమ్మా ఏం జరిగింది. నీవింట్లో వుండగానే లేవు మీ యిద్దరూ ఎక్కడికో వూరికెళ్ళారని చెప్పాడు పనివాడు. నీనుంచి మూడు నెలలై ఉత్తరాలు లేవు. ఎన్ని వుత్తరాలు రాశాం తల్లీ. ఎంత కొత్త కాపురం అయినా కన్న తల్లి తండ్రుల్ని మరిచిపోతావా తల్లీ. ఎన్ని ఉత్తరాలకీ జవాబులేక మామగారికి రాస్తే నీవు యిక్కడికి వచ్చావని రాసేరు. ఇంక ఉత్తరాలతో లాభంలేదని బయలుదేరి వచ్చాను. మీ అమ్మ నీకోసం కలవరిస్తూంది. ఏమిటమ్మా. ఏం జరిగిందో చెప్పమ్మా' గద్గదికంగా అన్నారు.

'డాడీ. ఎన్ని ఉత్తరాలో రాశాను నన్నీ నరకంలోంచి తీసి కెళ్ళమని. ఉత్తరాలన్నీ నీకందకుండా చేశారు. నాకు కాపలా పెట్టి నన్ను బందీని చేశారు. నేనింక యిక్కడ వక్క క్షణం వుండను. నన్ను మన యింటికి తీసికెళ్లు డాడీ" ఏడుస్తూనే ముందునించి జరిగిందంతా టూకీగా చెప్పాను.

నాన్నగారు నోట మాట రానట్టు స్థాణులై పోయారు. ఆ తరువాత కోపం, ఉద్రేకం పట్టలేకపోయారు.

'దౌర్భాగ్యుడు. బంగారులాంటి పిల్లనిస్తే యిలా కాల్చుకు తిన్నాడా. వాడు మనిషా పశువా. పద నిన్ను యింక యిక్కడ వుంచను' అంటూ ఆవేశపడిపోయారు.

ఆయన రాగానే చెడామడా తిట్టారు. 'పిల్లని తీసికెళుతున్నాను నీ దిక్కున్న చోట చెప్పుకో. దౌర్భాగ్యుడా యింకేవరిమీదో కసి కోపం నా కూతురిమీద చూపి కాల్చుకుతింటావురా. పూవుల్లో పెట్టి పెంచి నీకప్పగించానురా. దాని బతుకు యిలా నాశనం చేస్తావా' అంటూ నిప్పులు కురిపించారు. నువ్వేమిటో నీ బతుకేమిటో నలుగురిలో పెట్టి మొహం యీడుస్తానన్నారు.

ఆయన మొహం ఎర్రబడగా—'నాకేం నష్టం లేదు, పోయేది మీ పరువే.' అన్నారు బింకంగా.

'హు - నా కూతురుకంటె నాకు పరువు ప్రతిష్ఠ హెచ్చు కాదురా. నిన్ను కోర్టుకీడ్పిస్తాను. నా కూతురిని యింక పంపనే పంపను. పెళ్ళే కాలేదనుకుంటాం.' ఆవేశంతో నాన్నగారి వళ్ళంతా చెమట పట్టింది.

'పదమ్మా విజయా. నిన్నింక వక్క క్షణం యిక్కడ వుండనీయను. నీ బట్టలు సర్దుకో' అన్నారు.

'విజయ నా భార్య. నా అనుమతి లేనిదే ఆమె నిక్కడనించి తీసికెళ్ళడానికిలేదు. తీసికెడితే కేసుపెడతాను. పోలీసులని పిలుస్తాను.' అన్నారు బింకంగా.

'పిలవరా పిలు. ఏ పోలీసులు నన్నాపలేరు. కట్టుకున్న భార్యని నానా హింసలు పెడుతున్నావని నేనూ చెప్పగలనురా. నా ఆఖరి పైసా

ఖర్చయ్యే వరకు కోర్టులో న్యాయంకోసం పోరాడుతాను. అంతేగాని నీ చేతిలో దాన్ని యింకా వదలను.

'సరే - నీ కూతురి బిడ్డకి తండ్రి అక్కర లేదనుకుంటే అలాగే తీసికెళ్ళండి. నా బిడ్డని నాకు అప్పగించండి కాన్పు అయిన వెంటనే.' ఆఖరి అస్త్రం వదిలారు.

ఇది నాన్నగారికి తెలియని విషయం. ఆయన ఒక్క క్షణం తికమకపడిపోయారు. ఆ వెంటనే నిగ్రహించుకున్నారు.

'హు. యీ వంకతో జయిద్దా మనుకున్నావా. నీ బిడ్డని నీ మొహాన పారేస్తాను. నా కూతురు పిచ్చిదయినా సరే, నీ బిడ్డని నీకప్ప గిస్తాను. యింక నోరెత్తకు.' కటువుగా అన్నారు.

అన్నట్లుగానే ఆ క్షణాన నన్ను తీసికెళ్ళిపోయారు నాన్నగారు. నా కథ తెలుసుకుని, నా శవాకరం చూసి అమ్మ, ఒకచే ఏడ్పు. అన్న య్యలు కంట తడిబెట్టారు. అందరూ కలిసి ఏమయినా సరే నేను మళ్ళీ ఆయనతో కాపురం చెయ్యడం కల్ల అని తేల్చారు.

మా నాన్న మామగారి దగ్గరకి వెళ్ళి జరిగిన సంగతంతా చెప్పారు.

వాళ్ళు విచారించి 'ఆ దౌర్భాగ్యుడు మా కడుపున చెడపుట్టాడు. వాడి ఖర్మ అలా వుంది. మీరేం చేస్తారు. ఆ రాక్షసుడికి మీ పిల్లని అప్పగించమని మేము మాత్రం ఎలా చెప్తాం' అంటూ బాధపడ్డారు.

అక్కడితో నా ఆ వివాహం అధ్యాయం ముగిసింది." శారదా, నీ కన్న తల్లి తండ్రులు సంఘ భయంతో చెయ్యలేని పని నా తల్లి తండ్రులు చేశారు. నీ తల్లి తండ్రులకి లేని అర్థబలం మా నాన్నగారిక్కి వుంది. నన్ను ఆదుకోడానికి లోకాన్ని లెక్కచెయ్యలేదు వారు. కన్న కూతురికంటె పరువుప్రతిష్ఠలు ఎక్కువకాదని తృణప్రాయంగా వదులు కున్నారు. నా కారణంగా నా తోబుట్టువుల భవిష్యత్తు పాడవడానికి ఆడ పిల్లలు యింక లేరు కనక, నిశ్చింతంగా ఊపిరి పీల్చుకున్నారు. ఇరుగు పొరుగు ఎన్నాళ్ళు చెప్పుకుంటారు? చెప్పుకోనిమ్మనుకున్నాం. అడిగిన వాళ్ళకి 'ఒక ఆడపిల్ల సంసారం వదులుకుని పూరికే రాదమ్మా—ఆ కాపురం ఎంతో నరకం అయితేతప్ప ఏ ఆడదీ యిల్లు వదలదు' అని

చెప్పింది అడిగినవారికి. 'అల్లారుముద్దుగా పెంచి ఏభై వేలు ఖర్చుపెట్టి పెళ్ళి చేసి పంపడం ఆడపిల్లని యింట్లో పెట్టుకోడానికి కాదు. మీకూ ఆడపిల్లలున్నారు గాబోలు, అని అమ్మ యిద్దరు ముగ్గురితో అనగానే ఎదుటపడి ఎవరూ అడగలేదు ఆ తరువాత.

తొమ్మిది నెలలు నిండి పాప పుట్టింది. నాన్నగారు అన్నట్టుగానే పుట్టిన పాపని నన్ను మొహమేనా చూడనివ్వలేదు. 'వద్దమ్మా- చూసి అనుబంధం పెంచుకుంటే మరింత బాధపడాలి. యీ బిడ్డ నీది కాదు. నీ అదృష్టం బాగుండి అతను మనసు మార్చుకుని బిడ్డనియిస్తే అదృష్టమే. అంతవరకు ఈ బిడ్డమీద మమకారం వద్దమ్మా. యీ బిడ్డ పుట్టలేదనుకో. చచ్చిపోయిందనుకో.' అంటూ తీసికెళ్ళిపోయాడు.

మర్నాడు వట్టి చేతులతో తిరిగి వచ్చిన నాన్నగారిని చూసి నా మాతృ హృదయం తల్లడిల్లింది. 'పాపని యివ్వలేదా నాన్నా.' కన్నీరు తిరిగింది కళ్ళల్లో.

'లేదమ్మా. వాడిలో ఏమూలో మానవత్వం వుండదా అన్న ఆశ మిగిలి వుండేది ఇన్నాళ్ళూ. లేదమ్మా వాడు మనిషి కాదు తల్లీ. రాక్షసుడు. యింక ఆ బిడ్డ నీది కాదమ్మా. గుండె రాయిచేసుకో.'

అందరం బిడ్డ చచ్చిపోయినట్టు దుఃఖించాం. ఎంత నరకమైనా బిడ్డకోసం స్త్రీ భర్తని ఎందుకు భరిస్తుందో అర్థమైంది నాకు. కంటితో కూడా చూడని పాపపైన ఎందుకింత మమకారం! భగవంతుడు స్త్రీని ఎందుకింత దుర్బలురాలిగా చిత్రించాడో! ఆయనపై అంత అసహ్యం కలి వున్నా ఆ రక్తం పంచుకు పుట్టిన బిడ్డపై ఎంత మమకారం!

నాలుగో రోజు మా అత్తగారు వచ్చారు. ఆవిడ చేతిలో పాపని చూసిన నాకు పోయిన ప్రాణం వచ్చినట్లయింది.

'ఏ జన్మలో చేసిన పాపమో అలాంటి కొడుకుని కన్నాం. యిప్పుడీ పసిగుడ్డుని తల్లినించి వేరుచేసిన పాపం మాకు వద్దమ్మా విజయా ఇదిగో నీ బిడ్డ.' అంటూ వడిలో పడుకోబెట్టారు.

గుండెలకి హత్తుకున్నాను. ఆయన పంతానికి పిల్లని అడిగారు కాని పెంచగలరా.

తల్లికి తీసికెళ్ళి అప్పగించారుట. యిద్దరూ కొడుకుని తల

వాచేట్లు చీవాట్లు పెట్టి ఈ పసిబిడ్డ జోలికిగాని విజయ జోలికిగాని వెళ్లా వంటే నీవు మాకు కొడుకువి కాదనుకుంటాం అండూ తెగేసి చెప్పారట.

ఆవిడ వెంటనే బిడ్డను తీసుకొచ్చారు. వారి సహృదయతకి కళ్లు చెమర్చాయి.

"అన్నగారూ వాడు నా కొడుకేగాని - వాడిని నమ్మలేం. మీరు కోర్టువ్వారా మీ అమ్మాయికి వాడికి సంబంధంలేదని విడాకులు పుచ్చుకోండి. తండ్రి తిన్నటివాడు కాదని బిడ్డని తల్లికే అప్పగించాలనికూడా కోరుకోండి. మేము వున్నాం మీ తరపున, ఆయన చెప్పమన్నారు. అమ్మా-విజయా....ఇదో పీడకల అనుకుని-నీవు మళ్ళీ కొత్తజీవితం ఆరంభించు. నీ జీవితం మళ్ళీ చిగురించాలి. యిది నా కోరిక తల్లీ. ఆ రోజు వస్తే నాకంటె సంతోషించేవారు వుండరుతల్లీ. ఆ శుభదినం వస్తే నాకు కబురుపెట్టు తల్లీ." అంటూ కొంగు నోట్లో దోపుకుని ఏడిచారు ఆమె.

కరిగిపోయాను. ఆవిడ సహృదయతకి కన్నీటితో ఆవిడ పాదాలని అభిషేకించాను...."

"అబ్బ. అందరికి అలాంటి అత్తగారు వుంటే, అత్తా కొడళ్ళ కథలు రాకపోయేవి గదా" శారద నిట్టూర్చి అంది. "తర్వాత...."

"తరువాత....నాన్నగారూ అదే అన్నారు."

'అమ్మా. యీ ఏడాది నీ జీవితంలో లేదనుకుని. యిదో పీడకల అనుకుని మరిచిపోయి కొత్త జీవితం ఆరంభించు. పాపని మీ అమ్మ చూసుకుంటుంది. కాలేజీలో చేరు తల్లీ. నీకు ఓపిక వున్నంత వరకు చదువుకో. ఆపై ఏదో ఉద్యోగం చేద్దువుగాని. యిది నీవు నాకు బరువయి నిన్ను పోషించలేక చెప్పే మాట కాదు. నీకు ఏదో వ్యాపకం, వుండాలి. నీవు నాకు మరొక మగబిడ్డవి అనుకుని ఆస్థి యిస్తాను. అయినా మా తదనంతరం నీవు నీ కాళ్ళమీద నిలబడి నీ బిడ్డని పోషించుకోవాలి. మీ అత్తగారు సహృదయంతో మరో పెళ్ళి చేసుకోమన్నా ఒకసారి పెళ్ళయి బిడ్డతల్లి అయిన స్త్రీని చేసుకోడానికి ముందుకు వచ్చే సహృదయులుండరు. అలా జరిగితే మంచి మాటే-

అంతవరకు నీకు ఏదో ఒక వ్యాపకం వుండాలి' అన్నారు.

మెడిసన్ చదువుతా నన్నాను.

"మీరు ముందు మెడిసన్ చదవలేదా?" శారద ఆశ్చర్యంగా అడిగింది.

"ఉహుఁ. బి.ఎస్సీ. పాసవగానే పెళ్ళి అయింది. మెడిసన్‌లో సీటు సంపాదించాను. కాలేజీకి వెళ్ళడం—వచ్చాక పాపతో కాలక్షేపం. రోజులు తిరిగిపోసాగాయి. తొందరగానే పాత జీవితం గురించి మరిచిపోయి కాలేజీ పిల్లలాగే అయిపోయాను. పాపే లేకపోతే ఆ మిగతా జ్ఞాపకాలు పూర్తిగా తుడుచుకుపోయేవి. నాన్నగారు విడాకులకోసం కోర్టులో కేసు వేశారు. భర్త, తాగుబోతు, వ్యభిచారి, హింసిస్తున్నాడన్న కారణంతో విడాకులు కోరాను. బిడ్డని యిప్పించవలసిందిగా అర్థించాను. కొడుకుకి వ్యతిరేకంగా మా అత్తమామల సాక్ష్యం నా పక్షం అవడంతో పాప భారం నాకే అప్పగిస్తూ కోర్టువారు విడాకులు అంగీకరించి నాకు స్వేచ్ఛనిచ్చారు. ఇదీ విషయం."

"మరి....శ్రీధర్?" శారద ఆరాటంగా అడిగింది.

"అవును. నా కథ యింకా ముగియలేదు. తరువాత నా కథ కొత్త మలుపు తిరిగింది. శ్రీధర్ మెడిసన్‌లో నాకు రెండేళ్ళు సీనియర్. కాలేజీలో మామూలు పరిచయం స్నేహంగా ఏడాదికి మారింది. మరో ఏదాదిలో స్నేహం ప్రేమగా మారింది. శ్రీధర్ నా గురించి అంతా విన్నాడు. అతనికి కొన్ని మంచి ఆదర్శాలున్నాయి. పిచ్చి ఆదర్శాలు అన్నవాళ్లూ వున్నారు. అతను ఒక వితంతువుని వివాహం ఆడాలని నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయం ఒక వితంతు స్త్రీ పరిత్త హృదయం గ్రహించాక ఏర్పరుచుకున్నది. ఆమె ఎవరో కాదు. అతని చెల్లెలు! పెళ్ళయిన ఆర్నెల్లకి భర్తని కోల్పోయిన ఆ అభాగిని కన్నీటిని చూసి చలించి తీసుకున్న నిర్ణయం అది. ఆఖరి సంవత్సరంలో తన ప్రేమ బయటపెట్టి వివాహం చేసుకుంటా నన్నాడు. తెల్లబోయాను. "నేను వివాహితురాలిని శ్రీధర్!" అన్నాను నిర్జీవంగా. "తెలుసు," అన్నాడు నిర్లిప్తంగా నవ్వుతూ. "బిడ్డ తల్లిని!" "అదీ తెలుసు." చిరునవ్వుతో అంటున్న శ్రీధర్‌ని

నమ్మలేనట్టు చూశాను. అతని ఔదార్యానికీ, సంస్కారానికీ కదిలి పోయాను. స్త్రీపురుషుల సంబంధంమీదే ఏహ్యత విరక్తి పుట్టిన నాకు శ్రీధర్‌తో పరిచయమయ్యాకగాని, అతని ప్రేమానురాగాలు చవిచూచాక స్త్రీపురుషుల మధ్య ప్రేమ అన్నది ఎంత ఔన్నత్యంగా వుండగలదో తెలిసింది. అతనితో వివాహం అయ్యాకే — ఇష్ట మయినచోట స్త్రీపురుష సంబంధంలో స్వర్గం చవిచూడవచ్చని అర్థం చేసుకొన్నాను....

"శారదా! శ్రీధర్ దేవుడు. అలాంటి పురుషులు యింకెవ రన్నా వున్నారో లేదో నాకు తెలియదు. శ్రీధర్‌లా ప్రతీ పురుషుడు ఆలోచించితే స్త్రీల కన్నీటి కథలే వుండవు. భర్త పోతే, భర్త వదిలితే జీవచ్ఛవంలా బతికే స్త్రీలను శ్రీధర్‌లా చేపట్టగలిగిన వ్యక్తులు నూటికి ఒకరయినా వుంటే కొందరి స్త్రీల కన్నీరయినా తుడవవచ్చు. అతని సహృదయతకి సంస్కారానికి నేనేకాదు, అందరూ ఆబ్బురపడ్డారు. నాన్నగారయితే కన్నీళ్ళతో అతన్ని గుండెలకి హత్తుకున్నారు. నేను కన్నీటితో అతని పాదాలని అభి షేకం చేశాను. మా అత్తమామలు వివాహానికి వచ్చి నిండు మన సుతో ఆశీర్వదించారు. "పాపని మేం చూసుకుంటాం. మా దగ్గిర అలవాటేగా. కొత్తలో మీ మధ్య పాప వుండడం మంచిది కాదు. అతను ఏమన్నా అనుకోవచ్చు." అన్నారు అమ్మ, నాన్న. పాపని వదిలిపెట్టాలని లేకపోయినా అమ్మ నాన్నల మాటలో నిజం వుందని పించి కొత్త కాపురానికి వంటరిగా వెళ్ళాను. నన్ను చూస్తూనే "పాప ఏది?" అన్నాడు శ్రీధర్.

"ఇంట్లో వుంచేశాను, అమ్మవాళ్ళు చూస్తామన్నారు."

శ్రీధర్ నా వంక సూటిగా చూసి "విజయా! ఇదేనా నీవు నన్ను అర్థం చేసుకొన్నది. పాప లేకుండా, పాపని వదిలి నిన్ను రమ్మనేటంత హీనుడిలా కనిపిస్తున్నానా! ఓ తల్లి హృదయాన్ని ఆమాత్రం అర్థంచేసుకోలేని పాషాణాణ్ణా! పాప లేకుండా నీవు నా దగ్గిర సుఖంగా బతకగలవని నేను నమ్మగలనా! నీవు నన్ను ఎంత తక్కువ అంచనా వేశావు!" బాధగా అన్నాడు.

ఈ ఒక్క ఉదాహరణ చాలు అతని ఔన్నత్యాన్ని చెప్పేం దుకు. "శ్రీధర్!" అన్నాను సంతోషంగా అతని గుండెలమీద వ్రాలి పోయి. "శ్రీ—నీవు దేముడివి. మనిషివి కావు." కళ్ళనీరు తిరుగు తూండగా కృతజ్ఞతతో అంతకంటె నోట మాట రాలేదు.

"పిచ్చీ! ఈ రోజునుంచి పాపకి నేను తండ్రిని. పాపకెప్పుడూ నేను తండ్రిని కానని చెప్పకు. పద. వెళ్ళి తీసుకొద్దాం" అంటూ అప్పటికప్పుడు టాక్సీ ఎక్కి బయలుదేరదీశాడు.

శారదా ఆ రోజునించి ఈ రోజు వరకు మా రెండేళ్ళ బాబుకి ఏడేళ్ళ పాపకి శ్రీధర్ తండ్రి. యిద్దరికీ తేడా చూపించినట్టు నేనెప్పుడూ గమనించలేదు. ఈ రోజు నాకంటె అదృష్టవంతురాలయిన స్త్రీ ఎవరూ వుండరు. మనసిచ్చి పుచ్చుకునే భర్త-ముత్యాలలాంటి పిల్లలు-యింత కంటె స్త్రీకి ఏమి అక్కర లేదు. ఇవిలేని స్త్రీ - ఎంత చదువుకున్నా- ఎంత గొప్ప ఉద్యోగం చేసినా - భర్త ఎన్ని వేలు ఆర్జించినా ఎంత దౌర్భాగ్యురాలో నా అనుభవ పూర్వకంవల్ల తెలుసుకున్నాను. అంచేతే ఏ స్త్రీ అయినా భర్త ఆదరాభిమానాలకి లోటయి హింస అనుభవిస్తూం దంటే నా ప్రాణం గిలగిలలాడుతుంది. లోకాన్నంత బాగుచెయ్యలేం. కాని నా చేతిలో వున్న సాయం ఏ ఒక్క స్త్రీకయినా చేయగలిగితే అంతకంటె ఆనందం ఏముంటుంది...."

'డాక్టరుగారూ, మీరెంత అదృష్టవంతులు. మీలాంటి అదృష్టం అందరికీ పడ్తుందన్న భరోసా వుంటే ఏ స్త్రీ తెలిసి తెలిసి నరకంలో మగ్గదు. ఆ నరకంలోంచి పైకి రావడానికి చేయూతనిచ్చే శ్రీధర్ లాంటి పురుషుల అవసరం ఎంతైనా వుంది.

ఈ నాడు కాకపోయినా వచ్చే శకానికైనా అలాంటి హృదయ వైశాల్యం - సంస్కారం కనపరుస్తారని ఆశిద్దాం. భార్య చనిపోతే భర్త పెళ్ళిచేసుకున్నట్టే భార్యకీ ఆ హక్కు వుందని భర్తకి దూరం అయిన స్త్రీ పాపిష్టి స్త్రీ కాదని ఈ సమాజం గుర్తించే మంచి రోజు వస్తుందని ఆశిద్దాం.

అవును శారదా. మహిళా సంవత్సరాలు-మహిళాభ్యుదయాలు- యివన్నీ కబుర్లు తప్ప ఓ స్త్రీ కాపురాన్ని సరిదిద్దగలవా? ఈ చట్టాలు,

సంస్కరణలు స్త్రీకి ఏ విధంగా చేయూత నిస్తున్నాయి. ఇటు పై తరగతి, అటు కింద తరగతని ఈ సమస్యలు ఏం బాధించవు. ఎటొచ్చి మనలాంటి వాళ్ళమే సమాజపు సాంప్రదాయాలనించి తెంచుకుని బయటపడలేక, పడితే పరువు తక్కువ అనుకుంటూ-భర్తని కాదంటే ఈ మాత్రపు బతుకూ వుండదేమోనన్న భయంతో నరకంలో మగ్గుతున్న స్త్రీలు ఎందరో ఈ నాటికీ వున్నారు.

మనుష్యులలో పరివర్తన రావాలిగాని ఈ చట్టాలు ఏంచేస్తాయి. ప్రతీదీ ఎవరో చెయ్యాలి. ఏ ప్రభుత్వమో చెప్పాలి అనుకుంటూ కూర్చోకుండా మనని మనమే బాగుచేసుకోవాలి. మన బతుకు మనం చక్కదిద్దుకోవాలి. నీ కాపురం నీవు చక్కదిద్దుకోవాలి. దానికి సామ దాన భేదదండోపదాయాలు ఉపయోగించాలి, సత్యంగా పని సానుకూలబడితే సంతోషమే. లేనపుడు భార్య అయినంత మాత్రాన బానిసలా పడివుండదు - వుండనక్కర లేదన్న పాఠం నీ భర్తలాంటి వాళ్ళకి నేర్పాలి.

భార్యని హింసించే హక్కు లేదు తమకి, అలా హింసిస్తే సహిస్తూ పడివుండే రోజులు పోయాయని అలాంటి మగవాళ్ళకి తెలియచెప్పాలి నీలాంటివాళ్ళు.

శారద అంగీకార సూచనంగా తల ఆడించింది. విజయ భోజనం పూర్తిచేసి చేయి కడుక్కు వచ్చింది. ఈజీ చెయిరులో అలసటగా వ్రాలింది.

"ఒక్క సందేహం మిగిలిపోయింది యింకా." శారద నవ్వుతూ అంది.

"చంపావు యింకా ఏం మిగిలింది. నన్ను పడుకోనీయవా" విజయ కళ్ళువిప్పి నవ్వుతూ అంది.

"ప్రకాష్‌గారి సంగతి మీరేం చెప్పలేదు తరువాత.ఏమయ్యారు ఆయనః" శారద కుతూహలంగా అడిగింది.

"అవునవును. ప్రకాష్‌కేం నిక్షేపంలా వున్నాడు. అయితే ఈసారి రివర్స్ గేమ్ ఆడుతున్నాడు. అర్థంకాలేదా. మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడులే. పిల్లనిచ్చేవాళ్ళు లేక, ప్రతీవాళ్ళు మొదటి భార్య ఎందుకు

వెళ్ళిపోయిందీ అని అడిగి మానుకున్నారు. ఆఖరికి ఓ తలమాసిన వాడు పిల్లనిచ్చి తలకడుకున్నాడు. లేనింటి పిల్ల అయితేనేం మొగుడ్ని ఎలా కంట్రోలుతో పెట్టిందోగాని కొంగున ముడేసుకుంది. ఇప్పుడామె కూర్చోమంటే కూర్చుంటాడుట. నించోమంటే నించునే స్థితికి దిగ జారాడుట.

ఆ మధ్య మా అత్తగారు బాధపడ్తూ చెప్పారు. అలాంటి మగ వాళ్ళందరూ ఆఖరికి అలాగే తయారవుతారులే. ఆ పెళ్ళాంకూడా పోతూందేమోనని భయం అనుకుంటూ.

'ఏం, యింకేం, సందేహాలు లేనట్టేనా?' విజయ నవ్వి కళ్ళు మూసుకుంది.

* * *

ఉదయమే ఊర్నించి వచ్చిన శివరామ్ గుమ్మానికి తాళం ప్రత్యక్షమవడంతో ఆశ్చర్యపోయాడు. ఇంత పొద్దునే శారద ఏమయి నట్టు? ఎక్కడికి వెళ్ళింది? ఆలోచనతోచక మామూలుగా ఏ బజారు కన్నా వెడితే శారద పక్కింట్లో తాళం యివ్వడం గుర్తువచ్చి పక్కిం టికి వెళ్ళాడు.

పక్కింటాయన కాఫీ తాగుతూ పేపరు చదువుతున్నవాడల్లా శివరామ్‌ను చూసి 'ఓహో, వచ్చారా....' అన్నాడు.

'శారద తాళం మీ కిచ్చిందాండీ. యింత పొద్దునే ఎక్కడికి వెళ్ళింది?' అన్నాడు.

ఆయన ఒకసారి కళ్ళజోడులోంచి శివరామ్‌ని పరికిస్తూ "తాళం యిచ్చిందా అమ్మాయి, కాని ఎక్కడికి వెళ్ళిందో తెలియదు. మూడు రోజుల క్రితం తాళం యిచ్చి వెళ్ళింది, బహుశా వూరు వెళ్ళినట్లుంది' అన్నాడు ఆయన అదోలా.

శివరామ్ ఆశ్చర్యపోయి "ఊరు వెళ్ళిందా? ఎక్కడికి?— అన్నాడు.

"తెలియదు. చూడండి మిస్టర్ శివరామ్. ఒకమాట చెపితే ఏం అనుకోరుగదా." అన్నారాయన. అంటూ వీధిలోకి చూసి ఆటో ఆగి వుండడం చూసి "ఖైట ఆటో వున్నట్లుంది. ముందు ఇంటికి వెళ్ళండి

తరువాత మాట్లాడుదాం" అంటూ లోపలికివెళ్ళి తాళం తెచ్చి యిచ్చాడు.

ఆయన మాటలకి అర్థం బోధపడక శివరామ్ ఆశ్చర్యపోతూనే తాళం తీసుకు వెళ్లాడు.

ఈ శారధ ఎక్కడికి వెళ్ళింది. వదిన్నా పుట్టింటికి వెళ్ళిందేమో. రానీ, పని పట్టాలి. కసిగా, కోపంగా పళ్లుకొరికాడు. అసలే ప్రయాణం బడలికతో చిరాకుగా వున్న అతనికి యింటికి వచ్చేసరికి శారద లేక పోవడంతో తిక్కగా వుంది. వంటింట్లోకి కాఫీ కాచుకోవాలని వెళ్లాడు. పాలు లేవు. పనిమనిషన్నా వస్తే బాగుండును. ఈ శారద కెంత ధైర్యం. తన కిష్టంలేదని చెప్పినా వెడుతుందా. రానీ....ఎదురుగాలేని శారదని ఏం చెయ్యలేక కోపంకొద్ది బాల్చీలకొద్ది నీళ్ల కసిగా దిమ్మరించుకున్నాడు.

తలుపులు తీసి వుండడం చూసి పనిమనిషి లోపలికి వచ్చి 'మీరా బాబూ అమ్మగారొచ్చినారేమో అనుకున్నాను. బాబో, ఎంత గోరం జరిగిపోయేది కొస్తంతలో తప్పిపోనాదిగాని - అమ్మబాబోయ్. అమ్మగా రెంత సాహసం సేసినారో తెలుసా బాబూ.' వస్తూనే శివరామ్‌ని చూసి గుండెలమీద చేతులు వేసుకుని అప్పలమ్మ మొదలు పెట్టింది.

శివరామ్ చకితుడయ్యాడు. తెల్లపోతూ—'ఏమిటి - ఏం చేసిం దమ్మగోరు.' గాభరాగా అడిగాడు.

'మీరటు ఎల్లగానే, అమ్మగారు యిసం మింగారు బాబూ. అదృష్టం బాగుండబట్టి సమయానికి సాకలాడు సూసి యిరుగు పొరుగుని కేకెట్టాడు. ఆస్పత్రికి తీసికెళ్లాం. ఆ దేముడు సల్లగా సూడబట్టి గండం గడిచి బతికి బయటపడ్డా రమ్మగోరు. లేదంటే ఎంత ఘోరం జరిగిపోను....' అప్పలమ్మ వాగ్ధోరణి సాగుతూనే వుంది.

శివరామ్ మొహం పాలిపోయింది. "శారద ఆత్మహత్యకి తల పడిందా? ఎందుకు?....ఎందుకు. ఎందుకలా చేసింది" మనసులో మాట తెలియకుండానే పైకి అన్నాడు.

'ఎందుకేటి బాబూ. మొగుడు పెళ్లాలన్నాక మాటమాట అను కొంటారు, యీ మాత్రం దానికి నిండు పాణం తీసుకుంటావా అమ్మా

అని కూకలేశాను బాబూ. ఆ అమ్మకి అసలే అభిమానం. మీరు సిట పటలాడుతూ, కూకలేస్తే ఆ అమ్మకి పౌరుషం వచ్చి యింత పని సేసేసింది. బాబూ యికపై ఆ అమ్మని జాగ్రత్తగా సూసుకో బాబూ. మాట జారకు.' అప్పలమ్మ హితోక్తులు సాగుతున్నాయి.

అవేవి శివరామ్‌కు వినపడలేదు. శారద యింతకి తెగించిందా? ఎంతపని చేసింది. తనని నలుగురులో అవమానపరచడానికి కాకపోతే అంత ఏం కొంప మునిగింధని యింత ఘోరం చెయ్యాలి. ఆవేశంతో అతని వళ్లు వుడికిపోసాగింది.

అప్పలమ్మ యిల్లు తుడిచి, హోటల్నించి కాఫీ, టిఫను తెచ్చి పెట్టి వెళ్లింది.

యాంత్రికంగా కాఫీ తాగుతున్నా - టిఫిను తింటున్నా శివరామ్ మనసు శారద చేసిన పనికి కుతుకుతలాడుతూంది.

పది గంటల రైలు దిగి శారద యింటికి వచ్చేసరికి బోనులో పులిలా పచార్లు చేస్తున్నాడు శివరామ్ ముందుగదిలో.

సూట్‌కేస్ పట్టుకుని లోపలికి అడుగుపెట్టిన శారదని చూడగానే అప్పటివరకు ఎవరిమీద చూపాలో తెలియని చిరాకు, కోపం, ఉక్రోషం ఒక్కుమ్మడిగా దుట్టుముట్టాయి.

"ఎక్కడికి వెళ్లావు?" తీక్షణంగా చూస్తూ అన్నాడు పళ్ళు కొరికి. ఆ క్షణంలో ఆ కోపంలో అంతకంటె మాటరాలేదు.

అతని తీక్షణతకి శారద మనసులో అరక్షణం బెదిరింది. కాని అది పైకి కనపడకుండా నిబ్బరంగా చూస్తూ "మా చెల్లెలి పెళ్ళికి వెడుతున్నట్టు ఉత్తరం రాసిపెట్టాను, చూడలేదా" అంది సౌమ్యంగా.

'ఎవరిని అడిగి వెళ్ళావు? నిన్ను వెళ్ళద్దని చెప్పాను, ఎందుకు వెళ్ళావు?' గొంతు మరింత పెరిగింది.

"అలా నా చెల్లెలి పెళ్ళికి కూడ వెళ్ళడానికి వీలులేదని కట్టడి చేసే అధికారం మీకు లేదని తెలిశాక వెళ్ళాను." శారద నిబ్బరంగా చూస్తూ అని సూట్‌కేస్ పట్టుకు లోపలికి వెళ్ళబోయింది. శివరామ్ ఒక్కక్షణం నిర్ఘాంతపోయాడు. తనని ఎదిరించి నిర్లక్ష్యంగా జవాబిస్తున్నది శారదేనా అన్న దిగ్భ్రమతో. అపనమ్మకంగా చూశాడు

శారదని. వెంటనే అతని మొహంలో రక్తంపొంగింది. విసురుగా దగ్గిరికి వెళ్ళి చెయ్యెత్తి "ఎదిరించి జవాబులు చెప్తున్నావా అంతవరకు వచ్చిందా నీ వ్యవహారం." పళ్ళు కొరికాడు. శారద ఆ కోపానికి బెదరకుండా సూటిగా తీక్షణంగా చూసింది. "ముందా చెయ్యి దింపండి తిట్టకొడితే యికమీదట సహించను. భార్యని మర్యాదగా చూడడం నేర్చుకోండి."

మరోసారి నిర్ఘాంతపోవడం శివరామ్ వంతయింది. మాటల కోసం తడుముకున్నాడు.

"ఓహో యింతవరకు వచ్చిందా వ్యవహారం. అంత పొగరు ఎక్కిందా. మాటకి మాట జవాబు యిచ్చేంత దానివయ్యావా. పో— ఎక్కడీనించి వచ్చావో అక్కడికే పో. నీవేం చేస్తే అది సహించి పడుంటాననుకున్నావా. పో ముందు బయటికి" ఉగ్రుడయి అరిచాడు.

"అగ్నిసాక్షిగా నలుగురెదురుగా కట్టుకున్న భార్యని పొమ్మ నడం అంత సుళువుగాదు. భార్యని వదిలించుకోవాలంటే చాలా తతంగంవుంది.

"నేను పోవాలంటే కోర్టుకెక్కి విడాకులు యివ్వండి. అంత వరకు పొమ్మనే అధికారం మీకు లేదు."

శివరామ్‌కిది రెండోషాక్! శారదలో యీ నాటి యీ తీరు శివరామ్ ఊహించనిది. అడుగడుగునా అతను ఆశ్చర్యచకితుడవుతూ శారదకేం పిచ్చి పట్టలేదు గదా అన్నట్టు తెల్లబోయి చూశాడు. ఆమె అంత నిర్లక్ష్యంగా మాట్లాడుతూంటే ఏం చెయ్యాలో తోచలేదు. పుట్టింట్లో ఎవరో ఏదో నేర్పి వుంటారు. ఆమె ముందు తగ్గిపోవ డానికి అహం అడ్డువచ్చింది.

"ఓహో అంతదూరం వెళ్ళిందన్నమాట వ్యవహారం. అంత సరదాగావుంటే అలాగే యిస్తాను విడాకులు. అడుక్కుతింటూ పోదువుగాని" ఉక్రోషంగా, కసిగా అన్నాడు.

"పరవాలేదు. ఈ బతుక్కంటే ఏ బతుకూ తీసిపోదులెండి. మీ యింట్లో చేసే వంట మరెవరి యింట్లోనన్నా చేసి ఆ మాత్రం తిండి సంపాదించుకోగలను. యింతకంటె ఆత్మగౌరవంతో బతక

గలను. అంచేత ఫో ఫో అని బెదిరించకండి" నిర్లక్ష్యంగా అంది.

"నిన్ను నేను బాధ పెడ్తున్నానని నలుగురికి చెప్పడానికే కదూ ఆత్మహత్య తలపెట్టి నన్ను నలుగురిలో అవమానం చేశావు. పైగా ఎదిరించి జవాబులు చెప్తావా? తప్పు తప్పనడంపోయి నీ యిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తే సహిస్తాననుకున్నావా'' అరిచాడు. ఎదురయిన ఈ స్థితికి అతనూహించనిది అవడంవల్ల మనిషి వణికిపోతున్నాడు ఆవేశంతో. వళ్ళంతా చెమట పట్టింది.

"అవును ఆత్మహత్య తలపెట్టడం పొరపాటే. తప్పే. మీలాంటివారికి భయపడి నిండు నూరేళ్ళ జీవితం ముగించాలనుకోడం నా తప్పే. నేను చస్తే రేపటికి రెండు అనుకుని మూడోరోజు మళ్ళీ పెళ్ళికి తయారయ్యే మీ లాంటివారికి జడిసి నా బతుకు సరిసమాప్తి చేసుకోవాలనుకోడం అవివేకమే. నలుగురికి తెలియడం మంచిదేలెండి. రే పొద్దున ఏం జరిగినా నేరం నా మీద వుండదు." శారద నిర్లక్ష్యంగా అంది. శివరామ్ కోపం ఆఖరి మెట్టుకు చేరింది. "ఫో— ముందు బయటికి" గుమ్మంవైపు వేలు చూపాడు.

''ఎందుకలా అరుస్తారు. ఇందాకే చెప్పాను. కోర్టులో విడాకులు పుచ్చుకొనేవరకు మీ భార్యనే. అంతవరకు పొమ్మనే హక్కు మీకులేదు."

శారద లోపలికి వెళ్ళబోయింది, శివరామ్ ముందుకురికి చేయి పట్టి వెనక్కిలాగి, చెంప ఛెళ్ళు మనిపించాడు."వెళ్ళవూ ఎలా వెళ్ళవో నేనూ చూస్తాను. క్షమాపణ చెప్పు. తప్పయిందని కాళ్లు పట్టుకో లేదంటే వెళ్ళు. ఈ రెండింట్లో ఏంచేస్తావో చెయ్యి'' నిప్పులు కురిపించాడు కళ్ళలో. శారద చెంప పట్టుకుని క్రోధావమానాలతో ఎగిసిపడుతున్న గుండెలతో తీక్షణంగా చూసింది.

"నా వంటిమీద చెయ్యివేస్తే మర్యాదగా వుండదని ముందే చెప్పాను. అయినా కొట్టారు. క్షమాపణ కోరాల్సినంత తప్పులు నేనేం చెయ్యలేదు. చెప్పను. సరే, మీరు భార్య అక్కరలేదనుకున్నప్పుడు భార్యని గౌరవంగా చూడలేని భర్త నాకూ అవసరంలేదు. ఇందాకే చెప్పాను. ఇంతకంటే ఏ బతుకూ తీసిపోదని, నేనూ తెగిం

చాను. ఇన్నాళ్ళు మీ జులుం సహించాను. నా ఓర్మికే హద్దువాటింది. నేను వెడుతున్నాను. గుడ్ బై."

శారద స్థిరంగా చెప్పదలచింది చెప్పి సూట్ కేస్ పట్టుకొని గుమ్మంవైపు అడుగులు వేసింది. పొమ్మనగానే బెదిరి కాళ్ళు పట్టుకుంటుందని, తప్పయిందని ప్రాధేయపడ్తుందని ఆశించిన శివరామ్‌కు శారద నిజంగా వెళ్ళిపోతూంటే కర్తవ్యవిమూఢుడిలా నివ్వెరపోయి చూశాడు.

అతని శరీరం భయంతోనో, ఆవేశంతోనో వణకసాగింది. సుత్తులతో కొట్టినట్టు తలబద్దలు అవుతూంచి. వళ్ళు వేడెక్కిపోయింది. నిలబడడానికి శక్తిలేనట్టు పక్కమీద వాలిపోయాడు.

* * *

శారద విజయ దగ్గరకి వెళ్ళి జరిగినదంతా చెప్పింది. "సరే. మొదటి స్టెప్‌గా మన ప్రయత్నం మనం చేద్దాం. అతని ఆఫీసరుని కలిసి మాట్లాడుదాం" అంది విజయ.

విజయ, శారదని ఆశ్చర్యంగా చూశాడు అధికారి. విజయ తనని తాను పరిచయం చేసుకొని శారదని పరిచయం చేసింది. అతను మర్యాదగా లేచి నమస్కరించి ఎస్ మేడమ్ వాట్ కెనయ్ డూ ఫర్ యూ.' అన్నాడు నమ్రతగా.

"మీతో యీమె గురించిన కొన్ని పర్సనల్ మాటర్స్ మాట్లాడాలని వచ్చాను." విజయ అంది. ఆయన అర్థంగానట్టు ఆశ్చర్యంగా చూసాడు. విజయ విశదంగా శారద గురించి, శివరామ్ గురించి, ముందునించి దాంపత్యంలో కలతలు,కట్నకానుకల లోపానికి భార్యని మాటలతో శివరామ్ ఎలా హింసించింది. చెయ్యి చేసుకోడం ఆఖరికి పుట్టింటికేనా పంపని అతని అమానుషత్వం, విరక్తిలో శారద ఆత్మహత్యా ప్రయత్నం తను వైద్యం చెయ్యడం అన్నీ విపరంగా చెప్పింది.

"రియల్లీ!" ఆశ్చర్యంగా అన్నాడు అధికారి. "ఈ రోజుల్లో కూడా భార్య నిలా హింసించే వారున్నారంటే మా మగవాళ్ళం సిగ్గు పడవలసిన విషయమే. శివరామ్ లాంటి విద్యాధికుడు కూడా యిలా

ప్రవర్తించడం నిజంగా అమానుషమే. అయితే ఇంతకీ డాక్టర్, నన్నేం చెయ్యమంటారు. ఇది అతని పర్సనల్ మాటర్ గదా...."

"అవును. ఇది అతని సొంత విషయమే, కాని అతను మీ కింద పనిచేస్తున్నాడు. అతని కాండక్ట్ మోరల్స్ ప్రిన్సిపల్స్ వీటితో మీకేం పనిలేదా. రూల్సు, రెగ్యులేషన్స్ వప్పుకోడానికి మానటానికి, మీది గవర్నమెంటు సర్వీస్‌కాదు. మీది ప్రైవేట్ ఫరమే! మీ యిష్టా యిష్టాలతో ఒక ఉద్యోగిని వుంచగలరు. తీసేయగలరు మూడు నెలల జీతంతో, లేక మూడునెలల నోటీస్‌తో అతన్ని కాస్త నయాన భయాన బెదిరించి లొంగదీసుకోలేరా. ఉద్యోగం పోతుందంటే ఎలాంటి వారి కన్నా భయం వుంటుందిగదా...." విజయ ఆశగా చూస్తూ అడిగింది.

ఆఫీసరు ఆలోచనలో పడ్డాడు.

"కాని, ఈ ఉద్యోగం కాకపోతే మరోటి చూసుకుంటాడు. దీంతో కాపురం చక్కపడ్తుందని ఏముంది."

సందేహంగా అన్నాడు అధికారి.

"ఈ రోజుల్లో ఒక ఉద్యోగం లేకపోతే మరోటి అంత సుళువుగా దొరికే రోజులా. దొరికినా ఎంత ప్రయత్నం చెయ్యాలి. ఎన్నాళ్ళు పడ్తుంది. ఈ భయం అతనికి వుండదా. ఇంతకీ నిజంగా ఉద్యోగం-తీయద్దు కాస్త బెదిరించి చూడండి. ఓ స్త్రీ కాపురం నిలబడ డానికి మీ చేతనయినది మీరు చేస్తే మీ మేలు మరిచిపోలేం సార్."

"కరెక్ట్ చూస్తాను. లెట్ మీ సీ వాట్ ఐ కెన్‌డూ ఫర్‌హెర్. నిజంగా యిది చాలా విచారించదగిన విషయమే. నా చాతనయిన సాయం చేస్తాను." తల పంకించా డాయన.

"థాంక్స్‌సార్. మీరు యీ మాత్రం భరోసా యిస్తే చాలు. అతను దారికి వస్తాడని నా నమ్మకం."

విజయ సంతృప్తిగా అంది.

"ఇంతకీ మీరు ఆమెకేం అవుతారు?" కుతూహలంగా అడి గాడు.

"తోటి స్త్రీగా ఆమెకి బంధువుని అంతకంటే ఏం అవను" విజయ నవ్వి అంది.

"చూడమ్మా. తప్పకుండా నాకు చాతనయినంతగా నయాన, భయాన లొంగదీసుకోవడానికి ప్రయత్నిస్తాను. మీ ఫోను నెంబరు వుంటే యీయండి ఏంజరిగిందీ తెలియపరుస్తాను." విజయ బ్యాగు తీసి విజిటింగ్ కార్డు అందించింది. అంతలోనే గుర్తువచ్చి బ్యాగు లోంచి ఒక కాగితంతీసి, "ఇదికూడా మీరు అతనిమీద ఉపయోగించ వచ్చునేమో. కాస్త బెదిరించి ప్రయత్నించండి. ఇది శారద ఆత్మ హత్యా ప్రయత్నం తలపెట్టినపుడు ఆమెను ఆస్పత్రికి తీసుకొచ్చాక ఆమె చేతిలో చూశాను." అంటూ విజయ కాగితం యిచ్చింది.

ఆయన ఆ కాగితం అందుకుని చూసి "ఎస్ యూ ఆల్‌రైట్. అతని లొంగదీసుకునే సాధనంగా దీన్ని ఉపయోగించవచ్చు." అన్నాడు సాలోచనగా.

"థాంక్స్ సార్. మీరీ ఉపకారం చేస్తే మేము మీ కెప్పటికీ కృతజ్ఞులుగా వుంటాము. ఏం జరిగిందీ ఫోను చెయ్యండి' విజయ శారద నమస్కరించి లేచి శలవు తీసుకున్నారు.

*　　　*　　　*

ఆ రోజు పడకవేసిన శివరామ్ ఆ పడక పడక వారంరోజులు వళ్ళుతెలియని జ్వరంతో పక్క నంటిపెట్టుకుని వుండిపోయాడు. ఆ రోజు ప్రయాణం బడలికతో వళ్ళునెప్పులు, తలనొప్పులు అను కున్నాడు. అసలే శరీరక చిరాకుకి తోడు, ఆ రోజు శారదతో జరిగిన గొడవతో అతని మనసు స్థిమితం కోల్పోయింది. ఏమిచెయ్యాలో తోచని నిస్సహాయస్థితిలో పక్కమీద అశాంతిగా వాలిపోయాడు.

ఆ పడుకోవడం సాయంత్రం ఐదింటికిగాని కళ్లు తెరవలేదు· దాహంతో గొంతు ఎండిపోతూంటే, జ్వరం, వళ్ళునెప్పులు, తల నొప్పితో మూలుగుతూ 'శారదా మంచినీళ్ళు' అన్నాడు నీరసంగా. శారద లేదన్న సంగతి, ఉదయం జరిగింది అతనికి గుర్తే లేదు. ఎంతసేపటికి శారద రాకపోవడంతో గట్టిగా అరిచాడు. అప్పటికీ జవాబు రాకపోవడంతో అసహనంగా, పక్కమీదనించి లేవబోయాడు. లేవగానే తల తిరిగినట్లయి మళ్ళీ తలగడమీద వాలిపోయాడు. కళ్ళకి చీకట్లు కమ్మినట్టయింది. కళ్ళు తెరవాలన్నా బరువుగా అన్పించి తెరవ

లేకపోయాడు. మరో రెండునిమిషాలకిగాని అతని స్థితి అతనికి అర్థం గాలేదు. అది అర్థం అయ్యాక నెమ్మదిగా ఉదయం శారదతో జరిగిన ఘర్షణా, శారద వెళ్లిపోవడం గుర్తువచ్చి ఒక్కసారిగాఎందుకో గుండె ఝల్లుమంది. శారదలేదు. తనకు ఇంత జ్వరంఎలా....ఏం చెయ్యడం అన్న సంగతి తల్చుకోగానే అతనికి ఏదో తెలియని జంకుతో గుండె దడదడలాడింది. శివరామ్ దేహస్థితి, మనస్థితి ఆ ఒక్క అరగంటలో దిగజారిపోయాయి. శారదతో తగవు తెచ్చుకున్నందుకు మనసులో ఏదోమూల పశ్చాత్తాపంలాంటిది మెదిలింది. అంతకంటె ఆలోచించే ఓపిక లేకపోయింది. ఆ క్షణంలో అతనికి. అలాగే నెమ్మదిగా లేచి ఎదిరింటివాళ్ళని గది పక్కింటివాళ్ళని కాని పిలవడానికి వీధిలోకి వచ్చాడు. వీధిలో ఆడుకుంటున్న ఒక పిల్లవాడిని నెమ్మదిగా పిలిచి ఎదిరింటి ఆయన్ని ఒక్కసారి రమ్మని కబురంపాడు. ఆయన వస్తూ శివరామ్ స్థితిచూసి "అదేమిటలా వున్నారు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"జ్వరమండీ. పొద్దుటినించీ చాలా జ్వరంగా వుంది. కాస్త ఎవరినైనా పంపి డాక్టరు నెవరినైనా పిలిపించగలరా- అలాగే మా అప్పలమ్మకి కాస్త కబురు పంపండి. ఇంత కాఫీగాని హార్లిక్స్‌గాని చేసియిస్తుంది. ఉదయంనించి ఏం తాగలేదు" నీరసంగా అన్నాడు.

"అయ్యో., అదేం. మీ ఆవిడ ఊరినించి వచ్చినట్లున్నారే. ఆవిడ లేరా ఏమిటి?" శారద ఉదయం మళ్ళీ వెళ్లిపోవడం చూసీ ఏం తెలీనట్లు ఆరా తీసాడాయన.

శివరామ్ జవాబు ఏం చెప్పాలో తెలియక తడబడిపోయాడు. 'లేదు.... లేదావిడ. ఊరికి వెళ్లింది' గొణిగాడు. ఆయన నమ్మనట్లు చూశాడు.

"అదేం ఊరినుంచే వచ్చి మళ్లీ వెళ్లారు. అవును, ఉదయం ఆవిడ విసురుగా ఇంట్లోంచి వెళ్లారు. మీరేదో కోపంగా అరుస్తున్నారు. మళ్లీ తగవులాడారా...."

ఆయన ఆరాలు చూస్తుంటే శివరామ్ వళ్లు ఉడికిపోసాగింది. కాని ఏమనలేని నిస్సహాయస్థితిలో పడిపోయాడు. 'ఆ. ఏంలేదు. ఏదో గొడవ' గొణిగాడు.

"చూడు నాయనా, నీవేం అనుకోకుగాని. ఉదయమే చెప్పాను గదా. ఇకపైనన్నా కాస్త జాగ్రత్తగా వుండాలని. ఆ అమ్మాయిని బాధపెట్టకు అని. ఇప్పుడేం అయిందో చూశావా. ఇలా ఒళ్లుతెలియని జ్వరంలోవుంటే నీళ్ళిచ్చే దిక్కన్నాలేకుండా అయిపోయావు. ఇంటికి యిల్లాలు వుండాలి అబ్బాయి. ఎంతవున్నా, ఎవరున్నా ఇల్లాలులేని లోటు తీరదు. చూడు, ఇప్పుడు నీ అవస్థచూడు. అయినా అంత తొందర ఆవేశం పనికిరాదు. ఎంత భార్య అయినా ఎంతకని వాళ్లు మాత్రం సహిస్తారు.

శివరామ్‌ని అవమానం, కోపం నిస్సహాయం ముంచెత్తాయి. అయినా అవతల పెద్దాయన-ఏమనగలడు? తననిలాంటి దుస్థితి పడేసిన శారదమీద గొంతువరకు కసి, ద్వేషం కలిగింది. తనని కావని ఎంత నిర్లక్ష్యంగా వెళ్లిపోయింది. తనని నలుగురిలో లోకువ చేయడానికే కదూ- లేకపోతే యీయన యింత ధైర్యంగా ఇలా విమర్శించగలిగే వాడా, నల్లబడిన శివరామ్ మొహం చూసి ఆయన ఉపన్యాసం ఆపి,

"సరే- జరిగిందేదో జరిగింది ఆ విషయం తరువాత ఆలోచించవచ్చు. ముందు కాస్త హార్లిక్స్ పంపిస్తాను మా యింట్లోంచి, తాగండి. తరువాత డాక్టరికి కబురు పెడ్తాను." అన్నారు సీతారామమూర్తి గారు.

"అప్పలమ్మకి కూడా కాస్త కబురు పెట్టండి."

మూర్తిగారు తలఊపి వెళ్లాడు.

కాసేపటికి వాళ్ళ అబ్బాయి వచ్చి 'అప్పలమ్మకీ జ్వరంటండీ. రానేనంది. నాన్నగారు ఈ మాత్రతో హార్లిక్స్ తాగమన్నారు. డాక్టరు గారు కాసేపట్లో వస్తారుట' అని హార్లిక్స్ ఇచ్చివెళ్లాడు. హార్లిక్స్‌తో గాక కాస్త ఆకలి ఉపశమించింది శివరామ్‌కి. కణతలు బద్దలయి పోతూంటే అమృతాంజనం రుద్దుకున్నాడు. అప్పుడే అప్రయత్నంగా క్రితంసారి జ్వరంవచ్చినపుడు నానా హడావిడిచేసి శారదచేత సేవలు చేయించుకుంటూ, అంత చేస్తున్నా కసురుకుంటూ, ఇది సరిగాలేదు, అది బాగులేదు అని తిట్టడం గుర్తువచ్చి అతనికి తెలియకుండానే నిట్టూర్పు వదిలాడు. పనిమనిషైనాలేదు యిన్ని కాఫీనీళ్లు తెచ్చిపెట్ట డానికి. ఈ జ్వరం ఎన్నాళ్లకి తగ్గుతుందో మూర్తిగారు ఎన్నాళ్లు

చూస్తారు? ఏం చెయ్యడం అతని సమస్య అది??

డాక్టరు వచ్చేసరికి జ్వరం 104 డిగ్రీలుంది. డాక్టరు ఇంజక్షను మందులు రాసిచ్చి, ఈ జ్వరం ఎటుతేలేది మరో రోజయినా పోతేగాని చెప్పలేనని వెళ్లాడు. 'చాలా జ్వరమే. ఏంచేస్తారు యిప్పుడు. ఇంట్లో ఎవరూలేరు. వంటరిగా కాఫీ అయినా యిచ్చేవారు లేకుండా ఎలా వుంటారు.' మూర్తిగారు ఆరాతీశారు.

శివరామ్ ప్రశ్న అదే!! 'మీ ఆవిడపేర టెలిగ్రాం ఇమ్మన్నారా. ఇంతకీ ఆవిడ ఎక్కడికి వెళ్లారు?'

"తెలీదు. ఇంకెక్కడికి వెడుతుంది. పుట్టింటి కెళ్లివుంటుంది."

"అయితే టెలిగ్రాం యిస్తాను ఎడ్రసు యివ్వండి."

తనని కాదని అంత అహంకారంతో వెళ్లిపోయిన భార్యని యింత వెంటనే ప్రాధేయపడ్తున్నట్టు రమ్మనడానికి శివరామ్‌కి అహం అడ్డువచ్చింది. నీవు నా మొగుడివేకాదన్నదాన్ని. తన లెక్క కానట్టు పోయినదానిని తనే పిలవడమా? ఆత్మాభిమానం అంగీకరించలేదు. మొగుడంటే ఏమిటో తెలియచెప్పాలి. పుట్టింట్లో వుండి బుద్ధివచ్చి తన దగ్గిరికి తప్పయిందంటూ ప్రాధేయపడ్తూరావాలి తనే. అంతేగాని ఇప్పుడు తను పిలిస్తే ఇంక తనమీద ఇంకేం గౌరవం భయంభక్తి వుంటాయి. లోకువయిపోడూ. ఇంక తనమాట లెక్క చేస్తుందా! శివరామ్ మనసులో అలజడి ఇది. అంత సుళువుగా భార్యముందు తేలికయిపోవడానికి అతని పురుషాహంకారం అడ్డువచ్చింది. కాని ఇంట్లో ఎలా? అమ్మకి టెలిగ్రాం ఇచ్చి రమ్మంటే, ఆ ఆలోచన రాగానే అతని సమస్యకి పరిష్కారం దొరికిపోయినట్లు ప్రాణం లేచి వచ్చింది. అమ్మ వస్తే, ఈ జ్వరం తగ్గాక, తరువాత సంగతి తరవాత..... వెంటనే "మా అమ్మకి టెలిగ్రాం ఇస్తాను, ఆవిడ వస్తారు. కాస్త టెలిగ్రాం పంపించండి." అంటూ ఎడ్రసు చెప్పాడు శివరామ్. మూర్తిగారు ఏదో చెప్పబోయి విరమించుకుని అడ్రసు తీసుకు వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

శివరామ్ తల్లి మర్నాడు సాయంత్రానికి వచ్చింది. జ్వరంతో

వళ్ళెరగకుండా పడున్న కొడుకుని, నిర్మానుష్యంగా వున్న ఇంటిని చూసి—

"ఇంత జ్వరమే! శారద ఏదిరా?" అందావిడ ఆశ్చర్యంగా.

శివరామ్ తల్లినించి చూపులు తప్పించి "లేదు" అన్నాడు ముభావంగా.

"అదేమిటి, ఎక్కడికెళ్ళింది?" మరింత ఆశ్చర్యంగా అడిగింది సరస్వతమ్మ.

"తెలీదు...." గొణిగాడు శివరామ్.

ఈసారి ఆవిడ మరింత తెల్లబోయింది. "తెలీకపోవడం ఏమిటి? నీవింత జ్వరంలో పడుంటే ఎక్కడికి వెళ్ళింది?"

శివరామ్ జవాబివ్వలేదు.

కొడుకు వరస చూసేసరికి ఆవిడకి అనుమానం వచ్చింది. ఇంకా ఏదో జ్వరం అని కొడుకు చూడాలనివుంటే టెలిగ్రాం ఇచ్చి వుంటారని అనుకుందావిడ. కాని ఇక్కడి పరిస్థితి చూస్తే వళ్ళెరగకుండా పడున్న కొడుకు, ఇంట్లో శారద లేదు. కాఫీ యిచ్చే దిక్కన్నా లేదని తనని పిలిపించాడని తెలుసుకుంది ఆవిడ.

"ఏం జరిగిందిరా—నిన్నిలా వదిలేసి ఎలా వెళ్ళింది? ఎక్కడికి వెళ్ళింది. పుట్టింటికా?" కాస్త తీవ్రంగా అడిగింది.

"ఏదో....ఏదో మాట మాట అనుకున్నాం. కోపం వచ్చి వెళ్ళిపోయింది" శివరామ్ చెప్పలేక చెప్పలేక ఏదో గొణిగాడు.

"అయితే ఇలాంటి స్థితిలో నిన్నొదలి వెళ్ళిపోతుందా? మొగుడు పెళ్ళాం అన్నాక ఏదన్నా అనుకోరూ? అంతమాత్రానికి యిల్లు వదలి పోతుందా?" తీక్షణంగా అంది.

"లేదులే! తనకి తెలియదు నాకు జ్వరమని. తను వెళ్లాక జ్వరమొచ్చింది."

"హు! బాగుంది వరస. మొగుడిమీద అలిగి పుట్టింటికి పోయిందన్నమాట. చూద్దాం ఎన్నాళ్ళుంటుందో?" ఆవిడ పౌరుషంగా కోడల్ని నిందించింది.

"అందుకే తనకి టెలిగ్రాం యివ్వకుండా నీకిచ్చాను...."

నీరసంగా అన్నాడు శివరామ్.

తల్లి ఏమంటుందోనని భయపడ్డ శివరామ్ తల్లి తన పక్షం మాట్లాడడంతో నిశ్చింతగా నిట్టూర్పు వదిలి అప్పటికి ఆ గండం గడిచినందుకు సంతోషించాడు.

శివరామ్ జ్వరం ఆరో రోజుకిగాని తగ్గలేదు. ఏడోరోజు పత్యం తిన్నాడు. ఆరోజే అప్పలమ్మ జ్వరం తగ్గి పనిలో ప్రవే శించింది. అప్పలమ్మద్వారా కోడలు ఆత్మహత్మ తలపెట్టడం, కొడుకు కోడలు తగువులాటల వివరాలు, కోడలు యింట్లోంచి పోవడం అన్నీ వింది సరస్వతమ్మ.

అప్పలమ్మ వెళ్ళగానే "అవ్వ! ఇదేమిటిరా, మీరిద్దరూ యిలా నలుగురి నోళ్ళలోనూ పడ్డారా? నీవు తిట్టడం, కొట్టడం ఏమిటి, తను చావడానికి మందు మింగడం ఏమిటి? ఏమిటిరా యీ గొడవ? మన పరువేమిటి? మర్యాదేమిటి? ఇలా ఊరువాడా చెప్పుకునేటట్లు తయా రయ్యారా? మతి పోయిందేమిటి నీకు కూడా—"

ఆవిడకి కోడలు ఆత్మహత్య తలపెట్టడం కొడుకు కాపురం కంటె యీ గొడవలవల్ల తమ వంశానికి వచ్చే అప్రతిష్ట ఎక్కువగా కనపడింది.

"అసలేమిటి మీమధ్య గొడవలు? ఎందుకొచ్చాయి? నీవు కొట్టేవరకు ఎందుకెళ్లావు?" నిలేసింది ఆవిడ కొడుకుని.

"కొత్తగా వచ్చిన గొడవేమిటి—పాతవే. కట్నాలు, కాను కలు గొడవే. అవే అలా అలా పెరిగాయి" విసుగ్గా అన్నాడు శివరామ్. అతనికీ వ్యవహారం అంతా తలనొప్పిగా తయారయింది.

"బాగుందిగా! ఏదో పెళ్ళిలో ఏదో అనుకుంటాం. దానికోసం కాపురాలు పాడు చేసుకుంటారా ఎవరైనా?" సాగదీసింది ఆవిడ.

శివరామ్‌కి నీరసంమీద ఒక్క కోపం వచ్చింది. "మీ ఆడ వాళ్లకి రెండు నాలుక లుంటాయి. ఈ గొడవలన్నీ ఆరంభించిందీ, నా మనసు విరిచింది మీరే. ఈ వెధవ ఆడవాళ్ల గొడవలతో నా బుర్ర పాడుచేశారు అందరూ కల్సి. పైగా యిప్పుడు నన్నంటావేం?" తల్లిమీద చూపించాడు ఆ కోపం.

"అయితే నీ పెళ్లాన్ని కొట్టు, తిట్టు అని మేమే చెప్పామా ఏమిటి? ఏదో అనుకున్నవి పట్టుకుని కాపురం పాడుచేసుకుని మామీద విరుచుకుపడతావేం? అంత పెళ్ళాం అంటే అభిమానం వున్నవాడి వయితే మా మాటలు ఎందుకు లెక్క చేస్తావు?" ఆవిడ అంతకంటే తీక్షణంగానే అంది.

"అవునవును, అందరూ నన్నే అనండి. తప్పంతా నాదే" ఉక్రోషంగా అన్నాడు.

"బాగుంది గొడవ? అయినా ఈ రోజుల్లో ఆడపిల్లలు తిడితే కొడితే పడతారా—ఏదో కొన్ని విషయాలు చూసి చూడనట్లు వూరు కోవాలిగాని, తెగేవరకు లాక్కుంటారా? ఇప్పుడు చూడు మనం వాళ్ళకి ఎంత లోకువ అవుతామో—తప్పు మనదయింది. పిలిస్తే వాళ్లదే పై చెయ్యి అయి, నానా మాటలు అంటారు. మీ నాన్నగారికి తెలిస్తే ఏమిటీ గొడవలు మన పరువేంగాను అని తిడ్తారు. రేపు పొద్దున నలుగురికి ఈ వ్యవహారం తెలియకముందే, అందరి నోళ్లల్లో పడకముందే శారదని రమ్మని ఉత్తరం రాయడం మంచిది. ఆలోచించు."

శివరామ్ మాట్లాడలేదు మామూలుగా ఎప్పుడూ ఏదో అన్నాస్తే తనన్న మాటలని పట్టుకుని శారద యింత తెగిస్తుందని ఎదురుచూడని అతనికి ఈ వ్యవహారం ఇంతదూరం వెళ్లాక ఏం చెయ్యాలో అర్థం గాని విషయం అయింది. ఛా....యింత గొడవ జరుగుతుందని తెలిస్తే....అనుకున్నాడు విసుగ్గా. ఆలోచన తోచలేదు.

రెండు రోజులు పత్యం తిన్నాక మర్నాడు ఆఫీసుకి వెళ్ళడానికి నిశ్చయించాడు శివరామ్.

"మరయితే, రేపు నేను బయలుదేరి వెళ్ళిపోతారా శివా!" అంది ఆ సాయంత్రం సరస్వతమ్మ.

శివరామ్ గతుక్కుమన్నాడు. ఇన్నాళ్లు యింట్లో తల్లి వుండబట్టి శారద లేని లోటు అర్థంగాలేదు. రేపటినించి యింట్లో ఎలాగ?

"అదేమిటమ్మా అప్పుడే వెళ్ళిపోతావా? కొన్నాళ్లుంటావను కున్నాను" బేలగా అన్నాడు.

"ఎలా వుంటానురా, అక్కడ యిబ్బందిగదూ?"

"ఇబ్బందికేముంది? అక్కడ వంటావిడ వుందిగా నీవు చేసేవి ఏముంది? కొన్నాళ్ళు వుండమ్మా!"

"బావుందరా! వంటావిడ వుంటే మటుకు నా సంసారం యిల్లు వాకిలి చూసుకోవద్దూ! కమలకి పరీక్షల రోజులు కూడా—మీ నాన్నగారు విసుక్కుంటారు వుండిపోతే" అందావిడ.

శివరామ్‌కి ఇంకేమనాలో తోచలేదు. "నీ ఇష్టం" అన్నాడు మొహం మాడ్చుకుని.

"నే వెళ్ళగానే మీ నాన్నచేత మీ మామగారికి రాయిస్తారే శారదని పంపమని. ఆ—రాక ఎక్కడికి పోతుందిలే! మొగుడు పెళ్లాల కోపాలు ఎన్నాళ్ళుంటాయి?" మాడిపోయిన కొడుకు మొహం చూసి ఓదార్పుగా అందావిడ.

* * *

"మిస్టర్ శివరామ్! ఇది ప్రైవేట్ ఫరమ్ అని—ఇందులో పని చేసేవారిని మూడు నెలల నోటీసుతోగాని, మూడునెలల జీతంతో గాని ఉద్యోగంలోంచి తీసేసే హక్కు మాకు ఉన్నదని నీకు తెలుసను కుంటాను...." అధికారి గంభీరంగా అన్న మాటలు శివరామ్‌కి అర్థం బోధ పడీ పడక గంభీరంగా వున్న ఆయన మొహం చూసి శివరామ్ గతుక్కుమన్నాడు.

వారం రోజుల శలవు తర్వాత తొమ్మిదో రోజు పనిలోకి రాగానే పై అధికారినించి రమ్మన్న కబురు అందుకోగానే ఎందుకో నని, శలవు గురించి అడుగుతాడు కాబోలని అనుకుని వెళ్ళాడు శివ రామ్ కాస్త జంకుగానే—వెళ్ళగానే ఆఫీసరు ఉపోద్ఘాతం లేకుండా అన్న మాటలు వినగానే కలవరపడిపోయాడు.

"ఎస్ సార్!" అనగలిగాడు అతిప్రయత్నంమీద.

"మిస్టర్ శివరామ్! నీ ప్రవర్తన సరిగా లేని కారణంగా నీ ఉద్యోగం టెర్మినేట్ చేస్తూ నీకు మూడు నెలల జీతం యిచ్చి నిన్ను ఉద్యోగం నించి తొలగిస్తున్నాను" మరింత గంభీరంగా అన్నాడు అధికారి.

శివరామ్ మొహం తెల్లగా పాలిపోయింది. హఠాత్తుగా అనుకోని ఈ సంఘటనతో అతను పిడుగుపడ్డవాడిలా నిశ్చేష్టుడయి నోట మాట రాక గుడ్లప్పగించి చూడసాగాడు. తనని ఉద్యోగంనుంచి తొలగిస్తున్నారు. అంటే ఉద్యోగం పోయింది. వెయ్యి రూపాయ లొచ్చే ఉద్యోగం పోయింది. ఇప్పుడేం చేసేట్టు—హఠాత్తుగా మళ్ళీ ఉద్యోగం ఎక్కడ దొరుకుతుంది? దొరికినా ఎన్నాళ్ళు తిరగాలి. ఏడాదిపాటు ఎంత ప్రయత్నిస్తే యీ ఉద్యోగం దొరికింది. ఇప్పుడిది పోతే?—శివరామ్‌కి భయంతో చెమట పట్టింది. "సార్!" నిర్ఘాంతంగా అన్నాడు. "సార్! మీకెవరు చెప్పారో ఏం చెప్పారో కానీ అంతా అబద్ధం సార్! నా పని గురించి కావస్తే నా ఇమీడియట్ బాస్‌ని అడగండి. మరివరినైనా కొలీగ్స్‌ని అడగండి. నా డ్యూటీ నిర్వహణలో లోపం ఎన్నడూ చెయ్యలేదు. ఈ శలవైనా విపరీతంగా జ్వరం వచ్చి పెట్టాను. కావలిస్తే డాక్టర్ సర్టిఫికెట్ తెస్తాను" మాటలకోసం తడుముకుంటూ సంజాయిషీ యీయసాగాడు.

అధికారి అటు చూడకుండా ఏవో కాగితాలు చూస్తూ "నీ డ్యూటీ గురించి అపనమ్మకంతో నిన్ను డిస్చార్జ్ చెయ్యడం లేదు...."

శివరామ్‌కి పోయిన ప్రాణాలు లేచి వచ్చినట్లుంది. "మరి?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నీవు నీ భార్యని హింసిస్తున్నావని, కొట్టి తిట్టి అమానుషంగా ప్రవర్తిస్తున్నావని, ఆమెని భార్యగా మర్యాదగా చూడడం లేదని నీ భార్య స్వయంగా వచ్చి కంప్లైంట్ చేసింది."

శివరామ్ మొహం ఎర్రబడిపోయింది. ఆఫీసరు చెప్పిన కారణం వినగానే తల కొట్టేసినట్లు అవమానం పొందాడు. ఈ శారద కెంత సాహసం. ఆఫీసరుతో కంప్లైంటు చేస్తుందా? కోపంతో మొహం జేవురించింది. కాస్త ధైర్యం తెచ్చుకుని "సార్, అది నా పర్సనల్ మాటర్" అన్నాడు కాస్త పౌరుషంగా.

ఆఫీసరు తలెత్తి శివరామ్ వంక సూటిగా చూశాడు.

"అవచ్చు. కాని నీ మోరల్స్ ప్రిన్సిపల్స్ కాండక్టుతో మాకు

పని వుంది. చదువుండి సంస్కారంలేని, ఇల్లాలిని హింసించే అనాగరికుడిని, కుసంస్కారి మా కంపెనీలో పని చేయడం మా కంపెనీకే అవమానం. మా కిష్టంలేనివారిని పనిలోంచి తీసివేసే అధికారం మా కుంది. ఇంక నీవు వెళ్ళవచ్చు" గంభీరంగా మూడునెలల జీతం, కాగితం ముందుకు జరిపాడు అధికారి.

"మిస్టర్ శివరామ్! వన్ మోర్ థింగ్! ఇంతేగాదు. ఇంకే నీ భవిష్యత్తులో యింకా ప్రైవేటు కంపెనీలలో ఉద్యోగం దొరకకుండా నిన్ను బ్లాక్‌లిస్ట్ చేయగలను. నా పరపతి వుపయోగించి నా తోటి ఫరమ్స్‌కి సర్క్యులర్ పంపగలను."

ఆ దెబ్బతో శివరామ్ జావకారిపోయాడు. ఏదో అనబోయేంతలో అధికారి ఒక కాగితం ముందుకు జరిపి "ఎనదర్ థింగ్. ఆ కాగితం ఏమిటో ఒకసారి చూడు. ఆ కాగితం నేను పోలీసులకి హేండోవర్ చేస్తే నీ గతి ఏమిటవుతుందో నేను చెప్పనక్కరలేదనుకుంటాను. నీ భార్య ఆత్మహత్య చేసుకుంటూ తనని భర్త హింసిస్తున్న కారణంగా ఆత్మహత్యకి తలపడ్డానని రాసినది పోలీసులకిస్తే నీమీద క్రిమినల్ కేసు పెడ్తారు. నీ భార్యకి శిక్ష పడుతుంది. అప్పుడు నీ పరువు ప్రతిష్ఠ—నీ జీవితం ఏమవుతుందో ఆలోచించు....."

శివరామ్ నిస్సహాయంగా చూస్తూ తల దించుకున్నాడు. ప్రాధేయపడి ఆయన్ని ప్రసన్నుడిని చేసుకోవడం మినహా మరో గత్యంతరం లేదని అర్థం చేసుకున్నాడు.

"సార్. ఇకపై ఇలాంటివి జరగవన్ని హామీయిస్తాను. మీ ఆర్డర్ ఉపసంహరించుకోండి సార్" ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

అధికారి కరగనట్టుగా గంభీరంగా చూసి "ఆర్డర్ యిచ్చాక కాన్సిల్ చేసుకోడం సామాన్యమైన విషయంగాదు. ఆర్డర్ ఉపసంహరించుకోవాలంటే నీవు వ్రాతమూలకంగా ఇకపై ఇలా జరగదని హామీ యివ్వాలి? నీ భార్యని క్షమాపణకోరి తిరిగి ఆమెను తెచ్చుకున్నాక నీ ప్రవర్తన సరిగా వున్నట్టు నీ భార్య సంతకంతో ఉత్తరం జతపరచి అప్లికేషన్ పంపుకో. కమిటీ మీటింగ్‌లో నీ కేసుపెట్టి నీ దరఖాస్తు స్వీకరించేది లేనిది తేలుస్తాం. నౌ యూ కెన్ గో." అంటూ ఆఫీసరు

ఓ పైలు లాక్కున్నాడు.

శివరామ్ నీళ్ళు నమిలాడు. "సార్. కానీ ఆమె ఎక్కడుందో నాకు తెలియదు. పుట్టింటికి వెళ్ళివుంటుంది. ఆమె రావడానికి ఆలశ్యం...."

"ఆమె ఎవరో డాక్టర్ విజయ అన్న ఆమెతో వచ్చింది. ఆమె దగ్గిరకి వెళ్ళి వాకబుచెయ్యి...."

శివరామ్ నమస్కరించి, అవమానంతో కృంగిపోయినవాడిలా భారంగా అడుగులువేస్తూ బయటికి వచ్చాడు. ఆఫీసులో ప్రతివాళ్ళ తననే చూస్తున్నట్లు అనిపించి ఎవరివంకా చూడలేనట్టు తలదించుకున్నాడు. ఓ హంతకుడిలా కొందరుచూస్తే,సానుభూతి చూపిస్తున్నట్లు కొందరు చూసారు. కొందరు చెవులు కొరుక్కున్నారు. శివరామ్ ఆ వాతావరణం భరించలేక ఎవరివంకా చూడకుండా, ఎవరితో మాట్లాడకుండా గబగబ బయటపడ్డాడు.

ఆలోచిస్తుంటే అతని వళ్ళు ఆవేశంతో దహించుకుపోసాగింది. ఈ శారద ఎంత పనిచేసింది. తననెలాంటి చిక్కులో పడేసింది! దీనికంత ధైర్యం ఎలా వచ్చింది. ఆ డాక్టరుగాని నేర్పిపెట్టిందా? అతని వళ్ళు వుడికిపోతూంది. ఏదో చెయ్యాలని కసిగా వుంది. కాని ఏం చెయ్యగలడు? పోతున్నాను అంటూ పోయిన భార్యని ఏ మగాడు మాత్రం ఏం చెయ్యగలడు? బలవంతంగా ఇంటికి తీసుకొస్తే మాత్రం ఎన్నాళ్ళు వుంచగలడు? అసలు ఉద్యోగానికే ఎసరు పెట్టిందే! పోతేపోయిందీ వెధవ ఉద్యోగం అని లెక్కచెయ్యకుండా ఆ శారద రోగం కుదిరిస్తే బాగుండు? కాని ఎలా? ఉద్యోగం లేకుండా ఎలా? మరెవరూ కూడా ఉద్యోగం యీయకుండా చేస్తానని బెదిరించాడు? ఉద్యోగంమాట అటుంచి ఊర్లో అంతా ఏం అంటారు? పెళ్ళాం లేచి పోయిందంటే ఎంత అప్రదిష్ట? తమ పరువేంగావాలి! ఇప్పటికే అంతా తనని ఖూనీకోరుని చూసినట్టు చూస్తున్నారు. ఇరుగింటి, పొరుగింటి వాళ్ళంతా మొహంమీదే శారద ఏది ఎందుకెళ్ళిపోయింది అని అడిగేస్తున్నారు. పాలవాళ్ళు, కూరలవాళ్ళు పనిమనిషి ప్రతీవెధవా అడిగేవాడే? ఇదంతా అలా వుంచి ఇంట్లో ఎంత ఇబ్బందిగా వుంది,

శారద వుండగా ఏం తెలీలేదుగాని ప్రతీదానికి తడుముకున్నట్టే వుంది. పెళ్ళికాకముందు ఏమోగాని ఒకసారి ఇల్లాలు అంటూ వచ్చాక ఇల్లాలులేని ఇంట్లో ఎంత ఇబ్బంది! ఛా.... పరిస్థితి ఇలా తయారవుతుందంటే, శారద ఇంతకి తెగిస్తుంటే, కాస్త జాగ్రత్తగా వుండేవాడు? ఇప్పుడేం చెయ్యాలి. నలుగురిలో తలెత్తుకోవాలంటే, ఉద్యోగం నిలబడాలంటే, శారదకి క్షమాపణ చెప్పుకోవాల్సిందేనా." ఆ మాట తలుచుకోగానే అతని పురుషాహంకారం అడ్డు నిలిచింది. ఎంతసేపు ఆలోచించినా అంతకంటే గత్యంతరం కనపడలేదు.

* * *

"డాక్టర్ విజయ మీరే ననుకుంటాను."

"ఎస్." తలెత్తింది విజయ పుస్తకంలోంచి.

"నా పేరు శివరామ్." విజయ శారద భర్తని చూడలేదు కాని పేరు వినగానే చటుక్కున ఆ శివరామేనని గుర్తించింది. నిన్న ఆఫీసరు ఫోన్‌చేసి జరిగింది చెప్పాక శివరామ్ రాకని ఎదురుచూస్తేనే వుంది. కాని ఆ భావం పైకి కనపరచకుండా "ఎస్, వాట్ కెనయ్ డూ ఫర్ యూ' అంది మామూలుగా. 'కూర్చోండి' అంది. శివరామ్ కుర్చీ జరుపుకుని కూర్చున్నాడు. మాటలకోసం తడుముకుంటూ.... 'నేను శారద భర్తని' అన్నాడు నెమ్మదిగా.

"ఏ శారద?" విజయ తెలియనట్టే అడిగింది.

శివరామ్ మొహం సిగ్గుతో నల్లబడింది.

"శారద నా భార్య. మీరు ట్రీట్ చేశారు. ఆమె మీ దగ్గర వున్నదని విని-" అనలేక అన్నాడు.

"అవును, శారద నా దగ్గర వున్న మాట నిజమే. కాని ఆమె మీతో తెగతెంపులు చేసుకున్నానని, తనకి మీకు ఏ సంబంధం లేదని చెప్పిందే. ఆమె నింకా మీ భార్య అనడం చిత్రంగా వుంది." సూటిగా అతని వంక చూస్తూ అతని హావభావాలు పరిశీలిస్తూ అంది విజయ.

శివరామ్ మొహం మరింత ఎర్రబడింది.

"ఏదో ఆవేశంలో .... తొందరపాటులో....ఏదో అన్నమాట నిజమే. అందుకు విచారిస్తున్నాను....ఆ మాత్రం దానికోసం తనిలా

యిల్లు వదిలి రావడం...."

'మిస్టర్. ఆవేశం, తొందరపాటు ఎప్పుడో ఒకసారి వస్తాయి. ఆ మాత్రం కోసం ఏ ఆడదీ భర్తని వదలదు. కాని మీ ఆవేశం తొందరపాటు ఏణ్ణర్థంనించి చవిచూస్తున్న భార్య యీ మాత్రం అనుకొంటూ యింకా మీ పాదాల చెంత పడివుండాలని మీ కోరికా? మీరలా ఆశిస్తే మాత్రం చాలా పొరపడ్తున్నారని చెప్పగలను.' విజయ కాస్త కటువుగా అంది.

శివరామ్ ఆ చూపులని ఎదుర్కోలేనట్టు తల దించుకున్నాడు.

"క్షమించండి. యికపై అలా జరగకుండా చూసుకుంటాను." సగం చచ్చి అన్నాడు.

"మీ క్షమాపణలు నా కెందుకు, శారదకి చెప్పుకోండి, ఆవిడ అంగీకరిస్తే మహారాజులా తీసికెళ్ళండి మధ్య నాదేముంది, వుండండి ఆమెని పిలుస్తాను." విజయ లేచింది.

శివరామ్ గాభరాగా "ప్లీజ్, ఆమెకి మీరు చెప్పండి. యికపై అలా చేయనని నచ్చచెప్పండి" ఆరాటంగా అన్నాడు.

విజయ వింతగా చూసి "అంటే భార్యకి క్షమాపణలు చెప్పుకోడం నామోషీ అనుకుంటున్నారా?"

"కాదు....కాదు. సరే పిలవండి" అన్నాడు తడబడి. విజయ లోపలికి వెళ్ళింది.

"పద....పద మీ ఆయన వచ్చారు. మన ఎత్తు పారింది. దారికి వచ్చాడు." శారదని చూసి నవ్వుతూ అంది విజయ.

శివరామ్ రావడం, మాటలు లోపల గదిలోంచి వింటూనే వుంది శారద.

"వచ్చాడు గదా అని మరీ బెట్టుచెయ్యకు, ఏడుపు మొహంగా వున్నాడు పాపం, కాస్త చివాట్లు పెట్టి, క్షమాపణలు చెప్పించుకుని, ఈ సారికి క్షమించానని చెప్పేయి." రహస్యంగా అంటూ వెంట పెట్టుకు వచ్చింది శారదని విజయ.

శారద గదిలోకి రాగానే శివరామ్ ఆమెవంక చూడలేక సిగ్గుతో, అవమానంతో తల దించుకున్నాడు. ఆఖరికి నోరు పెగుల్చుకుని

"శారదా పద, యింటికి వెడదాం." అన్నాడు.

శారద అతని వంక సూటిగా చూసి "ఏ యింటికి?" అంది గంభీరంగా.

"మన యింటికి!" ప్రాధేయపూర్వకంగా చూశాడు.

"హూ. మన యిల్లు!—నాకా యింట్లో స్థానంలేదని పొమ్మన్నది మీరేగా. గడపదాటి ఎప్పుడయితే వచ్చానో అప్పుడే అది నా యిల్లుగాదు."

"ప్లీజ్ శారదా - జరిగిపోయినదానిని గురించి చెప్పకు. జరిగిన దానికి క్షమాపణ చెపుతున్నాను. యికముందు యిలా జరగదు." అభిమానం చంపుకుని అన్నాడు.

"ఇకముందు యిలా జరగదని హామి ఏమిటి నాకు. నన్ను మనిషిగా, భార్యగా గౌరవంగా చూస్తానని వ్రాసి యిస్తారా?"

"శారదా ఆయన తన ప్రవర్తనకి హామీ యిస్తున్నారుగా. ఆయనికి ఒక అవకాశం యిచ్చి చూడు. మళ్ళీ ఎప్పుడన్నా అతని ప్రవర్తన సరిగా లేకపోతే అప్పుడే వచ్చేయి." విజయ సంధి కుదుర్చుస్తూ అంది.

శివరామ్ అంగీకారంగా తల ఊపాడు.

"చూడండి మిస్టర్ శివరామ్ వివాహ బంధానికి, భార్య అన్న పదానికి మీకు అర్థం తెలుసునా. ఓ స్త్రీ ఎక్కడో పుట్టి తనవాళ్ళందరిని వదులుకుని సూత్ర బంధంతో తనదంతా మీకు అర్పణచేసుకుని మీకు భార్యగా, మీ యింటికి యిల్లాలుగా మీకు సేవలుచేస్తూ మీకు పిల్లలని కని మీ వంశాలని వృద్ధిచేసే సహచరిణి! ఆ స్త్రీకి మీరిచ్చే గౌరవం ఇదా? ఆమె పడే కష్టానికి, ఆమె చేసే సేవలకి ఆమె మీ నించి కోరేదేమిటి? ఆమె ఏ ప్రతిఫలం ఆశిస్తుంది. రవ్వంత ప్రేమ, అనురాగం, ఆ రెండూ మీరు యిచ్చిననాడు ఆమె అంతట ఆమె మీకు బానిస అవుతుంది. ఆ స్త్రీ కోరేది అంతే. ఆ రెండూ కరవయినపుడు ఆమెకి ఏ సంపదలు తృప్తినీయవు! స్త్రీకి పురుషుడు ఎంత అవసరమో, పురుషుడికి అంతకంటె ఎక్కువ అవసరం స్త్రీ. భర్తలేని స్త్రీ జీవితం ఎంత దుర్భరమో, భార్యలేని పురుషుని జీవితము అంతే

అన్న సంగతి యీ కొద్ది రోజులలోనే మీరు గ్రహించి వుండాలి. ఇద్దరి కలయికే సంసారం! ఆ సంసారంలో ఏ ఒక్కరు లేకపోయినా పరిపూర్ణత లోపిస్తుంది. కష్టమో, సుఖమో మంచో చెడో భర్తని భార్య తప్ప ఎవరూ కష్టంలో సుఖంలో ఆదుకోరు. ఒక వయసు వచ్చాక, ఎవరి బతుకు వాళ్ళదయ్యాక ఆఖరికి కన్నతల్లి కూడా పట్టించుకోదు మీ సంగతి! కన్నతల్లీ చెయ్యదు. కన్నపిల్లలూ చెయ్యరు. ఎన్ననుకున్నా భర్తకి భార్య భార్యకు భర్తా తోడయి నిలుస్తారు అన్న సత్యం మీకు అర్థమయే వుంటుంది. యిల్లాలులేని యిల్లు స్మశానంతో సమానం! ఇంటి యిల్లాలిని ఏడిపించి, హింసించిన ఏ మొగాడు జీవితంలో సుఖపడలేదు. ఆడది కన్నీరు కార్చిన ఏ యిల్లూ బాగుపడదు! భర్త ఎన్ని హింసలు పెట్టినా సహించి అతని పాదాల తోడిదే లోకం అని నమ్మి పడివుండే అజ్ఞానురాలు, అశక్తురాలుకాదు ఈ నాటి స్త్రీ. తనకో వ్యక్తిత్వం, ఆత్మగౌరవం వుండాలనుకునే స్థాయికి ఎదిగింది. స్త్రీలని యింత అణచి వుంచాలనే మీ లాంటి పురుషుల అహంకారానికి తలవగ్గని తేటలు నేర్చుకుంది. భార్యా భర్తలయినా గౌరవం యిచ్చి పుచ్చుకోవాలని ఆశిస్తుంది. అదిలేని నాడు ఏ కాపురం నిలబడదు. భర్త వదిలితే స్త్రీకి ఎంత అవమానమో భార్య వదిలితే పురుషులకి అంతకు మించిన అవమానం అన్న సంగతి మీరు యీ పాటికి గుర్తించి వుండాలి. భార్యాభర్తలన్నాక ఏవో చిన్నచిన్న కీచులాటలు తప్పవు. కాని అవి ఆమె వ్యక్తిత్వాన్ని, ఆత్మగౌరవాన్ని దెబ్బతీసేవిగా వుంటే ఏ స్త్రీ సహించదు. కట్న కానుకలని నిరసించాల్సిన మీలాంటివారే అంత స్వల్ప కారణాలతో స్త్రీని హింసించడం అమానుషం. పుట్టింటికి కూడా వెళ్ళలేని అస్వాతంత్రపు బతుకుకి ఏ స్త్రీ తల వగ్గదు ఈనాడు. అధికారంతో కట్టడిచేసి ఏ స్త్రీని మీరు గెలవలేరు. భర్త తనని హింసిస్తున్నట్టు మీ భార్య కోర్టు కెక్కితే మీ పరువేం అవుతుంది. పరువే కాదు కోర్టువారు మీ చేత ఆమె పోషణ ఖర్చు యిప్పిస్తారు అన్న సంగతి మీకూ తెలుసు. ఈ పెళ్ళాంకాకపోతే మహాలక్ష్మి మగాడ్ని నాకేం అనుకునే రోజులు పోయాయి. ఒక భార్యని హింసించి

ఆ భార్య యిల్లు వదిలిపోతే అలాంటి పురుషుడ్ని ఎంత గతిలేని ఆడపిల్లా పెళ్ళికి ముందుకురాదు. మిస్టర్ శివరామ్ నా మాటలు మీకు కష్టం కల్గించవచ్చు. కాని యివి నిజాలని మీకూ తెలుసు. వివాహం అంటే స్త్రీ పురుషులిద్దరూ తమలో కొంతకోల్పోయి,మరికొంత పొంది ఐక్యం సాధించే ఉత్తమ కృషి అన్న సత్యం గుర్తించిన నాడే ఆ వివాహం జయప్రద మవుతుంది." ఆవేశంగా చెప్పుకుపోతుంది విజయ శివరామ్ బుద్ధిమంతుడిలా తలవంచుకుని వింటున్నాడు.

"హియర్—హియర్" శ్రీధర్ నవ్వుతూ చప్పట్లు కొట్టాడు గుమ్మందగ్గిర నిలబడి. "శివరామ్‌గారూ, ఈ పాఠం రాసుకొని ఇంటి కెళ్ళి కంఠస్థా పట్టండి. అప్పుడు మీ సంసారం మూడు పూవ్వులు ఆరు కాయలుగా మారుతుంది" హాస్యంగా అన్నాడు శ్రీధర్.

"తప్పకుండా. చిన్నప్పటినించి ఈ మగాళ్ళందరికి ఇలాంటి పాఠాలు కంఠాతా పట్టించి అప్పగించనివాళ్ళని గోడకుర్చీలు వేయిం చాలి. పాఠాలు ఆరంభించిన రోజునించి స్త్రీ అంటే ఏమిటో, వివాహం అంటే ఏమిటో, స్త్రీని గౌరవంగా చూడాల్సిన అవసరం నేర్పాలి. తాను పురుషుడినని స్త్రీకంటె అధిక్యుడననే భావం చిన్న పిల్లాడిదగ్గిర నించి తొలగించాలి. ఈ సృష్టిలో ఇద్దరూ సమానమే అన్న నీతి పాఠం ప్రతీ పిల్లవాడికి బోధించాలి." విజయ ఆవేశంగా అంది.

"థాంక్స్ మేడమ్. మీ పాఠం మరచిపోను." శివరామ్ నవ్వి "ఇంక నాకు శలవిప్పించండి. శారదా నీ సూట్‌కేస్ ఏది" అన్నాడు.

శారద విజయ చెయ్యిపట్టుకుని మృదువుగా నొక్కి "మీకు ఏమిచ్చి ఋణం తీర్చుకోను" అంది కృతజ్ఞతతో గొంతుపట్టుకోగా.

విజయ శారద భుజంచుట్టూ చెయ్యివేసి దగ్గిరికి లాక్కుని "త్వరగా ఒక కోడలిని కని వడ్డీతో సహా రుణం తీర్చుకో. శివరామ్ గారూ! పాతికవేలు కట్నం మూటకట్టి వుంచండి మా అబ్బాయికి. అంతకు తక్కువైతే వప్పుకోను. లేకపోతే మీ అమ్మాయికి కోడం త్రికం తప్పదు" అంది నవ్వి.

శివరామ్, శారద సిగ్గుగా తలలు వంచుకున్నారు.

"విష్‌యూ ఆల్ ది బెస్ట్" శ్రీధర్ శివరామ్‌తో కరచాలనంచేసి

అభినందించాడు.

"థేంక్స్. థేంక్సు మేడమ్!" శివరామ్ మనస్ఫూర్తిగా నమస్కరించాడు.

"డాక్టర్! నా కొత్త జీవితానికి పునాదులు వేసిన మిమ్మల్ని అభినందించడం మినహా ఏమి యియ్యలేను" శారద యిద్దరికీ నమస్కరించి శలవు తీసుకుంది.

వెడుతున్న యిద్దర్నీ చూసి సంతృప్తితో విజయ మనసు నిండిపోయింది.

శ్రీధర్ విజయ భుజం చుట్టూ చెయ్యివేసి "పద లోపలికి. ఎంతసేపు చూస్తావు అలా" అన్నాడు మృదువుగా. ★

వుంటే—స్త్రీకి స్త్రీయే శత్రువు అయే మన సమాజంలో తోటి స్త్రీని కష్టంలో ఆదుకుని ఆశయం అనుభూతి చూపగలిగే విజయలాంటి స్త్రీలకి—

స్త్రీకి పునర్వివాహం నేరం, ఘోరాపరాధంగా భావించక ఆ స్త్రీల జీవితాన్ని తిరిగి పుష్పింప చేయడానికి హృదయౌన్నత్యంతో చేపట్టగలిగే శ్రీధర్ లాంటి పురుషులకి—

అంకితం.

---

## వచ్చే సంచికలో రెండు నవలికలు

## స్వయంవరం

పాలకోడేటి సత్యనారాయణరావు

## చెడిపోయిన మనిషి

దేవరకొండ (ఆలేటి) నాగమణి

---

# కాళీపట్నం రామారావుతో

ఉదయం పదకొండున్నర గంటల సమయం....

మద్రాసులో అప్పటికే ఎండ 'బ్లేజ్‌వాడ'లో ఉన్నట్లు మండి పోతూ వుంది.

మేష్టారుగారు వస్తానన్న సమయం దాటిపోయింది. ఆయన ఇంకా రాలేదు. ఆయనతో ఎన్నో విషయాలు మాట్లాడాలి....కానీ ఇంకా రారేమిటి?

ఆ....అదుగో వచ్చేస్తున్నారు. పంచె.... జుబ్బా ... దళసరి కళ్ళద్దాలు .... మధ్య తరగతి మందహాసంతో .... ఆయన అచ్చం మేష్టారుగారిలాగే వున్నారు. నిజానికి ఆ కాస్త ఆలస్యానికి అంతగా సంజాయిషీ ఇచ్చుకోనక్కరలేదు. కానీ సహృదయుల స్వభావం ప్రతి కదలికలోనూ గోచరిస్తూనే వుంటుంది.

"సారీ....ఆలస్యం అయింది. గురువుగారు మొత్తానికి దొరి కారు. ఆయనతో మాట్లాడి వస్తున్నాను. అక్కడే ఆలస్యం అయింది."

—ఆ మాటలలో సౌజన్యం, ఆ ధోరణిలో నిరాడంబరత స్పష్టంగా ప్రతిబింబిస్తున్నాయి.

ఆ మేష్టారు శ్రీ కాళీపట్నం రామారావుగారు....ఆ మేష్టారు చెప్పిన గురువుగారు—శ్రీరంగం శ్రీనివాసరావు గారు!

*　　　*　　　*

మేష్టారు 'సీరియస్' కథలు రాశారు. కానీ ఆయన స్వభా వంలో చిన్న పిల్లవాడి పసితనం తొంగిచూస్తున్నట్లు కనిపిస్తుంది.

మేష్టారు కటువైన విమర్శలనుకూడా సౌమ్యంగా స్వీకరిస్తారు. ఆ విషయం అంతకు ముందురోజు జరిగిన ఓ చిన్న సమావేశంలో స్పష్టమైంది.

అవతలి వాళ్ళ వాదనను తప్పు పట్టరు. కానీ తను చేసింది తప్పని అనుకుంటే వెంటనే ఒప్పుకుంటారు.

"ఈ నాడు సాహితీరంగంలో కొన్ని కోట్లు పెట్టుబడి - తమ లాభాలకోసం రచయితల్నీ, పాఠకుల్నీ, 'కండిషన్' చేస్తోంది!"

—కాళీపట్నం రామారావు

తమను ఎవరైనా పొగుడుతూ వుంటే - ఆ మాటలు వినడానికి చాలామంది ఇష్టపడుతుంటారు. ఐతే - మేష్టారుగారు తనను ఎవరైనా పొగిడినా, విమర్శించినా—ఆ మాటల వెనుక వాళ్ళ ధోరణి ఎటువంటిదనీ—చురుగ్గా గమనిస్తూ వుంటారు.

తను రాసిన ఒక కథను-మరో ప్రసిద్ధ రచయిత చాలా గొప్పగా వుందని మెచ్చుకున్నారట. అలా మరికొందరుకూడా ప్రశంసించారట. కానీ 'ఆ కథలో ఏమీ లేదు' అంటారు మేష్టారుగారు—అమాయకంగా....

ఆయన కథల్లో 'ఘూపెక్కిన గంధక ధూమం ..పోటెత్తిన సప్త సముద్రాలు'....కనిపించవు. కానీ...."యుగయుగాల దోపిడిలో ....నరనరాల రాపిడిలో....వగదూరిన .... పొగచూరిన .... శాసనాల జాడలు....జాలిజార్చు గోడలు" కనిపిస్తాయి.

ఆయన సృష్టించే పాత్రల్లోనూ, వాతావరణంలోనూ 'నిజం' కనిపిస్తుంది—నిజాయితీ కనిపిస్తుంది, మేష్టారుగారి పాత్రలు 'అభినయించవు'. పఠితల మనసులను చిందర వందర చేస్తాయి. ఆ పాత్రల

జీవితాల్లోని బాధలు, దుఃఖం, ఆవేశం, ఆక్రందన, అసహాయత....
అన్నిటిలోనూ చదువరుల మనసులు పాలుపంచుకుంటాయి. తత్ఫలితంగా 'వికసించిన విద్యుత్తేజం' వంటిది ఏదో మస్తిష్కాలలో కదులుతుంది! 'మనం ఏదో చేయాలి' అన్నట్లు కదిలిస్తుంది!

"మేష్టారుగారి కథానాయకులు, నాయికలు నేల విడిచి సాము చెయ్యరు. కానీ 'అలజడి మా జీవితం....ఆందోళన మా ఊపిరి....తిరుగుబాటు మా వేదాంతం' అంటారు.

మరైతే....మేష్టారుగారు ఏమంటారు?

* * *

"మీ రచనా వ్యాసంగం ఎలా ప్రారంభమైంది? అందుకు దోహదం చేసిన పరిస్థితులు ఏమిటి?"—రచయితల జీవితంలో అతి ప్రధానమైన ఘట్టానికి, అందుకు సంబంధించిన వివరాల సేకరణకు. తప్పని సరిగా అడగవలసిన ప్రశ్నే ఇది!

"నలభై ఏళ్ళ క్రిందటి సంగతి—ఈ మిట్టమధ్యాహ్నపు ఎండ వేళలో సరిగ్గా జ్ఞాపకం రావడం కష్టం .... అయినా చెప్పడానికి ప్రయత్నిస్తాను.

"మాది ఒక చిన్న పల్లెటూరు. (మురపాక—శ్రీకాకుళం జిల్లా) మా స్థితిగతులు కూడా పెద్దవికావు. నా చదువు పరాయిచోట చాల అగచాట్ల మధ్య గడిచింది. ఇది ఒక స్థితి.

"నా హైస్కూలు చదువు—శ్రీకాకుళంలో సాగింది. అక్కడ సోమంచి వాసుదేవరావుగారి వీధి పంచలో ఉండేవాడిని. ఆయన సుందరకాండ కాబోలు—తెనిగిస్తోండేవారు. వారింటికి కొందరు కవులు వచ్చిపోతూండేవారు.

"కవిరాజుగారి సోదరులు మల్లాది వెంకటకృష్ణశర్మగారు-ఆ వీధిలోనే ఉండేవారు. హాస్య నాటికలు వ్రాసి తమ మిత్రులకోసం చదువుతుండగా అప్పుడప్పుడు వినేవాడిని. పూభా నాకు ఒకటి రెండేళ్ళ సీనియరు. నాగావళి ఇసుక తిన్నెలలో కరుణశ్రీ, వేదుల మొదలైనవారి కవితలు వినిపించేవారు. మల్లెల శ్రీరామమూర్తి కథల పుస్తకాలు చదువుకోమని ఇచ్చేవారు. వలివేటి బాలకృష్ణశర్మగారు కథలు రాస్తారనీ, అవి అచ్చవుతాయని చెప్పుకొనేవారు. ఆ రోజులలోనే మా

మాష్టారుగారి అబ్బాయి వడ్డాది పాపయ్యగారు గీసే కుడ్య చిత్రాలు. వారి అరుగుమీద నిలబడి గంటల తరబడి చూస్తుండే వాడిని. ఈ వాతావరణంలో ఎప్పుడు - ఏ ప్రేరణ వల్లో గుర్తు లేదు గాని - నేను రాయడం ఆరంభించేను. ఆ తర్వాత జబ్బుపడి—ఏడాది పాటు ఇంటి దగ్గర ఉండిపోయేను. మా వూళ్ళో ఓ గ్రంథాలయం ఉండేది. ఆ సంవత్సరం ఎన్నో వందల పుస్తకాలు చదివేను. వేగుచుక్క గ్రంథ మాల ప్రచురణలు, కొవ్వలి, జంపన వగైరాల రచనలు, చాలా నాటకాలు, ముఖ్యంగా 'సాక్షి' ఉపన్యాసాలు, కాశీమజిలీ కథలు—కొన్ని ప్రబంధాలుకూడా చదివేను.

"దరిమిలా స్కూల్ ఫైనల్ పరీక్ష ఇచ్చాక విశాఖపట్నం హిందూ రీడింగ్ రూమ్‌ను ఆశ్రయించాను. అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ, టాగూర్, శరత్, చలం, కొడవటిగంటి, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, గోపీచంద్, ధనికొండ మొదలైనవారి రచనలు - పాతవీ, కొత్తవీ అనక వరసగా చదివేవాడిని.

"వ్రాయాలనే ఇచ్ఛ విశాఖపట్నం వచ్చాకే వ్యసనంగా మారింది."

"మీ తొలి రచన ఏ పత్రికలో ప్రచురింపబడింది? అప్పటి మీ రచనల గురించి...."

"నా రచన చిత్రగుప్త'లో ఓ కార్డు కథతో ప్రారంభమైంది" మీరు నమ్ముతారా అన్నట్టు నవ్వేరు మేష్టారుగారు.

"1943 లో 'చిత్రగుప్త'తో ఆరంభించి ఆనందవాణి, రూపవాణి, తెలుగు స్వతంత్ర, పెద్ద సైజు ఆంధ్ర పత్రికలకు కూడా నాలుగేళ్ళు రాసేను. ఆ రచనలను ఏమనాలో నాకు తెలియదు. 'స్కెచెస్, స్కిట్స్, అల్పికలు, గల్పికలు....అవి ఏవైనా కావచ్చు గాని కథలు మాత్రం కావు. కథల పరిధిలోకి వచ్చే తొలిరచన 'పెంపకపు మమకారం' భారతిలో వచ్చింది."

వర్థమాన రచయితలకు ఆ నాటి కథ సాహిత్యం గురించి మేష్టారుగారి అభిప్రాయాలు తెలుసుకోవాలన్న ఆసక్తి వుంటుంది. అప్పటికీ, ఇప్పటికీ తెలుగు కథలో ఎలాంటి మార్పులు వచ్చాయన్న సంగతీ కొందరు పాఠితలకు ఆసక్తిదాయకమైన విషయమే. ఆ

వివరాలు అడిగితే?........

''కథలు రాయడమే తప్ప సాహితీ ధోరణుల గురించి చెప్ప గల వాణ్ణికాను. తప్పదంటే—ఒకటి రెండు ముక్కలు చెబుతాను.

''అప్పుడు మనకింత బహుళ సంఖ్యలో పత్రికలు లేవు. క్రమం తప్పకుండా వచ్చే పత్రికలు పదిలోపే ఉండేవి అనుకుంటాను. అప్పుడు రచయితల సంఖ్య కూడా చాలా తక్కువ. రాసేవాళ్ళు, చదివే వాళ్ళలోనూ కూడా సాహిత్యానికి సామాజిక ప్రయోజనం అవసరమని భావించేవాళ్ళే ఎక్కువ.

''స్వాతంత్ర్యం వచ్చేక తీరికవర్గాల సంఖ్య పెరుగుతూ వచ్చింది. వాళ్ళ అవసరాలు తీర్చడంకోసం కొత్త పత్రికలతోబాటు కొత్త రచయితలూ వచ్చేరు. ఈ నాడు సాహితీ రంగంలో లక్షలు...కావు....కొన్ని కోట్లపెట్టుబడి—తన లాభాలకోసం, రచయితల్నీ, పాఠకుల్నీ 'కండిషన్' చేస్తోంది. ముప్పై ఏళ్ళ క్రిందట ఈ పరిస్థితిలేదు. పత్రికల్ని నడిపేవారైనా డబ్బుకోసం కాకుండా ఏదో ఒక ఆదర్శంకోసం నడిపేవారు. అందువల్లే ఏవో ఒకటి రెండు పత్రికలు తప్ప తక్కినవన్నీ కాలగర్భంలో కలిసిపోక తప్పలేదు. ఆనాటి సాహితీ రంగం తీరు అది.

"ఇక తెలుగు కథల గురించి చెప్పాలంటే శిల్పం దృష్ట్యా తెలుగు కథ చాలా ఎదిగింది. రావి శాస్త్రిగారన్నట్టు వంటిళ్ళకూ, పడగ్గదులకీ, క్లబ్బురూములకీ పరిమితమైపోయిన తెలుగు కథ వీధిన పడింది. ఇప్పుడు సమాజంలో అన్ని వర్గాలవారి జీవితా లనీ అది ప్రతిబింబిస్తోంది. అయితే అన్ని రంగాల్లోలాగే ఇందులో కూడా కలవారి కష్టాలకు లభించినంత ప్రాధాన్యత—పేదవారి జీవిత పోరాటానికి లభించడంలేదు.''

"ఎంచేతంటారు?"—ప్రశ్న.

"ప్రచురించేవారు, చదివేవారూ కూడా ఆ వర్గాలవారు కాక పోవడం ఒక కారణం. ఆ వర్గంనుంచి తగినంతమంది రచయితలు రాకపోవడం-ఒకవేళ వచ్చినా, తమకు తెలిసీ తెలియని పై వర్గాల గురించి రాసేందుకు ఉబలాటపడుతున్నారే కాని తమ అనుభవంలో ఉన్న తాము—సన్నిహితంగా ఎరిగిన జీవితం గురించి రాసే యత్నం

చేయడంలేదు.

"అలాంటి రచనలకు పాఠకలోకం ఆదరణ లభించకపోవడం కూడా ఓ కారణంకావచ్చు కదా?" అన్న చిన్న సందేహానికి మేష్టారు గారి సమాధానం.

"అలా అనుకోవడానికి దాఖలాలు లేవు. బాగా రాసినదాన్ని ఏ వర్గం గురించి రాసినా జనం ఆదరిస్తున్నారు. రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారి రచనలపట్ల పాఠకులకు ఉండే ఆదరణే అందుకు తార్కాణం" అంటూ తమ అనుభవం గురించి ఇలా చెప్పేరు.

"మొదట్లో నేను మధ్య తరగతివారి కథలే రాసేవాణ్ణి. ఆ రోజుల్లో వాటికుండేపాటి ఆదరణ వాటికున్నా, ఈ నాటి నా కథలపై గల ఆదరణతో పోల్చిచూస్తే—అది చాలాతక్కువ అనే అనిపిస్తుంది" అంటూ తమ రచనా ధోరణుల్లో ఏర్పడిన తేడాలను గురించి ఇలా వివరించారు.

"ఆ రోజుల్లో నేను రాసిన కథలు—రాగమయి, అభిమానాలు, అభిశప్తులు. ఆశ, అవిద్య, పలాయితుడు....ఈ పేర్లనుబట్టే అవి ఎలాంటి రచనలో ఊహించవచ్చు. టూకీగా చెప్పుకోవాలంటే అవి మధ్య తరగతివారి మానసిక రుగ్మతలను పెద్దచేసి రాసినవి. రాసేవాణ్ణే కాని అప్పటికీ ఆ కథలు నాకు తృప్తి నిచ్చేవికావు.

"ఇలావుండగా 1953 లో శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారితో స్నేహం ఆరంభమయింది. వారితో సన్నిహితంగా వుంటూ, వారి రచనలు పరిశీలనగా చదువుతూ, సాయంకాలవేళ వారూ వారి మిత్రులు చెప్పుకునే కబుర్లువింటూ—మూడు నాలుగేళ్ళు గడిచేసరికి మధ్యతరగతిదైనా, మరేతరగతిదైనా—జీవితంలో దేని గురించి కథ రాయాలో దేని గురించి రాయనక్కర్లేదో నాకు తెలియదని, అంతవరకూ నేను రాస్తూ వచ్చిన కథల్లాంటివి రాసినా మానినా ఒకటే నని నాకు అనిపించింది. అందుచేత కొంతకాలం రాయడం మానేశాను.

"ఇంకో ఐదారేళ్ళకు విశాఖ రచయిత లందరూ 'నేనెందుకు రాస్తున్నాను?' అనే శీర్షికతో వ్యాసాలు రాయడం జరిగింది. అప్పట్లో నేను కూడా ఒక వ్యాసం రాశాను. నిలిపివేసిన రచనా వ్యాసంగం మళ్ళీ కొనసాగించాలనుకున్నాను. ఈ సారి ఇతివృత్తాలకోసం—

వ్యక్తుల కుటుంబ జీవితాలను వెవకరాదని, సమాజంలో జనం సాగిస్తున్న జీవన పోరాటాన్ని గురించి వ్రాయాలనీ అనుకున్నాను. నోరూమ్, యజ్ఞం, ఆర్తి, శాంతి, చావు వంటి కథలు నేను బాగా చెప్పలేకపోయినా, నలుగురికీ నచ్చడానికి కారణం ఆ కథల ఇతివృత్తాలు—బలమైనవి కావడమే."

"మిమ్మల్ని ప్రభావితం చేసిన రచయితలెవరో—మీ స్నేహ బృందంలోని రచయితలెవరో—ఆ విశేషాలు చెప్పగలరా?" అన్న ప్రశ్నకు మేష్టారుగారు చాలా వివరంగా జవాబు చెప్పారు.

"సాహిత్యంపట్ల గౌరవ విశ్వాసాలు, రచయితగా నాకో దృక్పథం ఏర్పరచిన వారిని చెప్పుకోవలసివస్తే—శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు ఆద్యులు. రచయితగా నన్ను నేను దిద్దుకోడానికి సహాయపడ్డవారు చాలామందున్నారు. ఆవిషయంలో టాగూర్, శరత్, విశ్వనాథ మొదలుకొని, నిన్న మొన్న కథలు చెప్పడం ఆరంభించిన రచయితలవరకూ ఎందరికో ఋణపడి వుంటాను. ఇందులో తక్కిన వారందరూ ఒకఎత్తు. రావి శాస్త్రిగారు ఒక్కరే ఒకఎత్తు.దారితప్పిన నా రచనా వ్యాసంగాన్ని వారి స్నేహ సావాసాలే సరైనదారిని పడేశాయి.

"రచయితలు, రచయిత్రులు ఈనాటి సాంఘిక స్థితిగతులను, సమస్యలను తమ రచనల్లో ప్రతిబింబిస్తే చాలని, తద్వారా ఆ సమస్యలకు తగిన పరిష్కారం ప్రజలే నిర్ణయించుకుంటారనీ కొందరుభావిస్తూ వుంటారు. ఈ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?"—ప్రశ్న.

"మొట్టమొదట రచయితలు ఉన్న నిజాలను చెప్పడం పట్ల ఉండే భయాన్ని వదలుకోవాలి. పరిష్కారాన్ని చెప్పడం, అది ఎలా చెప్పడం అన్నది తీసుకున్న ఇతివృత్తాన్ని బట్టి, రచయిత నైపుణ్యాన్ని బట్టి ఉంటుంది. రచయిత తన ప్రతిభతో సరైన పరిష్కార మార్గమేదో ఆసక్తిదాయకంగా చెప్పగలగడం మంచిదే. ఆ మాటకొస్తే అది రచయిత బాధ్యత కూడా! ఐతే-కథా రచనలో భావంయొక్క ప్రాధాన్యత - భావ ప్రకటనా శిల్పంలో దెబ్బతింటే - ప్రయోజనం ఉండదు. అంతమాత్రంచేత కేవలం శిల్పమే ప్రధానంగా రచన చెయ్యడంపట్ల నాకు సదభిప్రాయంలేదు. భావం చక్కగా చెప్పి, శిల్పంలో దెబ్బతిన్నా ఫరవాలేదు కానీ, భావం

లేని శిల్పంవల్ల పాఠకుడికి ఒరిగేదేమీ వుండదు."

ఇలా అంటూ పాఠకుల ఆలోచనా ధోరణి గురించి మరో ఆసక్తిదాయకమైన 'కామెంట్' ఒకటి—మేష్టారు చెప్పారు.

అదేమిటంటే—"సాధారణంగా మనిషి తత్వం అవతలి వ్యక్తి సంబంధించిన విషయాలను తెలుసుకోవాలనే కుతూహలంతో ముడిపడి వుంటుంది. అంటే—ఒక రకమైన Peeping Tom మనస్తత్త్వం అన్నమాట. ఆ విధంగా ఎటువంటి సంఘటనలైనా, ఎలాంటి అభూత కల్పనలైనా, మరో వ్యక్తి కథగా చదువుకొంటున్నప్పుడు - రచయితలు కల్పించే అవాస్తవిక వాతావరణపు ఆకర్షణలకు—ఎక్కువమంది పాఠకులు—అంటే అంతగా మానసిక పరిపక్వతని పాఠకులు లోబడిపోతే మనం-ఆశ్చర్యపడనక్కరలేదు" అన్నారు.

ఈనాడు వస్తున్న పలాయనవాద సాహిత్యం గురించి, రచయితలు దేనికోసం రాయాలి అన్న విషయం గురించి మేష్టారు గారిలా అన్నారు.

"సరదాకో - పేరు కోసమో, లేదా వృత్తిగానో రాసే రచయితలను విడిచి—సామాజిక ప్రయోజనమే లక్ష్యంగా గల రచయితల్లో కూడా అనేక ధోరణులు కనిపిస్తాయి. కొందరు రచయితలకు కులమత భేదాలు పోవాలి కాని ఆర్థిక అసమానతలు మాత్రం అలాగే వుండాలి. ఇంకొందరికి ప్రభుత్వం—కొత్త కొత్త ఫ్యాక్టరీలు, పరిశ్రమలు విరివిగా స్థాపించేయాలి. ఎందుకు? ఉత్పత్తులు పెంచడానికి కాదు. నిరుద్యోగ సమస్యను నిర్మూలించడానికి; ఆ నిరుద్యోగం కూడా ఎలాంటిది? వాళ్ళ లెక్క ప్రకారం 'ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజి'లలో పేర్లు నమోదైన వారే నిరుద్యోగులు. పారిశ్రామికీకరణలకళ్ల వృత్తులు చెడి, ఇంతకుముందే నిరుద్యోగులైన లక్షలాది శ్రామికులు ఉన్నారు. వారి బ్రతుకులు ఏం కావాలన్నది వారికి పట్టదు. ఇంకా కొందరికి ఈ వ్యవస్థ సమూలంగా మారవలసిందేకాని అందుకోసం ఏవిధమైన బల ప్రయోగాన్ని వాళ్ళు హర్షించరు. తమ సమస్యలనే లోక సమస్యలుగా నిర్ధించే దశలో ప్రతి రచయిత కొంతకాలం ఉంటాడు. ఆ దశలోను, అంతకుముందూ—వారు ఎందుకు రాయాలో చెప్పి లాభంలేదు. ఆ దశ గడిచిన తర్వాత వారికి

ఇంకొకరు చెప్ప నవసరమూ లేదు."

—ఇలా మేష్టారుగారు తాము నమ్మిన సత్యాలను లలితంగానే చెబుతారు. ఇంత లలితంగానూ మాట్లాడే కా. రా. మేష్టారుగారికి—ఘాటైన కారా కిళ్ళీ చాలా తరచుగా వేసుకోవడం ఎలా అలవాటైంది!

"నా చిన్నప్పుడు మా మేష్టారుగారు నన్ను కారాకిళ్ళీ తీసుకు రమ్మని పంపించేవారు. ఆయనకు ఒక కిళ్ళీ కట్టిస్తూ—నాకొకటి కట్టుకునేవాణ్ణి. అలా ఇది అలవాటైపోయింది!"

గొప్పవాళ్ళ ధోరణిలో—అమాయకమైన పసితనం అప్పు డప్పుడూ కనిపిస్తుంది. రామారావు మేష్టారు కారాకిళ్ళీకి అలవాటు పడిపోవడంలోనూ అదే ధోరణి కనిపించింది!

ఆతర్వాత సంభాషణ యితర విషయాల వైపు మళ్ళింది!

మేష్టారుగారి రచనల్లాగే - ఆయన మాటలూ ఆసక్తిదాయకంగా వుంటాయి. మేష్టారుగారు సౌమ్యంగా కనిపించినా ఆయన హృదయంలో అగ్నిపర్వతాలు రగులుతున్నాయేమోనని అనిపిస్తుంది.

మేష్టారు—తమ మాటలలోలాగే కథల్లో—గొప్ప గొప్ప జీవిత సత్యాలను చెబుతుంటారు.

గానుగెద్దు జీవితాలకు అలవాటుండే జనాన్నుద్దేశించి 'చావు' కథలో ఒక పాత్రద్వారా మేష్టారు చెప్పిన మాటలు చూడండి.

"వంద తరాలే అయిందో, రెండొంద ల్తరాలే అయిందో, ఇంకా ఎక్కువ కాలఁవే అయిందో—ఆల్లక్కడ, మనఁవిక్కడ; ఆల్లనాగా, మనమినాగా వుండడానికి కారణం సెపతాను. మనఁ వెవ్వారం ఎవడిమటుకాడు తిన్నగా సూడం. అక్కడోడో, ఎవడో ఒకడొచ్చి మనకి దారి సూపాల. మన్లో సూడగల తొత్తుకొడుకెవడే నుంటే, మన్నాడే ఆల్లల్లో కలిసిపోతోన్నాడు. మనోల్లల్లో వున్నాల్లందరూ ఈణాటోల్లే...."

ఐతే ఒక్క విషయం. మేష్టార్లాంటి రచయితలు ప్రపంచానికి సరైన దారి చూపే రచనలు చేస్తుంటే—ఇప్పుడు కాకపోతే-రేపైనా 'ఆల్లల్లో కలవని వాళ్ళు' - ఒకరో - ఎందరో తప్పక ఒక రోజొచ్చి-'దారి' చూపక మానరు. ఆ దారి నవ సమాజ నిర్మాణానికి చక్కని రహదారిగా రూపొందాలని అందరం ఆశిద్దాం! —ఈశ్వర్



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M116 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 127 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Ashwini |
| పేజీలు విడదీసినది | Thaesin |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |